# తాళ్ళపాక పద సాహిత్యం

**ఐదవ సంపుటం**

అన్నమయ్య ఆధ్యాత్మిక గ్రంథాలయం,

గుంటూరు

రేకు: 0001-1 శ్రీరాగం సం: 05-001

పల్లవి: ఏ వూరికేవూరు యెక్కడికి నెక్కడ
నీవు మాకు నిఁకనేల నిజమైనాఁ జెప్పరా

చ. 1: అద్దమరాతిరిదాఁకా నందునిందు నుండివచ్చి
వద్దువోరా నీకునింత వలసినొల్లములు
నిద్దుర గంటికి లేక నీకునుండ వారమా
వొద్దిక చాలని వారముండినా నుండితిమి

చ. 2: వేఁకమైన పరితాప వేదనఁ బొరలలేక
కాఁక పుట్టి తిరిగేవు కన్నుగానలేక
యేఁకట దీర నీకు నెందరు గలరని
వోఁకల పులుసు కలువులఁ బుచ్చవలెనా

చ. 3: అందఁగాఁడ తిరువేంకటాద్రీశ పెక్కిండ్ల-
విందవై నీవొకతెపై వెచ్చఁదిన మున్నాదా
మందెమేళము నీతో మాటలాడితిమి గాక
కందువ మన్నన చాలు కలకాల మెల్లను

రేకు: 0001-2 భైరవి సం: 05-002

పల్లవి: గందము వూనేవేలే కమ్మని మేన యీా-
గందము నీమేనితావికంటె నెక్కుడా

చ. 1: అద్దము చూచేవేలే అప్పటపట్టికిని
అద్దము నీ మోముకంటె నపురూపమా
ఒద్దిక తామరవిరినొత్తేవు కన్నులు నీ-
గద్దరికన్నులకంటె కమలము ఘనమా

చ. 2: బంగారు వెట్టేవేలే పడఁతి నీ మెయినిండా
బంగారు నీతనుకాంతి ప్రతివచ్చీనా
ఉంగరాలేఁటికినే వొడికిపువేళ్ళ
వెంగలిమణులు నీ వేలిగోరఁబోలునా

చ. 3: సవర మేఁటికినే జడియు నీ నెరులకు
సవరము నీకొప్పుసరి వచ్చీనా
యివలఁ జవుల నీకునేలే వెంకటపతి -
సవరని కెమ్మో విచవికంటేనా

రేకు: 0001-3 ఆహిరి సం: 05-003

పల్లవి: దంటమాటలనె నన్నుఁదాఁకనాడేవు వోరి
జుంటితేనె తీపులెల్లఁ జూరలాడేవా

చ. 1: అత్తయింటికోడల నన్నుమ్మమీఁద నేరా నీ-
తొత్తుఁ దిట్టినట్టె తిట్ట దొరకొంటివి
మెత్తనైతే దిగఁబడి మేరమీరి యింతలోనే
ఒత్తుక వచ్చేవు చక్కనుండ నేరవా

చ. 2: పంతపు మగఁడు గల పడఁతి నన్ను నేరా నీవు
కొంతైనా వెఱపులేక గోరనంటేవు
ఇంతలోనే వేలువెట్టి యిమ్ముగైకొని వలపు
దొంతులు వేరిచేవు బడుకనియ్యవా

చ. 3: ఊరివారి యింతి నన్ను వుద్దండపుఁ దుటారాలఁ
బేరుకుచ్చి సోలయుచుఁ బిసాళించేవు
గారవించి తిరువేంకటరాయ నీవు నన్ను
యేరా నాగుట్టంతయు బాయిట వేసేవా

రేకు: 0001-4 ఆహిరి సం: 05-004

పల్లవి: సంగతెఱిగవు చీ జాణనందువు
మంగలాన జాజులు వేమారు వేఁచేవు

చ. 1: అంగన వొకతె నీకు ఆకు మడి చియ్యఁగా
బంగారుతూఁగు మంచముపై నీవుండి
వుంగరాల వేళ్ళతో నువిదమొలనూళ్ళు
చెంగటఁ జాచిన ఆచేత నన్నంటేవు

చ. 2: పడఁతి వొక్కతె నీకు పాదములొత్తఁగను
బడలి కప్పురశయ్యపై నీవుండి
కడుఁ దమకమున నెక్కడో మోవఁ జాఁచిన
పడిగపుఁ బాదాలు నాపైఁ బారఁజాఁచేవు

చ. 3: ఇచ్చల నొక్కతె గుబ్బలెదురు చూపఁగను
పచ్చలు దాచిన మేడపై నీవుండి
వెచ్చని మేనితోఁ గూడి వేంకటేఁశుడ నీ
వెచ్చపుఁ గౌఁగిట నన్ను వేసాలఁ బెట్టేవు

రేకు: 0001-5 కాంబోది సం:05-005

పల్లవి: రాకుంటే మానుఁగాక రంతులేఁటికే
వేఁకపు గుబ్బలాండ్ల విటుఁడాఁతఁడు

చ. 1: అంపిన కప్పురమొల్ల నంటేఁ దాననుఁ గాక
వంపు మోముతోడ నీకు వాడనేఁటికే
చెంపల లప్పలు నిండఁ జెరిగిన కప్పురపు -
గంపకొప్పుల సతుల ఘనుఁడాతడు

చ. 2: ఒద్దికగాకక్కడనే వుంటే దానుండుఁ గాక
ముద్దుమోము వంచి నీకు మొక్కనేఁటికే
చద్దికి వేఁడికి మంచిచక్క సతుల మోవి
పొద్దునొద్దుకారగించే భోగి యాతఁడు

చ. 3: అబ్బురపు వేంకటేశుఁడైతే దానవుఁ గాక
గబ్బి చూపులెల్లా నీకై గప్పనేఁటికే
జొబ్బిలేటి జవ్వాదిసోనల పన్నీట నన్ను
గుబ్బలంటి సరసానఁ గూడెనాతఁడు

రేకు: 0002-1 శ్రీరాగం సం: 05-006

పల్లవి: తగిలిన మునులే యాతనిఁ గందురంటా
మగువ యెవ్వరితోడ మాటాడదిపుడు

చ. 1: అతులనిరాహారులతనికిఁ బ్రియులంటా
అతివ నిన్నటినుండి యారగించదు
తతి నడవులనుండే తపసులే యతనికి
హితులంటా వనములో నెడయదీతరుణి

చ. 2: తలకొన్న యతనిపై తలఁపే పరమంటా
చెలియ చెక్కిటనున్న చెయి దియ్యదు
వలనైన యతఁడు దేవతల కొడయఁడంటా
కలికి రేయిఁబగలు కనుమొయ్యదిపుడు

చ. 3: అడరి జలములోన నతఁడుండునంటా
వడియుఁ జెమట దుడువదు మేనను
కడు మంచియతఁడు వేంకటగిరిభుఁడంటా
పడఁతి యాతనినె గుబ్బలనొత్తీ నిపుడు

రేకు: 0002-2 ముఖారి సం: 05-007

పల్లవి: ఏఁటికి విచ్చేసితివో యెట్టుదెలుసు మాతో
మాటలాడఁగా నీకు మాటవచ్చీఁ జుమ్మీ

చ. 1: అప్పన గొంటివో లేదొ ఆకెచేత నేఁడైనా
ఇప్పుడే మాయింటిదాఁక నేఁగేనంటా
యిప్పటి యీతమకాన యింతలోని పనికిఁగా
చెప్పక వచ్చిననాకె చేరనీదు సుమ్మీ

చ. 2: అనుచరించితో లేదో ఆకెనో ముందరనైనా
వెనక నాతోడ నవ్వేవు గాని
ఘనుఁడు వూరకే నన్నుఁ గదిసేవు కడుఁబై-
కొనఁగ నాకె విన్న కోపగించుఁ జుమ్మీ

చ. 3: ఆరగించితో లేదో ఆకెపొత్తుననే యింత
గారవము లేక మోము కళదేరదు
చేరి కూడితివి నన్ను శ్రీ వేంకటేశుఁడ యింత-
యీరసాన నాకె విన్న యేమనునో సుమ్మీ

రేకు: 0002-3 ఆహిరి సం: 05-008

పల్లవి: కోపములిద్దరిలో గోరగించీఁ జూడరే
పైపైనె జవరాలు పంపెడి నింతులను

చ. 1: అమ్మ విలువఁగనంపె నాతని రమ్మనరే
దిమ్మరై వీదులవెంట దిరిగీనని
కమ్మరఁ గమ్మరనేల కలహమిద్దరిలో
దుమ్ములుగాఁ గస్తూరి ధూళి లేచె మేనులు

చ. 2: దేవులమ్మ నిలిచీన దేవుని రమ్మనరే
ఆవలనెవ్వతెకు లోనాయెనో యని
తావుల బుగులడిచి తను వెల్లానిదివో
లావాయ జగడాలు లలనకుఁ దనకు

చ. 3: లకిమమ్మ కేమైనా లంచము లిమ్మనరో
శుకవాణి తలపు మూసుక తియ్యదు
వెకలియై సతిఁగూడె వేంకటేశ్వరుఁడు
ఒకరొకరికి లోలో నొద్దికలు ఘనము

రేకు: 0002-4 ముఖారి సం: 05-009

పల్లవి: ఆతఁడే యెఱఁగడా ఆకెలాగు
రాతి గుండెతోడఁ దా రాకుంటే మానినీ

చ. 1: అద్దో నేమెందాఁకానైనాఁ గాచుకుండలేము
వొద్దనే యెంతవడైనా నోసి రావే
అద్దికపువారము నేమమ్మ గడుఁ గోపగించీ
వొద్దువోయ రాకుంటేఁ బోనీవే తాను

చ. 2: అంతేవో మదిరాక్షి యాడ మాకెదురు చూచీ
ఏంతైనా గద్దుపని యీడనేలోసి
వొంత నూడిగము సేసే పొద్దాయ దేవులకు
కాంతుఁడు మీఁదటియెత్తు గననీవే తాను

చ. 3: మేలే వేంకటపతి మెల్లనే విచ్చేసినాఁడు
వేళమె అక్కకు విన్నవింతమోసి
అలకించి వుండుదము అందరము వాకిటను
లోలోఁ దానాకెఁ గూడి లోలుఁడాయఁ దాను

రేకు: 0002-5 ఆహిరి సం: 05-010

పల్లవి: ఇంత మమ్మిట్లా నెలయించకురా నీ
పంతములన్నియు బార బట్టింతునోరి

చ. 1: అతిరాజసపు మాటలాడకురా యే-
కతమైన నాచేతఁ గడు నొత్తువోరి
ఇతరులవలె నన్ను నెంచకురా నీఁ
మతి చొచ్చి నీమేను మఱపింతునోరి

చ. 2: చెలఁగుచు గుంపెనలు సేయకురా నీ-
సిలుగు మాటల నిన్నుఁ జిక్కింతునోరి
చలివలపులు మాపైఁ జల్లకురా యీా-
కులుకు గోళ్ళ నిన్ను గుంపింతు -నోరి

చ. 3: జంకెనచూపులఁ బగ చాటకురా నే-
నింక నిన్నుఁ బోనియ్య నెంతైన నోరి
లంకెల నీ పొందులు దలఁచకురా తిరు-
వెంకటేశ నానేరుపు వెచ్చింతునోరి

రేకు: 0002-6 సామంతం సం: 05-011

పల్లవి: ఇచ్చకాలు నాకు నీకు నిఁక నేలరా నీ-
యచ్చపుఁ గోరిక నాతో నానతీరా వోరి

చ. 1: అమ్మితి నామేను నీకు నప్పుడె వోరి చూపుఁ-
జిమ్ముల నేఁచకేమైనాఁ జిత్తగించరా
అమ్మకచెల్ల నే నీకు నడ్డమా వోరి యింపు
గుమ్మరింపుచు నాగుట్టు కొల్లగొంటివోరి

చ. 2: జట్టి గొంటివిదె నన్ను జాలదా వోరి యీ-
చిట్టంట్ల నీవేఁచక చిత్తగించరా
ఎట్టైనా నేనీకింత యెదురా వోరి నీ-
పట్టిన చలమే చెల్లె బాపురా వోరి

చ. 3: వేసాల వేంకటగిరివిభుఁడా నేఁడోరి నీ-
సేసిన మన్ననలిట్టె చిత్తగించరా
వాసన కస్తూరిమేని వన్నెకాఁడ నీ-
యాసల మేకులే దక్కెనద్దిరా వోరి

రేకు: 0003-1 శ్రీరాగం సం: 05-012

పల్లవి: మగువ పూర్పులనైన మనుఁగా చలిగాలి
నిగుడుఁగా జగమెల్ల నిండఁ దనరూపు

చ. 1: అతివవదనము వాడ నలరి చందురుఁడైన
బ్రతుకుఁగా వొకకొంత బయలుమెరసి
సతి యెలుఁగు రాయ విరసపు బికావళియైన
తతిఁ జెలఁగుఁగా నేడు తమకెదురు లేక

చ. 2: తెఱవ వేనలి చెదర తేఁటి మొత్తములైన
మెఱయుఁగా వొకకొంత మేలుగలిగి
ఒఱగి యలసతతోడ నువిద కనుమోడ్పుగా
నెఱిఁ గలువలలరుఁగా నేఁటిమాపైన

చ. 3: తరుణి దేహము నాటి దర్పకుని శరమైన
పరిమళము నిండుగా బహువిధమున
కరిగమననిపుడు వేంకటవిభుఁడు కౌగిటను
కరుణించ లతలైనఁ గాంచుఁగా తెలివి

రేకు: 0003-2 సామంతం సం: 05-013

పల్లవి: ఎట్టు వోరిచెనో కాని యింత దడవు- అప్పు-
డట్టు నిట్టుఁ దల్లడించె నతఁడంతలోననే

చ. 1: అంటఁగాక వున్నదానవని యెఱుగక యాతఁ-
డింటికిట్టె రాఁగా నీవు నెదురువోయి
వొంటకున్నరీతి దవ్వులనున్న నినుఁ జూచి
అంటఁజేరి చిన్నఁబోయె నతఁడంతలోననే

చ. 2: వేడుక నాతఁడు రాఁగా వెనకవెనకకుఁ బోయి
తోడనే సిగ్గును నవ్వుఁ దొలఁకఁగాను
వీడి వీడని కొప్పు విసరుచుఁ దలయూఁచ-
నాడనే మూర్ఛవోయె నతఁడంత లోననే

చ. 3: చయ్యనఁ బన్నీటి మజ్జనమాడి నీవు నేఁడు
ఉయ్యాలమంచముమీఁద నుండఁగాను
నెయ్యపు వేంకటపతి నినుఁగూడి పరవశ-
మయ్యీనబ్బురముగ నతఁడంతలోననే

రేకు: 0003-3 రామక్రియ సం: 05-014

పల్లవి: రాగదే చూతఁడిదె రసికుఁడగు కెలవాడిఁ
కౌఁగిటి రమణితోడ కనకగిరి వాని

చ. 1: అదిగదె వసంతంబులాడీఁ గూడి
కదలుఁగనుఁ గవల చక్కని సతులతో
వెదకి పై కుంకుములు వేసీ రాసి
వుదుటుచనుదోయిపై నొదిగి వొదిగి

చ. 2: కడుఁ బేర్చి నేతికడవల గుబ్బెతలఁ జేరి
అడుగడుగునకు నాటలాడి
నడిమి సన్నపుసిరుల నగవు రెప్పల గరుల
తొడికి చెనకీనదివొ దొరదైవము

చ. 3: దప్పి దేరంగ సైఁదపుగుడుములును వడలుఁ
బప్పులునుఁ బన్నీటి పానకములు
అప్పఁడగు కెలవాడి అదె కనకరాయఁడై
కప్పురము చల్లి చక్కని సతులపైని

రేకు: 0003-4 భైరవి సం: 05-015

పల్లవి: సిన్న వాఁడవని నమ్మ సెల్లదు నిన్ను
సిన్నైన యాటదెల్ల సిక్కుసీరై పోయను

చ. 1: అవుర బాలకిసునరాయఁడ నీవు సంటిపాలు
నవులంటా నెత్తురెల్ల సప్పరించఁగా
కవకవ నవ్వినవ్వి కన్నులు దేలగిలఁగ
సవరన్ని యాటదెల్ల నప్పుసారై పోయను

చ. 2: రారా గోపాలకిసునరాయ నీవదె గొల్ల-
వారి మగువల సూపు వల్లె వేయఁగా
సూరఁబోయే రేపల్లె సొక్కని గుబ్బెతల-
సేరలంతల కన్నుల సిన్ని సిన్ని సిగ్గులు

చ. 3: కిన్నెర వెంకటగిరి కిసునరాయఁడ నీవు
వన్నెలుగ వీది వీది వాయించఁగా
మిన్నుదాఁకి లోకానకు మేఁటియైన లకిమమ్మ
నిన్ను సేరి సరుగన నిలుసుండే సొక్కెను

రేకు: 0003-5 కాంబోది సం: 05-016

పల్లవి: పొద్దు వొద్దుకును వలపుల నేఁచేవు వద్దు
బుద్దిగాదు నీకు నేప భువనమోహినిని

చ. 1: అప్పుడు మా విన్నపము లాలకించఁ బొద్దులేక
యిప్పుడు విచ్చేసినాఁడవిఁక నైనాను
చెప్పరాని విన్నియును చిత్తగించి చూతు గాని
చప్పర మంచములోని చక్కని కోమలిని

చ. 2: అలసి మాతోడ మాటలానతియ్య వేళగాక
యెలయించ వచ్చినాఁడ వింతలోననే
సొలపు మాటలు గావు చూడు నీవే మేడమీఁద
చెలులపైనొరగిని జిగి గుబ్బలాఁడిని

చ. 3: వేఁగెడి రమణిఁ జూచి వేగినంతకు రావైతి
మాఁగెఁగా యింతట నీ మనసైనాను
వేఁగు వచ్చెనా నీకు వేంకటేశ కృపఁజూడు
కాఁగిట నవధరించు కన్నుల కలికిని

రేకు: 0003-6 ముఖారి సం: 05-017

పల్లవి: ఇదిగాక సౌభాగ్య మిదిగాక తపము మఱి
యిదిగాక వైభవంబిఁక నొకటి కలదా

చ. 1: అతివ జన్మము సఫలమై పరమయోగివలె-
నితర మోహాపేక్షలిన్నియును విడిచె
సతికోరికలు మహాశాంతమై యిదె చూడ
సతత విజ్ఞాన వాసనవోలె నుండె

చ. 2: తరుణి హృదయము కృతార్థతఁ బొంది విభుమీఁది
పరవశానంద సంపదకు నిరవాయ
సరసిజానన మనోజయమంది యింతలో
సరిలేక మనసు నిశ్చల భావమాయ

చ. 3: శ్రీవేంకటేశ్వరుని జింతించి పరతత్వ-
భావంబు నిజముగా బట్టెఁ జెలియాత్మ
దేవోత్తముని కృపాధీనురాలై యిపుడు
లావణ్యవతికి నుల్లంబు దిరమాయ

రేకు: 0004-1 వసంతం సం: 05-018

పల్లవి: శోభనమే శోభనమే
వైభవముల పావనమూర్తికి

చ. 1: అరుదుగ మును నరకాసురుఁడు
సిరులతోఁ జెరలుదెచ్చిన సతుల
పరువపు వయసుల బదారువేలను
సొరిదిఁ బెండ్లాడిన సుముఖునికి

చ. 2: చెందిన వేడుక శిశుపాలుఁడు
అంది పెండ్లాడఁగ నవగళించి
విందువలెనె తా విచ్చేసి రుకుమిణి
సందడిఁ బెండ్లాడిన సరసునికి

చ. 3: దేవదానవులు ధీరతను
దావతిపడి వార్ధి దరువఁగను
శ్రీ వనితామణిఁ జెలగి పెండ్లాడిన
శ్రీ వేంకటగిరి శ్రీ నిధికి

రేకు: 0004-2 పాడి సం: 05-019

పల్లవి: దేవరచిత్తం దివ్యనిధి
దేవనిర్మిత విధీ యవధానం

చ. 1: అతివలు నాట్యంబాడెదమని వు-
న్నతి మెఱయుచు నున్నారిదివో
ప్రతినలతో రంభయు మేనకయును
ధృతి కరుణాంబుది ధీయవధానం

చ. 2: గానవిద్య తమకంబున వినుమని
కానుకలివె సురకాంతలవి
కానుపించుకో గంధర్వసతులను
ధీనుత పంపు ధీ యవధానం

చ. 3: పరియంకంబునఁ బవళించెదవో
సిరుల విభవముల జెలఁగెదవో
తిరువేంకటగిరి దేవ యన్నిటా
తిరమందితి విటు ధీయవధానం

రేకు: 0004-3 శంకరాభరణం సం: 05-020

పల్లవి: ఇంతే విన్నపమింతేలా నీ-
పంతము చేకొంటి పాలించు

చ. 1: అలయు సొలయునతివ లోలోనే
చెలిపై నొరగు చెక్కు నొక్కు
పులకించు నించు వొలఁతి చెమట
చిలికించు గోరఁజిత్తగించు

చ. 2: చెలుల మొరఁగు చింతచే గరఁగు
పలుకఁ దలఁచు బడలును
పిలుచు నిన్ను నీపేరుకొనుచును
తొలఁకు కన్నీరు దుడుచును

చ. 3: చనుఁగవ చూచు సారె నీసేఁతలు
తనలోనే మెచ్చి తనరును
అనయము వేంకటాధీశ యీ యింతిఁ
జెనకి కౌఁగిటఁ జేకొంటివి

రేకు: 0004-4 ముఖారి సం: 05-021

పల్లవి: కలలోనె యిరువురము నలిగి వేగ
కలయనుచు దెలిసి నినుఁ గౌఁగిలించితిరా

చ. 1: అలుగుదురెఁ బతులనఁగా వినఁగ
నలవాటు లేక నే నలుగుచుండుదురా
అలిగితట వురక నీవంత నాతోను మరి
నలుగులౌనట పూవులంతలోపలనే

చ. 2: చందురుఁడె సూర్యుఁడై జరగ మిగుల
కెందమ్ములవుర నాకెంగేలుదోయి
గందమే తోఁచెనట కస్తూరియనఁగ నా-
చందమపుడొకలాగు చందమవునటరా

చ. 3: విటవరుఁడ కోనేటివిభుఁడ నీ
వెటు దొలంగిన దేహమెట్టు నిలుపుదురా
యిటువలెనె మనలోన నెలమి మరచి
తటుకననుఁ గలయనుచు తలఁకి తెలిసితిరా

రేకు: 0004-5 నాదరామక్రియ సం: 05-022

పల్లవి: సకలం హేఖి జానామి తత్
ప్రకటవిలాసం పరమం ధధసే

చ. 1: అలికమృగమదమయ మషీకలనో
జ్జ్వలతాం హేసిఖి జానామి
లలితం తవ పల్లవిత మనసి ని-
శ్చలతర మేఘశ్యామం ధధసే

చ. 2: చారుకపోల స్థల కరాంచిత వి-
చారం హేఖి జానామి
నారాయణ మహినాయకశయనం
శ్రీరమణం తవ చిత్తే ధధసే

చ. 3: ఘనకుచశైలాగ్రస్థిత విధుమణి-
జననం హేఖి జానామి
కనదురసా వేంకటగిరి పతే-
ర్వినుత భోగసుఖ విభవం ధధసే

రేకు: 0004-6 భైరవి సం: 05-023

పల్లవి: వనితభాగ్యంబు దేవరచిత్తము మాకు
బనిగాదు యింక నీ పాదంబులాన

చ. 1: అడబాలసతి బోనమారగించు మటంచు
బడి బడిని కడు విన్నపము సేయఁగా
ఉడుగని పరాకుతో నుండి నెచ్చెలి మీఁద
బడలి వొరగినది నీ పాదంబులాన

చ. 2: అడపంబుపతి వీడెమవధరింపుమటంచు
అడరి కప్పురపుఁ బలుకందీయఁగా
కడకంటఁ జూడదిదె కాఁతాళమో మరపొ
పడఁతి యిప్పుడు నీ పాదంబులాన

చ. 3: ఆలవట్టము విసరు అతివలను వలదనదు
పాలిండ్లపై కొంగు పచరించదు
యేలాగవునొ వేంకటేశ నీవిపుడిట్టె
పాలించకున్న నీ పాదంబులాన

రేకు: 0004-7 శంకరాభరణం సం: 05-024

పల్లవి: అలరులు గురియఁగ నాడెనదే
అలకలఁ గులుకుల నలమేల్ మంగ

చ. 1: అరవిరి సొబగుల నతివలు మెచ్చఁగ
అరతెర మరఁగున నాడెనదే
వరుస పూర్వదువాళపు తిరుపుల
హరిఁగరగింపుచు నలమేల్ మంగ

చ. 2: మట్టపు మలపుల మట్టెల కెలపుల
తట్టెడి నడపుల దాఁటెనదే
పెట్టిన వజ్రపు పెండెపు తళుకులు
అట్టిట్టు చిమ్ముచు నలమేల్ మంగ

చ. 3: చిందుల పాటల శిరి పొలయాటల
అందెల మోఁతల నాడెనదే
కందువ తిరువేంకటపతి మెచ్చఁగ
అందపు తిరుపుల నలమేల్ మంగ

రేకు: 0004-8 దేశి సం: 05-025

పల్లవి: వలపారగించవమ్మ వనిత నీ-
యలుక చిత్తమున కాఁకలి సేసినది

చ. 1: అడియాసలనె పక్వమైన సోయగపు-
వెడయలుకల మంచి వేఁడి వేఁడి రుచులు
ఎడసేసి తాలిమి నెడయించి పైపైనె
పొడమిన తమకంపు బోనము వెట్టినది

చ. 2: ఆమంచి మధురంపు ఆధరామృతముల
వేమారుఁ దావులు చల్లు వెన్నెలబయటను
కొమలపుఁ దరితీపు కోరికఁ గుమ్మరించి
భామకు పూబానుపు పళ్ళెము వెట్టినది

చ. 3: కన్నుల కాంక్షలనెడి కళవళములు దీరె
సన్నపు నవ్వులనెడి చనవగ్గలించెను
అన్నువపు మరపు నీ కంతవింతఁ గలిగె నేఁ-
డిన్నియును దిరువేంకటేశుని మన్ననలు

రేకు: 0005-1 శ్రీరాగం సం: 05-026

పల్లవి: అప్పటి యెండ చెమటలట్టే వుండీనా
నెప్పు దప్ప బొంకేవు నే నెఱుంగనా

చ. 1: ఆవులఁ గాచిన నాటి యడవికంపల జీర-
లావల నేఁడు మాయక అట్టే వుండీనా
యేవంక నెవ్వతో నిన్ను నెనసి చేసిన చేఁత
నీ వెంత మొఱఁగిన నే నెఱంగనా

చ. 2: వెన్నలు ముచ్చిలునాఁడు వేడి పాలారగించిన
అన్నువ నీమోవిపొక్కులట్టే వుండీనా
వన్నెకాడ యెవ్వతెకో వలలఁ జిక్కిన నీ-
నిన్న మొన్నటి సుద్దులు నే నెఱంగనా

చ. 3: రంగుగ మధురలోని రమణి మెత్తిన నాటి-
అంగడి గందపుఁ బూఁతలట్టే వుండీనా
చెంగట మొఱగి కలసితివి వేంకటరాయ
నింగి మోచిన చేఁతలు నే నెఱంగనా

రేకు: 0005-2 శంకరాభరణం సం: 05-027

పల్లవి: పోనీ పోనీలే నీ పొందులేఁటికి నీ-
యాననము చెమరించె నయ్యా నీ యలుకా

చ. 1: ఆన వెట్టఁగా విచ్చే సేవమ్మపాదాల మీఁదనే
కానీ కానీలే యెక్కడికో నీవు
మానవతితో బింకాలు మానవా యింకాను నీ-
మేనెల్లా బడలెను యేమిటికి నీ యలుక

చ. 2: బంగారు దుప్పటికొంగు పట్టఁగానే పెనఁగేవు
అంగడి వీథిలో నవులే నీవు
రంగైన సతికోపమెరఁగవా యింకాను నీ-
తొంగలి రెప్పల నీటఁ దోఁచీలే నీ యలుక

చ. 3: తెరవ నిన్నరగంటఁ దిట్టఁగానే బిగిసేవు
మఱపుఁ దెలివితో మఱియు నీవు
కరఁగి కూడితివి వేంకటగిరి మీఁద నున్న-
నెరజాణ విట్టలుఁడ నేఁడుగా నీ యలుక

రేకు: 0005-3 ముఖారి సం: 05-028

పల్లవి: ఎక్కడ నున్నదో చిత్తమేమి దలఁచెనో యింతి
చెక్కులెల్లాఁ జెమరించీఁ జెప్పరమ్మా చెలులు

చ. 1: ఆతని సుద్దులు చెప్పే అతివలే చుట్టాలు
అతనిని వద్దనిన వారందరుఁ బగ
రాతిరెల్లా నిద్దు రెరఁగదు పాదములొత్తి
చేతులెల్లఁ బొక్కెనేమి సేతమమ్మా చెలులు

చ. 2: నవ్వులు చెక్కులకు గన్నపుగండిదొంగలాయ
నొవ్వులాయ జూపులు కన్నుల మీఁదికి
దవ్వులాయఁ బయ్యద గందపు గుబ్బల మీఁదికి
యెవ్వరి నొల్లదు యిఁకనేఁటికమ్మా చెలులు

చ. 3: చిత్తమెల్లా దక్కఁగొనె సిగ్గులు ముంగిట వేసె
వత్తివలె దేహమెల్లా వాడఁబారెను
కత్తిఁ గోసినట్లు వేంకటపతి ఘాతలకు
జొత్తు పాపవలె నాయఁ జూడరమ్మా చెలులు

రేకు: 0005-4 శ్రీరాగం సం: 05-029

పల్లవి: చెల్లువంటా వచ్చి వచ్చి చెట్టవట్టేవు
తొల్లియు నెందరినిట్టే దొమ్ములఁ బెట్టితివో

చ. 1: ఆఁపరాని తమకాన నాసచేసేఁ గాక యింత-
మాఁపు దాఁకా నీ తోడి మాటలేలరా
దాఁపరాని మదనముద్రలు మేననవె నీకు
నేఁపుచు భ్రమలఁ బెట్టి యెవ్వతె సేసినవో

చ. 2: ఉండలేక నీ వద్దనే వుసురంటిఁ గాక యింత-
బందు బందు సేసిన యీప్రాణమేలరా
పుండుగాఁగఁ జిత్తమెల్లాఁ బొక్కఁ జేసితివి నా-
యండనుండే యెవ్వతెకు నమ్ముడు వోయితివో

చ. 3: తనివోక నేనింత దగ్గరనిచ్చితిఁ గాక
చనువున నిన్ను జేయి చాఁచనిత్తునా
ఘనుఁడ వేంకటరాయ కమ్మని యీ విరులు
మునుపనెవ్వతో నీపై ముడిచి వేసినవో

రేకు: 0005-5 రామక్రియ సం: 05-030

పల్లవి: మీలో మీలో మేలే పెంచిన-
తాలిమి కూటమి దలఁచినను

చ. 1: ఆరడిఁ బెట్టిన అలుకలు ముట్టిన-
కూరిమి మచ్చిక గూరిచిన
బీరాన మీలో ప్రేమమే పెంచిన-
నేరుపు మీలో నించినను

చ. 2: చనవులిచ్చినఁ జదురులెచ్చిన-
కొనచూపులు లోఁగొచ్చినను
అనుగు మోహములచ్చినఁ దెచ్చిన-
వినికి మనికి వెచ్చినను

చ. 3: ప్రియములింపులు బిరుదుకెక్కిన -
నయము మీలో నాఁటినను
జయమై వేంకటాచల రమణుఁడ
ప్రియురాలు మీలో బెరసెను

రేకు: 0005-6 సామంతం సం: 05-031

పల్లవి: పొదలిన వీడెపు బుక్కిళ్ళో తమ
చొదుకుల చెమటల చొక్కిళ్ళో

చ. 1: ఆముకొనిన యధరామృతవేళల
మోముల మోముల మొక్కిళ్ళో
కామినుల మకరికా పత్రమ్ముల
చీమక దొంతర చెక్కిళ్ళో

చ. 2: కయ్యపుఁ గౌఁగిఁట గలికి రచనలను
నెయ్యపుఁ బులకల నిక్కిళ్ళో
ముయ్యని మోహపు ముచ్చట మురిపెపు-
తొయ్యలిపాదపుఁ దొక్కిళ్ళో

చ. 3: మొలకలేనగవు మోముల గోళ్ళ
నులిమేటి వదనపు నుక్కిళ్ళో
అలమేల్ మంగకు నా వేంకటపతి
తలపు లొసంగిన దక్కిళ్ళో

రేకు: 0006-1 ఆహిరి సం: 05-032

పల్లవి: ఆఁపరాని వలపాయ నమ్మలాలా - యింతి
యేఁపులకు లోనైతిమిఁక నేమిసేతమే

చ. 1: ఆరగించుమనఁ గదరమ్మలాలా -అయ్యో
నీరు వుక్కలించదిదె నిన్నటనుండి
ఆరినది బోనమెలా నమ్మలాలా-అయ్యో
శ్రీరమణుఁడింతట విచ్చేయఁడేమిసేతమే

చ. 2: అద్దమరాతీరి వోమ నమ్మలాలా -అయ్యో
నిద్దుర గంటఁబెట్టదు నిన్నటనుండి
అద్దపుఁ జెక్కులు వాడె నమ్మలాలా -అయ్యో
యిద్దరికోపము దీరదిఁక నేమిసేతమే

చ. 3: అలయికే ఘనమాయనమ్మ లాలా -దీని
నిలుప వశముగాదు నిన్నటనుండి
అలమివేంకటవిభుఁడమ్మలాలా - దీని-
నెలయించి కూడకున్న నిఁకనేమి సేతమే

రేకు: 0006-2 సామంతం సం: 05-033

పల్లవి: ఎక్కడికినెక్కడ యేడకునేడ నే-
నొక్కతెనాతనికటరో సతులు

చ. 1: ఆయఁబోయ నాఁడె నాకు నాతనికి నేమివోదు
రాయిడి యీచేఁతలకు రాయఁడితఁడు
పాయమెల్లా జట్టిగొనె పచ్చిగా నన్నింత సేసెఁ
నోయమ్మ తడవకురో యీరోఁతలు

చ. 2: చెప్పకు చెప్పకు నాకు సిగ్గయ్యీనికనేల
నొప్పి సేసె నాతఁడింత నొచ్చితి నేను
కప్పినఁ బోవు సేఁతలు కాలినపుండ్లలోన-
నుప్పులు చల్లక తలరో సతులు

చ. 3: చాలుఁ జాలు నేల నాఁడే చవిగొన్న కూరలకు
మేలుఁ గీడుఁ గొనియాడ మీఁద మీఁదను
జాలిఁబెట్టి వేంకటేశ్వరుఁడు నన్నిదె రతి-
నోలలాడించెను చూడరో పొందులు

రేకు: 0006-3 వరాళి సం: 05-034

పల్లవి: తలఁచి వేరొకటాడఁ దడఁబడీని
మలసిన నీ కేల నోర మాట వెళ్ళీనే

చ. 1: ఇంచుకంత నెరసున్నానేఁచిన రెప్పలవెంట
నించి నించి కన్నులలో నీళ్ళుగారీని
యెంచరాని నీకన్నులెదుట నాతఁడుండఁగాను
యెంచిన నిదుర నీకు నేల వచ్చీనే

చ. 2: ఎక్కువభారము మేననించుకంత దోఁచినాను
తక్కరి యీ దేహమెల్లాఁ దల్లడించీనే
మక్కువ నీ విభుఁడు నీమతినిండి వుండఁగాను
వెక్కసాన నేరీతి వేగించేవే

చ. 3: వెలయగఁ గోపమొకవీసమంత దోఁచినాను
కలిగిన ముదమెల్లా గాలిఁబోయీని
కలిసితినిదె వేంకటపతి నాతని-
నెలయింత తమకాన నేడ దాఁగేవే

రేకు: 0006-4 దేశి సం: 05-035

పల్లవి: లేఁతచిగురిదె పవ్వళించవయ్య కానికె
బాఁతిగాఁ గమ్మనితావిఁ బాయక మీఁటైనది

చ. 1: ఇంపుల వెలఁగపండ్లిందవయ్య కానికె
గుంపుఁ దేకుటాకు మరఁగున నున్నవి
కెంపుమోవిపండు చిత్తగించవయ్య కానికె
దింపని తేనెలపెరతీపులసోఁకినది

చ. 2: పంచల వాఁడమ్ములివె పటవయ్య కానికె
పొంచి తొంగలిగరుల పొది నున్నవి
కొంచెపు వెన్నెలలివె కోవయ్య కానికె
మంచిమొల్ల మొగుడల మాఁటునాఁ బాయనివి

చ. 3: ఇప్పుడె వేంకటేశ నీకెక్కఁగా నాకానికె
చిప్పిలుఁబన్నీటినిండుఁ జెలమైనది
దప్పిదేరేమాటలతో దక్కెఁగా నాకానికె
కొప్పునెరుల విరులకుమ్మరింతలైనది

రేకు: 0006-5 హిజ్జిజి సం: 05-036

పల్లవి: కటకటా యిట్లాయఁగా పనులు చెలిపలుకు
కిటుకుఁగీరములు మును కిందుపడి గెలిచె

చ. 1: ఇంతిముఖచందురుఁడు నీకుముదబాంధవుఁడు
నింతచలమునఁ బోరిరిన్నాళ్ళును
కాంతుఁడవు నీవలుగఁగాఁ జెలికి నీ విరహ-
సంతాపములు రేఁచి జలజారి గెలిచె

చ. 2: వనజాక్షిచూపులును వలరాజుతూపులును
యెనయకే జగడించె నిన్నాళ్ళును
కినిసి నీవీయతివకెలనఁ దిరుఁగఁగ విరుల-
ననలె కడువాండ్లె నలుగడల గెలిచె

చ. 3: లతలు పూవులతోవిలంచములు చెలిమేన
యితవుగా వడినొసఁగె నిన్నాళ్ళును
సతిగెలిచె వేంకటేశ్వర నీ కరుణనిపుడు
ధృతిఁబూని జవరాలు తిరుఁగఁ దా గెలిచె

రేకు: 0006-6 సామంతం సం: 05-037

పల్లవి: చెదరి తిట్టు పుణుఁగు చెక్కులఁ గరిగి జార
సుదతి నెచ్చెలి మీఁద సోలగిలినది వో

చ. 1: ఇంతివీఁపు నిమ్మపంట నేమరించి తాఁకవేసి
మంతన మెవ్వరితోనో మాటలాడేవు
అంతలోనే కళదాఁకి అకె మేను జల్లనఁగ
చింతతోనే మోమువంచి సిగ్గువడినదివో

చ. 2: పొలతిఁగుబ్బలు నొవ్వఁబూవులచెండున వేసి
కలికతనమున మరలి చూచేవు
కలకంటి యింతలోనే కంతునిబాణమునవి
పలుకనేరక మానుపడి వున్నదదివో

చ. 3: పొక్కిడిచెలిఁ బన్నీటి పొట్లానఁ దాఁకవేసి
తక్కరి నవ్వులతోడఁ దలవంచేవు
గక్కన నేఁడతివ వేంకటరాయ నినుఁగూడి
వెక్కసపు మఱపతో వెరగందినదివో

రేకు: 0007-1 మంగళకౌశిక సం: 05-038

పల్లవి: తన్నుఁ బాసి నేనింత దంటనట యీ
వెన్నెలబాయిట రేయి వేగుఁటింతి చాలదా

చ. 1: ఇంటికి రాకుమని నేనంటినట చూడవే
అంటఁగాక వున్న దాన నంటినో యేమో
కంటికి నిద్దురరాక కాఁకలనే పొద్దువోక
వొంటి నేఁ బానుపున రేయుంటి నింత చాలదా

చ. 2: అప్పటి దగ్గరి నే రానైతినట చూడవే
కొప్పు జారి సిగ్గుతోడఁ గొంకితి నేమో
చిప్పల రెప్పల జంకించితినట చూడవే
చెప్పరాని మాట నీతో జెప్పుటింత చాలదా

చ. 3: ఊరకే మాటాడక నే నుంటినట చూడవే
ఆరడి పరవశాన నైతినో యేమో
గోరికొనఁ దనుఁ దక్క గొంటినట చూడవే
యేర వేంకటేశ నాతోనింత నీకుఁ జాలదా

రేకు: 0007-2 శుద్ధవసంతం -రచ్చెతాళం సం: 05-039

పల్లవి: ప్రలపనవచనైః ఫలమిహకిం
చల చల కుడ్యక్షాళనయా కిం

చ. 1: ఇతర వధూమోహితం త్వాం ప్రతి
హితవచనై రీహితు మిహ కిం
సతతం తవానుసరణమిదం మమ
గతజల సేతూకరణ మిదానీం

చ. 2: వికలవినయ దుర్విటం త్వాం ప్రతి
సుకుమారార్ద్రస్తుత్యా కిం
ప్రకటబహల కోపనం మమతే
సకల చర్విత చర్వణమేవ

చ. 3: శిరసా నతసుస్థిరం త్వాం ప్రతి
విరసాలాపన విధినా కిం
తిరువేంకటగిరి దేవ త్వదీయ-
విరహవిలపనం వృథాచరణం

రేకు: 0007-3 వరాళి సం: 05-040

పల్లవి: ఆఁగఁ జేసు నా చూపులటు వోవయ్య
మూఁగిన నా వలపుల మూలకు రానేలా

చ. 1: ఇమ్ముల నొల్లని వారమేల నీకు నామేని-
అమ్ముల పులకలొత్తీ నటు వోవయ్య
కమ్మవిలుతునిచేతఁ గాఁగెడి నన్నొరసేవు
నెమ్మది నుండి యుండి నీకు నొవ్వనేలా

చ. 2: ఇతవు గాని వారమేల నీకు నామేని-
అతితాపమంటుఁ జేసు నటు వోవయ్య
రతిరాజుచేత నారడిఁబడ్డ ననుఁ జేరి
జతనాన వుండివుండి జాలిఁబొంద నేల

చ. 3: ఇంతటి నీ కౌగిటికి నేల నేము మాకోప-
మంతరమెఱఁగనేరదటు వోవయ్య
పంతగాఁడ వెంకటపతి నీవు ననుఁ గూడి
చింతతోడఁ బొరలుచు సిలుగంద నేలా

రేకు: 0007-4 శ్రీరాగం సం: 05-041

పల్లవి: ఎన్నఁడునుఁ గోపగించవిందుముఖి నీవిట్లా
విన్నవి వదనమెల్లా వింతలాయ నిపుడు

చ. 1: ఇంతలోని పనికిఁగా నెంత చేసినాఁడవు
కాంత నిన్నటినుండి కనుమూయదాయను
బంతికూటి సతులెల్లా బలుమారు నేఁపగా
చింతతోఁ బళ్ళెము మీఁద జెయి చాఁచదాయెను

చ. 2: ఏమిసేయఁబోయి నీవుయేమి సేసినాఁడవు
సాముకు విచ్చేయదు జవరాలు నేఁడు
దోమతెర మంచముపై తురుము వీడఁగను
తామసించి లేవదిదె తల నొచ్చీననుచు

చ. 3: ఎవ్వరిని దూరవచ్చు నెవ్వరున్నారిఁకను
పువ్వు సజ్జమీఁదఁ గాఁగె పొలఁతికి దేహము
రవ్వగ వేంకటగిరి రమణ నీ కౌఁగిటఁ
బవ్వళించి యింతలోనె పరవశమందెను

రేకు: 0007-5 ముఖారి సం: 05-042

పల్లవి: మతికంటె వెలినున్న మంట మేలు
చతురులౌట కంటె జడుటౌట మేలు

చ. 1: ఇంటిలోననె వుండి హీతవరులై యుండు-
కంటెఁ బగయై యుండు కసరు మేలు
అంటుకొని మరుఁడొంటి అతివనేఁ పుటకంటె
పుంటినొవ్వల విరుల పోట్లె మేలు

చ. 2: తల్లివలె దానుండి తాపమవుటకంటె
అల్లంతనుండి కీడౌట మేలు
వెల్లిగొని నిటపర్పు వేడి చల్లెడికంటె
పల్లదపు చలిగాలి బాదలే మేలు

చ. 3: అలయించి దొరకెడి అమృతపానముకంటె
అలమి పైకొనెడి చేఁదైన మేలు
కలయక కలయు వేంకటశై లపతికంటె
తలపోఁత వేదనల తమకమే మేలు

రేకు: 0007-6 సామంతం సం: 05-043

పల్లవి: అప్పుడే నే నీకు మోహపుటాలనై తినా
కప్పుకు నీ చేఁత లంతకంటెఁబో నేను

చ. 1: ఇంచుకంత పనికైన నిల్లుచౌరనీక నిన్ను
లంచములడుగను నే లకిమమ్మనా
వంచనల నీకు నిట్టె వలలఁ జిక్కితిఁ గాక
కంచుఁ బదనునకంత కంటెఁబో నేను

చ. 2: సొలపు మాటల నిట్టే చూపులనె జంకించి
చలము సాదించ నీ సత్యభామనా
వలచి నేనిదె నీకు వసమై చిక్కితిఁగాక
కలికి చేఁతలనంత కంటెఁబో నేను

చ. 3: రేపు మాపు గోరఁ దమ్మి రేకులనే లేఖవ్రాసి
రూపు నీకు జెప్పిపంప రుకిమిణినా
తీపుల నిన్నుఁ గూడి తిరువేంకటేశ విరిఁ
గైపు సేయఁగాని అంతకంటెఁబో నేను

రేకు: 0008-1 భైరవి సం: 05-044

పల్లవి: కోవిల పలుకదు కొమ్మావిలతల
దైవిక మిదివో తలకిందాయ

చ. 1: ఇటునటు యినుఁడిదె యెండలు గాసీ
నటుగతి గిరుల నభములందు
అటువలెఁ గప్పిన యంధకారమిదె
నిటలపుటలుకల నిక్కములాయ

చ. 2: వెగటునఁ దోఁటల వెన్నెలగాసీ
ఒగిఁ గలువకొలకు లుబ్బఁగను
అగపడి అటువలెనైనాఁ జెలి నీఁ
మొగమునఁ గోపము ముచ్చటలాయ

చ. 3: సొరిది నలుగడలఁ జుక్కలు గాసీ
నరుదుగ నే నిట్లయినాను
తిరువేంకటగిరి దేవుని కౌఁగిట
కరుణ మన్మథ గ్రహణంబాయ

రేకు: 0008-2 సాళంగనాట సం: 05-045

పల్లవి: చాలుఁజాలును భోగసమయమున మైమఱపు-
పాలుపడునట యేఁటి బ్రదుకురా వోరి

చ. 1: ఇందుముఖి నిను గౌఁగిలించి లోపలి జగము
కందునని నీ బిగువుఁ గౌఁగిలే వదలె
పొందైన వారితోఁ బొసఁగఁ గౌఁగిఁట జేర్పఁ
బొందుగాదట యేఁటి పొందురా వోరి

చ. 2: నెలఁత నీ వాలుఁగన్నులు మూసి జగమెల్లఁ
గలయఁ జీఁకట్లైన గక్కనను వదలె
వలచినంగనలు తమ వలసిన విలాసముల-
వలను నెరపని దేఁటి వలపురా వోరి

చ. 3: కొమ్మ నీవురముపై గోరు దివియుచు నాత్మ-
నిమ్మైన ననుఁదాక నిద్దరిని దాఁకె
దిమ్మరివి కోనేటితిమ్మ నీపైఁ బ్రియము
కుమ్మరించని దేఁటి కోర్కిరా వోరి

రేకు: 0008-3 కాంభోది సం: 05-046

పల్లవి: ఎప్పుడు గాని రాఁడో యెంతదడవాయ కాలి-
చప్పుడాలకించి మతి జల్లురనెనమ్మా

చ. 1: ఇద్దరమదరిపాటు యేకాంతాన నాడుకొన్న-
సుద్దులు దలఁచిమేను చురుకనెనమ్మా
పెద్దగాఁ గస్తూరిబొట్టు పెట్టిన నాతఁడు గోర
తిద్దుట దలఁచి మేను దిగులనెనమ్మా

చ. 2: పాయక యాతఁడూ నేనుఁ బవ్వళించే యింటివంకఁ
బోయి పోయి కడుఁ జిన్న బోతి నోయమ్మా
తోయపు గుబ్బల చన్నుదోయి మీఁద వాఁడొ త్తిన-
పాయపు జంద్రుల జూచి భ్రమసితినమ్మా

చ. 3: కూడిన సౌఖ్యములందు కొదలేని వాని నా-
వేడుక మతి దలఁచి వెరగాయ నమ్మా
యీడులేని తిరువేంకటేశుఁడిదె నాతోడ
నాడినట్టే నాచిత్తమలరించె నమ్మా

రేకు: 0008-4 సామంతం సం: 05-047

పల్లవి: ఎట్టయినఁ జేయరా నీ వికనేలా నన్నుఁ
బట్టకుర పలుమారు పదివేలు వచ్చెను

చ. 1: ఇంత సేసితివి చాలు నికనేలా తొల్లే
యింతటివాఁడని నిన్నెఱగనా
ఇంతులపై దయగలదిక నేలా నీ-
పంతములే నీకుఁజెల్లె పదివేలు వచ్చెను

చ. 2: ఇచ్చలాడకురా నాతో నికఁనేలా నీ-
యచ్చటమ్ములే నిజమాయఁగా
యెచ్చరిక మఱచితినికనేలా నన్ను
పచ్చిసేయకురా యింత పదివేలు వచ్చెను

చ. 3: ఇనుమడించె నీచేత లికనేలా నీ-
కనుమాయలిన్నియుఁ గంటిమిగా
యెనసి వేంకటపతి యికనేలా నన్నుఁ
బనుపరచితివిట్టే పదివేలు వచ్చెను

రేకు: 0008-5 లలిత సం: 05-048

పల్లవి: బండి దొక్కెఁ బాముసెక్కెఁ బనులెల్లాఁ దక్కె
అండఁ జిక్కె గోపికలకందరికి మొక్కె

చ. 1: ఈతఁడు దొంగిలె వెన్న యీతఁడు నాకంటెఁ బిన్న
నేతఁ బాల నోలలాడె నిన్న మొన్న
పాతకపు రాకాసిపల్లెలు చూరలుగొన్న-
యేతరిపై నేరమి మాకేఁటికిఁక నెన్న

చ. 2: కూరిమినీతడు దొల్లి కొనగొనలనే తల్లి (?)
మారాపిళ్ళాడించెనే మారుదల్లి
ఆరుమూరు సేసి విద్యలందరికిఁ బారఁజల్లి
పారితెంచి వోలలాడెఁ బాలవెల్లి

చ. 3: ముచ్చువలె నిప్పుడుండె మూఁడులోకములు నిండె
రచ్చసేసెఁ జూడరే రాతిగుండె
తచ్చితచ్చి వింటినారి దనుజులనెల్లాఁ జెండె
పచ్చిదేర వేంకటాద్రి పానుపుగాఁ బండె

రేకు: 0008-6 ఆహిరి సం: 05-049

పల్లవి: ఓ యమ్మా వినరో యమ్మా
మాయలాఁడి మానిని

చ. 1: ఈ యింతికి విభుఁడిచ్చినా చన-
వేయెడాఁ బోవదిదిగదే
రాయంచ నడపుల రాజసమ్మున
పాయంపు రమణునిఁ బాయదు

చ. 2: సారె సటములు సందడింపుచు
జారీఁ బయ్యెద సరుగనా
దరి రమణునిఁ దొలఁకుఁ గన్నుల
నీరు నించదు నిలువరే

చ. 3: అంకించి పిలిచినప్పుడా తిరు-
వేంకటేశ్వరు వెరవున
బొంకు లేని యట్టి పొందు చేకొని
పంకజానన పైకొనే

రేకు: 0009-1 శ్రీరాగం సం: 05-050

పల్లవి: వద్దు నీకు నాతోడి వట్టిమాటలు
ముద్దులు నీపైఁ గునిసి మురిసీఁబో యిఁకను

చ. 1: ఈడ వచ్చి ప్రియము నాకేమి చెప్పేవిందాఁకాఁ
గూడినాకెకే ప్రియము గులుకరాదా
వాడిక నిందాఁక నీవు వచ్చిన నేరమికి
సూడుఁ బాడుఁ జెనకీఁ బో సొలపుఁ జేఁతలనే

చ. 2: ఎదిరి నావంకఁ దప్పకేమి చూచేవిఁక నీ-
ముదితపైనే చూపులు ముంచరాదా
మెదలి నా ముంగిలిది మెట్టిన తప్పునకును
సద చేసి జగడాలు చల్లెడిఁబో యిఁకను

చ. 3: ఇట్టు నట్టుఁ జెఱఁగు నాకేల పట్టేవిదె మున్ను
పెట్టినాకెకే చెఱఁగు పట్టరాదా
వెట్టికూటములు చాలు వేంకటేశ యిదె నిన్ను
బెట్టుగాఁగా నలుకలఁ బెట్టుఁగదా యిఁకను

రేకు: 0009-2 భైరవి సం: 05-051

పల్లవి: కాలమెల్లా మోసపోవు కానియ్యరా కల-
కాలమెల్లా జరుపేవు కానియ్యరా

చ. 1: ఎడపుల జవ్వనపుటింతి నొకతెఁ గూడి
కడలనే తిరిగేవు కానియ్యరా
మెడగట్టుకొకతెకు మేలుఁవాడవై నీవు
కడవ బొంకేవు నాతో కానియ్యరా

చ. 2: బంగారు మెఱుఁగుచాయ పడఁతినొకతె గూడి
కంగనాడేవు నాతో కానియ్యరా
అంగన నొకతె వెనకమఱ దాచుకొని చొఁ
క్కంగఁ జేసి ముద్దాడేవు కానియ్యరా

చ. 3: సంపద గలాసెఁ గూడి సరములాడుచు
కంపులే పూసేవు కానియ్యలా
వెంపరలాడుచు నీ వెంటనొకతె రాఁగా
కంపించకు వేంకటేశ కానియ్యరా

రేకు: 0009-3 ముఖారి సం: 05-052

పల్లవి: వెరతుమయ్య చూపు వేఁటకాడ
తరితీపు సేసి మమ్మింతటనె యేఁచేవు

చ. 1: ఉంటవింటఁ గప్పురాన నుబ్బి నన్ను నేసేవు
యింటి వారెవ్వరుంటా యెరఁగవు
కంటిమి నీ యదలింపు కరఁగి నేఁబై కొన్న
వెంట వెంటఁ దిరిగాడి వెతలఁ బెట్టేవు

చ. 2: పేలరివై యేడనైనాఁ బేరుకొని పిలిచేవు
యేలిన వారెవ్వరంటా నెఱఁగవు
తాలిమి మీరఁగ నీ చిత్తములో మెలఁగఁగ
కాలూఁదనియ్యక యింత కాఁకలఁ బెట్టేవు

చ. 3: కొప్పులోని విరులు చెక్కుల జారఁ జెనకేవు
యెప్పుడైనా నెవ్వరుంటా నెఱఁగవు
కప్పకుర చెఱఁగు వేంకటరాయ చెమటలఁ
దొప్పఁదోఁగి యెవ్వతో పొందులకు నేఁగితివి

రేకు: 0009-4 మాళవశ్రీ సం: 05-053

పల్లవి: దుప్పటెల్లా జవ్వాదినే తొప్పఁదోఁగె నీకడనే
వొప్పదా యింతేసి నీకు వో వలపా

చ. 1: ఉత్తలపు విరహన నుడుకుచు వయసు మీఁ-
దెత్తినది సతి నీకు నిందుకొరకా
వత్తునని విచ్చేసి వనితల కుచముల
వొత్తగిలి వున్నాఁడ వోహో వలపా

చ. 2: నిదుర గంటకి రాక నెలఁత పానుపుమీఁద-
నెదురు చూచీ నీకు నిందుకొరకా
ముదితల కౌఁగిట ముంచిన కస్తూరి నీకు
వుదిరెడి వురమున నో వలపా

చ. 3: కన్నుల కలికి నింత కరఁగించి కవుఁగిట
ఎన్నిక సేసితివి నీ విందుకొరకా
చిన్ని చిన్న నగవుల శ్రీవేంకటేశ నీ-
వున్నాఁడవొరపులై వోహో వలపా

రేకు: 0009-5 సామంతం సం: 05-054

పల్లవి: మదము దొలఁకెడి యట్టి మంచివయసున మనకు
తుదలేని వేడుకలు దొరకుటెన్నఁడురా

చ. 1: ఉదుటుఁ జనుదోయి నీవురముపై దనివార-
నదిమి మోమును మోము నలమి యలమి
వదలైన నీవితో నాలుఁగన్నుల జంకెఁ
లొదవ నీ మీఁద నే నొరగుటెన్నఁడురా

చ. 2: కలికితనమునఁ నాదు కప్పురపుఁ దమ్ములము
కులికి నీ వదనమునఁ గుమ్మరించి
పలచనగు గోళ్ళ నీ పగడవాతెర నొక్కి
చెలువమగు నునుగంటి సేయుటెన్నఁడురా

చ. 3: గరగరని కురులతో కస్తూరివాసనలు
విరితావులతోడ విసరఁగాను
తిరువేంకటాచలాధిపుఁడ నిను గూడి నే-
నరమరచి సదమదములౌట యెన్నఁడురా

రేకు: 0009-6 సౌరాష్ట్రం సం: 05-055

పల్లవి: ఊరులేని పొలిమేర పేరు పెంపు లేని బ్రతుకు
గారవంబు లేని ప్రియము కదియనేఁటికే

చ. 1: ఉండరాని విరహవేదన వుండని సురతసుఖమేల
యెండలేని నాఁటి నీడ యేమిసేయనే
దండిగలుగు తమకమనెడి దండలేని తాలిమేల
రెండునొకటి గాని రచన ప్రియములేఁటికే

చ. 2: మెచ్చులేనిచోట మంచిమేలు గలిగినేమి సెలవు
మచ్చికలేనిచోట మంచిమాటలేఁటికే
పెచ్చు పెరుగలేనిచోట ప్రియముగలిగి యేమిఫలము
ఇచ్చలేనినాటి సొబగులేమి సేయనే

చ. 3: బొంకులేని చెలిమిగాని పొందులేల మనసులోన
శంకలేక కదియలేని చనవులేఁటికే
కొంకుగొసరు లేని మంచికూటమలర నిట్లఁ గూడి
వేంకటాద్రివిభుఁడు లేని వేడుకేఁటికే

రేకు: 0010-1 సామంతం సం: 05-056

పల్లవి: ఒద్దేలు మొక్కేవో వుద్ధవుఁడా తన
ఉద్దండాలె చెల్లెనుద్ధవుఁడా

చ. 1: ఊరూర వలపులుద్ధవుఁడా నే-
మోరుతుమా యిఁక నుద్ధవుఁడా
ఊరడించ వచ్చేవు వుద్ధవుఁడా తన-
వూరట చెలుములుద్ధవుఁడా

చ. 2: ఒప్పులర మావురిసిన పుం-
ఢ్లుప్పులు వెట్టించె నుద్ధవుఁడా
చెప్పకు మమ్మిఁక చెలువుఁడాతఁడే
వొప్పివుంటేఁ జాలు నుద్ధవుఁడా

చ. 3: గోపకల మమ్ము గూరిమిఁజిక్కించె-
నోపమింతేసి నేముద్ధవుఁడా
పైపైనే మమ్మింత ప్రాణము నిలుప-
నోపెఁగా తానైన నుద్ధవుఁడా

చ. 4: తెగి తన్నుఁ గూడే తెరఁగు దలఁచి
యుగములై నవి ఉద్ధవుఁడా
పగటున మా మా ప్రాణము మాకిఁక
నొగరే తీపాయే నుద్ధవుఁడా

చ. 5: చెల్లించె మా ప్రేమ శ్రీవేంకటేశుఁడు
వుల్లమలర నేఁడుద్ధవుఁడా
చల్లని కూటపు జనవిచ్చి మామా-
వొళ్లెల్లఁ జెనకె నుద్ధవుఁడా

రేకు: 0010-2 ముఖారి సం: 05-057

పల్లవి: పలుమరు వుట్లపండుగను
చిలుక చిడుక్కని చిందఁగను

చ. 1: ఊళ్ళ వీధుల వుట్లు కృష్ణుఁడు
తాళ్ళు దెగిపడఁ దన్నుచును
పెళ్లు కఠిల్లు పెఠిల్లు చిఠిల్లని
పెళ్ళుగ మ్రెసె పెనురవము

చ. 2: బంగారు బిందెలఁ బాలుఁ బెరుగులు
ముంగిట నెగయుచు మోఁదఁగను
కంగు కళింగు కఠింగు ఖణింగని
రంగుమీరు పెనురవములై

చ. 3: నిగ్గుగ వేంకటనిలయుఁడుట్టిపాఁ
లగ్గలికఁ బగుల నడువఁగను
భగ్గు భగిల్ల ని పరమామృతములు
గుగ్గిలి పదనుగఁ గురియగను

రేకు: 0010-3 ఆహిరి సం: 05-058

పల్లవి: చెడ్డ చెడ్డ మనసుల చెంచువారము- ఆల-
దొడ్డివాఁడ పోవయ్యి దూళికాళ్ల రాక

చ. 1: ఏఁటి దాననైతినేమి యెవ్వతె నేనైతినేమి
ఆఁటదాని నన్ను నీకు నడుగనేలా
మూఁట మాఁటలనె కడు మోవనాడవద్దు లేటి-
వేఁటకాఁడ పోవయ్యి వెంటవెంట రాక

చ. 2: ఎవ్వరి వారైరేమి యేడనేడ నుండిరేమి
దవ్వుచేరువలు నీకు దడవనేలా
నవ్వకుండఁగానె వట్టి నవ్వునవ్వేవెవ్వరైన
పువ్వక పూచెననేరు పోవయ్యి రాక

చ. 3: ఎక్కువ కొప్పయిననేమి యెంత గుబ్బలైన నేమి
చక్కఁదనము వొగడ సారె నీకేలా
వెక్కసాలు మాని మాతో వేంకటేశ మాయింటి-
యిక్కువకే పోవయ్యి యింతనంత రాక

రేకు: 0010-4 శుద్ధదేశి సం: 05-059

పల్లవి: ఎందరిఁ జెనకేవేరా నీవు
అందపు నీ మేన నలముచు

చ. 1: ఎక్కడికైనా విచ్చేసి యేరా నీవు
వెక్కస మాడేవు వెఱవక
యిక్కువలంటఁగ వచ్చేవేరా నీవు
నిక్కపు నీ ప్రేమ నెరపుచు

చ. 2: ఎప్పుడు మానవు బిగువేరా నీవు
కప్పురపు నోరఁ గసరుచు
యిప్పుడె యింతేసి చేసేవేరా నీవు
వొప్పదు నాతోడి వుదుటులు

చ. 3: ఏతరుణిఁ దలఁచితొ యేరా నీవు
కాతరాన నన్నుఁ గలయుచు
యేతరి వేంకటేశుఁడ యేరా నీవు
బూతులమాటాడి పాదలేవు

రేకు: 0010-5 హిజ్జిజి సం: 05-060

పల్లవి: తరుణిపై మరునికి దయలేదు నీవు
మరునినే పోలితి మరియేఁటిబ్రదుకు

చ. 1: ఎదురు చూచి చూచి యింతక యేమౌనో
హృదయము ఝల్లనీ నిటుదలఁచి
పొదల తీగెలయింటఁ బొరలి యేమౌనో
మదిరాక్షికొకటైన మరియేఁటిబ్రదుకు

చ. 2: చెలుల దూరిదూరి సిగ్గునసేమౌనో
తలఁచి తలఁచి గుండె తల్లడించీని
కల నిన్నుఁగని లేచి గక్కన నేమౌనో
మలసి వెన్నెలమంట మరియేఁటిబ్రదుకు

చ. 3: ఇంతి గలయకున్న నిఁక నెంత యౌనో
పంతపు వేంకటరాయ భయమయ్యీని
ఇంత నీకరుణ నిఁక నెంత యౌనో
మంతనమింత లేకున్న మరియేఁటి బ్రదుకు

రేకు: 0010-6 రామక్రియ సం: 05-061

పల్లవి: వద్దే గొల్లెత వదలకువేఁ నీఁ
ముద్దు మాటలకు మొక్కేమయ్యా

చ. 1: యేలే యేలే యేలే గొల్లెత
నాలాగెఱఁగవా నన్ను నేఁచేవు
చాలుఁజాలు నీకఁజాలు నీరచనలు
పోలవు బొంకులు పోవయ్యా

చ. 2: కానీ కానీ కానిలే గొల్లెత
పోనీలే నీవెందు వోయినను
మాని మాని పలుమారుఁ జెనుకుచు మా-
తోనిటు సొలయక తొలవయ్యా

చ. 3: రావా రావా రావా గొల్లెత
శ్రీవేంకటగిరి చెలువుఁడను
నీవె నీవె నను నించితి కౌఁగిట
కైవశమైతినిఁ గదవయ్యా

రేకు:	0011-1 శుద్ధవసంతం	సం:	05-062

పల్లవి: మెచ్చితి బళిరా వోరి మేటిజాణ నన్నుఁ
బచ్చి చేసేదింత నీకు బంతమా లోకానను

చ. 1: ఏకతాన సొలసి నేనేమి నీతోఁ బలికినా
ఆకెతోనే విన్నవించేవాపఁగ లేక
పైకొని వలచి కిందుపడిన యింతులమాఁట
కాకు సేసే మగవాఁడు గలఁడా లోకానను

చ. 2: చక్కఁగా నేఁదీసిన సన్నపు నీపై రేక
యెక్కువ నాకెకే చుపేవేతులకును
మక్కువ నిలుపలేని మగువల వెలిపుచ్చి
వెక్కమయినవాఁడు విభుఁడా లోకానను

చ. 3: ఉండలేక చేతనున్న వుంగరమిచ్చినఁ బోయి
వెండియు నాకెకేయిచ్చి విఱ్ఱవీఁగేవు
కండగట్టుకొంటివా వేంకటరమణుఁడ దీన
బండుసేసితివి నన్ను బాపురా లోకానను

రేకు: 0011-2 ముఖారి, ఏకతాళిసం: 05-063

పల్లవి: సన్నపు నవ్వుఁజూపుల చల్లులాఁడి యిప్పు-
డిన్నివిధముల మించె నిదివో తపము

చ. 1: ఏడునిలువుల పైఁడిమేడమీఁద నుండి నిన్నుఁ
జూడ వేడుకైన మించుఁజూపు లాడి
వాడుచు నీకునెదురు వడిఁజూడ నంతలో నీ-
వేడనుండో విచ్చేసితివిదివో తపము

చ. 2: కొత్తలయిన మాణికపు కొలువుటోవరిలోన
ముత్తేల చెఱఁగుదూలు మురువులాఁడి
తత్తరానఁ దమకించి తరుణికోరికలెల్ల-
నిత్తునని విచ్చేసితివిదివో తపము

చ. 3: పుప్పొడితావులు చల్లు పువ్వులచప్పరములో
కొప్పు నన్నుఁ బెట్టుమన్న గుబ్బలాఁడి
తెప్పలుగ నినుఁగూడి తిరువేంకటేశ నిన్ను-
నెప్పుడుఁ బాయకున్నదిదివో తపము

రేకు: 0011-3 ముఖారి సం: 05-064

పల్లవి: కలగన్నచోటికిని గంప యెత్తిన యట్లు
అలవు మీఱినదెట్లనమ్మా

చ. 1: ఎలయింపుఁ గడకంట నెన్నఁడో వొకనాఁడు
చెలఁగి తను నతఁడు చూచినవాఁడట
పొలఁతి యదిదలఁచి యిప్పుడు మదనవేదనల-
నలసీ నికనెట్లనమ్మా

చ. 2: ఎఱుకయును మఱపుగా నేఁటికో వొకనాఁడు
కెఱలి తను నొవ్వఁ బలికినవాఁడట
తఱినదియె చెలి యిపుడు దలఁచి పరితాపాగ్ని-
నఱగీ నికనెట్లనమ్మా

చ. 3: ఇయ్యకోలుగఁ గలసి యెప్పుడో యిదెనేఁడు
నెయ్యమున చెలిలోన నెలకొనెనట
తియ్యముల సటకాఁడు తిరువేంకటేశ్వరుఁడు
అయ్యో యికనెట్లనమ్మా

రేకు: 0011-4 కాంభోది సం: 05-065

పల్లవి: పొందెఱుఁగుదునందువు భోగినందువు నీ-
యందరు సతులకు నేనాకు మడిచిత్తునా

చ. 1: ఎవ్వతెకైనాఁ జనవిచ్చేవు మెచ్చేవు నీ-
నవ్వులకైనాను మన్ననఁ జూచేవు
అవ్వలి యివ్వలి నీ యంగనల వొద్దను
పవ్వళించి వుండఁగా నే బాదములొత్తుదునా

చ. 2: ఏపున నెక్కడికైనా నేఁగేవు దాఁగేవు నీ-
కోపాన నాతోనైన మేకులు సేసేవు
వైపున నీవెందుండైనా వచ్చిన నేనంతలో-
నోపికనప్పుడు నీ కూడిగాలు సేతునా

చ. 3: వేడుకలెందైనాఁ బారవేసేవు నీ-
వాడికచేఁతలెన్నైనా వన్నె వెట్టేవు
ఈడు లేని తిరువేంకటేశ కూడితివి నన్ను
వాడుచు నీ తోడ నేను వాసి చూపఁగలనా

రేకు: 0011-5 పాడి సం: 05-066

పల్లవి: సుతుని నరకునిఁ జంప జూచినాఁడవు సుమ్మీ
మతి నన్నుఁ దలచక మానిన నీకాన

చ. 1: ఎత్తుక నీతోడఁ బుట్టు హిరణ్యకశిపుని
నెత్తురు దాగితి సుమ్మీ నేఁడే రాకుంటే
ఉత్తలాన నేడనైనా నుండుదువో యని భీతి
బిత్తరముగాఁ బెట్టితి పెట్టరాని యాన

చ. 2: కప్పుక నీ మేనమామ కంసుని ప్రాణానకు
తప్పినవాఁడవు సుమ్మీ తడసితేను
ఇప్పుడిట్టే నీవు రాని యీరసానఁ బ్రియములు
చెప్పలేక పాడిచితి చెడుగైన యాన

చ. 3: సిరుల మేన మరఁది శిశుపాలు నీ విట్టే
పొరిగొంటివి సుమ్మీ పోయితే నీవు
తిరువేంకటేశ నన్నుఁ దివిరి కూడి వని
కరుణఁ బెట్టితి నీకుఁ గపటాన నాన

రేకు: 0011-6 శుద్ధవసంతం సం: 05-067

పల్లవి: చాలదా యీ చనవులు
మేలపు సేఁతల నిన్ను మెచ్చించ గలిగె

చ. 1: ఎంతటిదిరా నిన్ను విందాఁక రానీక
పంతమాడి వలపించి బాసగొన్నది
ఇంతి నోఁచినట్టి నోము యెటువంటిదో నీ
చెంతఁజేరీ నీ మంచి చెక్కు నొక్కఁగలిగె

చ. 2: ఎవ్వతెరా నిన్ను నెలయించి తన నిండుఁ
జవ్వనము విలువిచ్చి జట్టి గొన్నది
అవ్వల దాని భాగ్యమది యెట్టిదో నీవు
పవ్వళించు పరుపుపై పవ్వళించఁ గలిగె

చ. 3: ఎట్టిదిరా సతి నిన్ను యింటిలోన వెళ్ళనీక
పట్టుకొని కౌఁగిటిలోఁ బాయనీనిది
అట్టె నిన్ను తిరువేంకటాధీశుఁడా నీవు
దట్టించు నీ కౌఁగిటిలో తగులఁగఁ గలిగె

రేకు: 0012-1 ఆహిరి సం: 05-068

పల్లవి: చక్కఁదనములచేత జవ్వన భారము చేత
యెక్కడౌటాఁ గానదిఁక నేమి సేతమే

చ. 1: ఒయ్యనె బంగారు తూఁగుటుయ్యాల మంచముమీఁద
పయ్యెద చెఱఁగు జారఁ బవ్వళించి
ముయ్యక మూసిన రెప్ప మూయుచుఁ దెరచుఁ గాని
నెయ్యమునఁ జూడనేరదేమి సేతమే

చ. 2: ముత్తేల గద్దియమీఁద ముద్దుల కురులు దూల-
నొత్తిలి యొకతె మీఁద నొరగుండి
చిత్తగించి చేతనున్న చెంగలున బంతిఁ జెక్కు-
లొత్తుఁగాని మాటలొల్లదేమి సేతమే

చ. 3: కమ్మని తావులతోడ కన్నుల నవ్వులతోడ
చిమ్ముఁ జెమటలతోడఁ జెలువొంది
కొమ్మకు నేడుఁగలిగె కోనేటిరాయని పొందు
నెమ్మనము దాఁచ నేరదేమి సేతమే

రేకు: 0012-2 ఆహిరి సం: 05-069

పల్లవి: దవ్వుల నుండవే యాల దగ్గరేవు ఆతc-
దెవ్వరౌతా నెఱcగవిదేమే చెలియా

చ. 1: ఒద్దికతో చనుదోయి నొరయుచు కంట-
నద్దలింపుచుc దిట్టేవు అమ్మమీcదను
ముద్దుమోము విరియించి మురిసేవు ఇంత
వద్దువో ఆతనితో గర్వము నీకుc జెలియా

చ. 2: బొమ్మముడి జంకెనలc బొలయుచు మోవిc
దమ్మచూపి సన్న సేసి తనరేవు
చిమ్మేవు నీ చెమటలు చెక్కు మీcద ఓ-
యమ్మరో యాతనితో వొయ్యార మేలే చెలియా

చ. 3: మొరము మెట్టెలు పాదమున మెట్టి
చెరcగులోపల గోరc జెనకేవు
కరcగి వేంకటపతి కౌcగిట నీ-
నెరతనములు చూప నేర్తువా చెలియా

రేకు: 0012-3 శంకరాభరణం సం: 05-070

పల్లవి: తరుణి నీ యలుకకెంతటిదింతినీ వేళఁ
గరుణించఁగదర వేంకటశై లనాథా

చ. 1: ఒకమారు సంసారమొల్లఁ బొమ్మని తలఁచు
ఒకమారు విధిసేఁతలూహించి పొగడు
ఒకమారు తనుఁజూచి వూరకే తలపూఁచు-
నొకమారు హర్షమున నొంది మే మఱచు

చ. 2: నిన్నుఁ జూచి వొకమారు నిలువెల్లఁ బులకించు
తన్నుఁ జూచి వొకమారు తలపోసి నగును
కన్ను దెరచి నినుఁజూచి కడు సిగ్గువడి నిలిచి
యిన్నియునుఁ దలపోసి యింతలో మఱచు

చ. 3: వదలైన మొలనూలు గడియించు నొకమారు
చెదరిన కురులెల్లఁ జెరుగునొకమారు
అదనెరిఁగి తిరువేంకటాదీశ పొందితివి
చదురుఁడవు నినుఁ బాయఁజాలదొక మారు

రేకు: 0012-4 బౌళి సం: 05-071

పల్లవి: మోహము సేయించుకొని మురిసేవు నీ-
సాహసములె దురా చదురాలికిపుడు

చ. 1: ఒక్క చక్రమె నీకునున్నది గాని, యింతిఁ
రెక్కల చక్రాలె పో రెండు గుబ్బలు
మక్కువ సేయించుకొని మలసేవు నీ-
చక్కఁదనమెదురా జవరాలికిపుడు

చ. 2: నీలమేఘము చాయ నీమేను గాని పెద్ద-
నీలమేఘమే పో నెలఁత కొప్పు
జాలిఁ బొరలించేవు సతిని నీవు నీ-
తాలిములెదురా తరుణికి విపుడు

చ. 3: మరుని ప్రతినిధి నీ మహిమ గాని ఆ-
మరుని సంపదే పో మగువ నేఁడు
తిరువేంకటేశ పొందితివి గాని నీ-
సరసము లెదురా సకియకు నిపుడు

రేకు: 0012-5 పాడి సం: 05-072

పల్లవి: వచ్చెరా మా యమ్మతోడు వన్నెలుగావు నీ-
మచ్చరములెల్ల మాని మందకేఁగ నియ్యరా

చ. 1: ఓసోసి యెందు వొయ్యేవే వొయ్యారపుగొల్లెతా
దోసము మమ్మునంటక తొలఁగరటు
మూసేవే గుబ్బలఁ గొంగు మురిపెంపుగొల్లెతా
మూసినది చీరకొంగు మందకేఁగ నియ్యారా

చ. 2: సానఁ బట్టేవే మాటలే చల్లజంపు గొల్లెతా
నేనేమి బాఁతిరా నీకు నెరజాణా
కానిలే రావైతివిగా గబ్బిచూపుగొల్లెతా
మానమువంకఁ జూడక మందకేఁగ నియ్యరా

చ. 3: జంకించేవే బొమ్మలను జవ్వనంపుగొల్లెతా
వేంకటవిభుఁడ నీకు వెరతుమయ్య
అంకపు గుబ్బలను నన్ను నదిమేవె గొల్లెతా
మంకుఁ గూటములు మాని మందకేఁగ నియ్యరా

రేకు: 0012-6 దేసాళం సం: 05-073

పల్లవి: కులుకక నడవరో కొమ్మలాలా
జలజలన రాలీని జాజులు మా యమ్మకు

చ. 1: ఒయ్యనే మేను గదిలీ నొప్పుగా నడవరో
గయ్యాళి శ్రీపాదతాఁకు కాంతలాలా
పయ్యెద చెఱగు జారీ భారపు గుబ్బలమీఁద
అయ్యో చెమరించె మా యమ్మకు నెన్నుదురు

చ. 2: చల్లెడి గందవొడి మైజారీ నిలువరో
పల్లకి వట్టిన ముద్దు బణఁతులాల
మొల్లమైన కుందనపు ముత్యాల కుచ్చులదర
గల్లనుచుఁ గంకణాలు గదలీ మాయమ్మకు

చ. 3: జమళి ముత్యాలతోడి చమ్మాళిగ లిడరో
రమణికి మణుల నారతులెత్తురో
అమరించి కొగిట నలమేలుమంగనిదె
సమకూడె వేంకటేశ్వరుఁడు మాయమ్మకు

రేకు: 0013-1 ఆహిరి సం: 05-074

పల్లవి: కొమ్మ తన ముత్యాల కొంగు జారఁగఁ బగటు
కుమ్మరింపచుఁ దెచ్చుకొన్నదీవలపు

చ. 1: ఒయ్యారమున విభుని వొరపు గనుఁగొని రెప్ప
ముయ్యనేరక మహా మురిపెమునను
కయ్యంపుఁ గూటమికిఁ గాలుదువ్వుచు నెంతె
కొయ్యతనమునఁ దెచ్చుకొన్నదీవలపు

చ. 2: పైపైనె ఆరగింపకుము పన్నీరు గడు-
తాపమవునని చెలులు దలఁకగానే
తోపు సేయుచుఁ గెంపు దొలఁకుఁ గన్నుల కొనల
కోపగింపుచుఁ దెచ్చుకొన్నదీవలపు

చ. 3: ఎప్పుడునుఁ బతితోడ నింతేసి మేలుములు
ఒప్పదని చెలి గోర నొత్తఁగానే
యెప్పుడో తిరువేంకటేశు కౌఁగిఁట గూడి
కొప్పుగులుకుచుఁ దెచ్చుకొన్నదీవలపు

రేకు: 0013-2 ముఖారి సం: 05-075

పల్లవి: పొదలు నీ సొబగెల్ల పోదేల కొల్ల
తుదలేని నీ మేలు దొరకెఁగా నాకు

చ. 1: ఒడలిపై నీచెమట వూరు వాడెడు చెలమ
జడియు నీ తమకంబు సంత తగరు
కడగంటి నీచూపు కట్టు వదలిన క్రేపు
వడి నిన్నుఁ గరఁగింప వశమా నాకు

చ. 2: చిఱునవ్వు నీపలుకు జిగురు చుట్టిన కండె
తెఱవలకు నీ మోవి తెరువు పెసరు
పఱచు నీనునుఁజేఁత బట్టబాయిటి యీఁత
తఱి నిన్నుఁ బైకొనఁగ దరమా నాకు

చ. 3: చెలువంపు నీ చెలిమి చెఱకు వండిన పండు
కెలపు నీ యలుక తంగేటి జున్ను
చలివాపు నీచనవు జాజులుఁ బ్రాసాదంబు
కలిగె నీకరుణ వేంకట విభుఁడ నాకు

రేకు: 0013-3 ఆహిరి సం: 05-076

పల్లవి: మచ్చికల మొగసిరి మందులాఁడ నీ-
కిచ్చిన దేహమిది యెట్టయినఁ జేయరా

చ. 1: ఓడక యెక్కడనైన నుండి నీవు
వేడుకతో మాయింటికి విచ్చేయఁగాను
వాడుమోముఁ జూచి నవ్వువచ్చుఁ గాని కోప-
మేడఁ దెచ్చుకొన్నరాదు యెట్టైనాఁ జేయరా

చ. 2: ఎంతవొద్దు వోయియైనా యిటునీవు
వింతలేక మాయింటికి విచ్చేయఁగాను
చింతతో నీ కెదురు చూచితి గాని
యెంతైనాఁ బాయలేను యెట్టయినాఁ జేయరా

చ. 3: కుంకుమచెక్కుల మెఱుఁగులతోడ తిరు-
వేంకటేశ మాయింటికి విచ్చేయఁగాను
వంకటాడి నినుఁ గూడవలెఁగాని
యింక నిన్నుఁ బాయలేను యెట్టయినాఁ జేయరా

రేకు: 0013-4 ఆహిరి సం: 05-077

పల్లవి: వలపు నిలుపలేని వారము నేమటుగాన
పలుమారు బట్టుకోన్నఁ బయికొనవేలరా

చ. 1: ఒత్తి నీవాడినమాటకోరువఁ జాలక నే-
ముత్తరమిత్తము గాని ఊరకుండలేమురా
బత్తి గొట్టానఁ బెట్టఁగఁ బనిలేదు వోరి నీ-
చిత్తమింతేకాని యిఁక జెప్పనేమున్నదిరా

చ. 2: కాఁకఁల బెరిగినట్టి కళవళమున నిన్నుఁ
దాఁకనాడుదుము గాని తడవుండలేమురా
యేఁకటఁ జెందినయట్టి యింతుల మాటకు నీవు
సోఁకోరువవలెఁ గాక చురుకనరాదురా

చ. 3: సారెకు నీవెడసిన సైఁచలేము నీవు
చేరువవనలిగి మమ్ముఁ జేకొనవేరా
ధీరుఁడవు కోనేటితిరువేంకటేశ నన్ను
గారవించి యిట్లానే కరుణించఁ గదరా

రేకు: 0013-5 శంకరాభరణం సం: 05-078

పల్లవి: అహో సురతివిహారోయం సహజ పరాజయశంకా నాస్తి

చ. 1: యమునాకూలే సమలతాగృహే విమలసైకత వివిధస్థలే
రమణీరమణౌ రమతస్తనేయోః ప్రమదస్య పరాత్పరం నాస్తి

చ. 2: రజనీ కావా ప్రాతః కింవా త్యజనం భజనం తత్కింవా
విజయః కోవాపజయః కోవా భుజపరిరంభ స్ఫుటం నాస్తి

చ. 3: చీనాంశుక రంజితమేఖలావి తానే జఘనంతరతి సతి
మానవికలనే మానినీమణే హీనాధిక పరిహృతి నాస్తి

చ. 4: కింవా మిళనం కింవా మిళనం త్వం వాం హంవా తన్నాస్తి
సంవాదో వా సరసః కోవా కింవా వాచ్యా క్రియా నాస్తి

చ. 5: ఆదిదేవ పీతాంశుక బద్ధా స్వేద సురభి కాశ్మీరజలం
సాదురుంహ్యాం లజ్జావివశతయా ఖేదేన వచః కించిన్నాస్తి

చ. 6: వరకుచాగ్ర సంవ్యానం కరేణ హరౌ పరం పరిహరతి సతి
సరసలోచనంచల వివశతయా తరుణ్యాం చైతన్యం నాస్తి

చ. 7: సురతాంతశ్రమ సుఖం కింవా వరలజ్జా సావా కావా
పరమశతను వైభవం కింవా నిరతాం తయో నికృతిం నాస్తి

చ. 8: పరమళ భరిత ప్రచుర సుశీతల వరమృదువాయౌ వాతి సతి
తిరువేంకటగిరిదేవ రాధయో స్సరసరతి సుఖశ్రాంతిర్నాస్తి

రేకు: 0014-1 శ్రీరాగం సం: 05-079

పల్లవి: విరహమొ సంభోగంబుల వెడుక శృంగారమొ యిది
సరసిజముఖిఁగని ప్రాణము జల్లనఁ గలఁగెడిసే

చ. 1: కుటిలాలకి మైఁబూసిన కుంకుమగంధపు రసములు
చిటిపొటి చెమటలఁ బెనఁగొని చిప్పిలి రాలఁగను
విటరాయని యలరమ్ములు వీఁపున వెడలఁగ నాఁటిన
తొట తొటఁ దొరిగిన నెత్తురుతోఁ దులదూఁగెడినే

చ. 2: మృగలోచన చనుఁగవపై మెత్తిన కమ్మని తావుల
మృగమదమంటినచోట్లు మెఱుఁగులు వారెడిని
చిగురాకున మరుఁడేసిన చిచ్చిరబాణంబులచే
ఎగసిన పొగలై తోఁచీ నేమని చెప్పుదునే

చ. 3: యోగవియోగంబులచే నొనగూడిన యీ చెలియకు
నాగరికంబుల చేఁతలు నటనలు మీరఁగను
శ్రీగురుఁడై చెలువొందిన శ్రీవేంకటగిరి నిలయుని
భోగించిన పరిణామపు పొందులు దెలిపెడినే

రేకు: 0014-2 నాదరామక్రియ సం: 05-080

పల్లవి: చెలియకు విరహపు వేదన సేయని సింగారంబిది
సొలవకు వలపుల ముద్రల చొప్పులు మాపకుఁడీ

చ. 1: కిక్కిరిసిన చనుగుబ్బలు గీఁటిన బగిలెడి నయ్యో
పక్కనఁ గనుకలి దాఁకీ బయ్యెద దెరవకుఁడీ
వెక్కసమగు ముఖకాంతికి వెడవెడ మరుఁగై తోఁచెడి
చెక్కుల చెమటలు గందెడి చేతులు వెట్టకుఁడీ

చ. 2: అంగన మేనికిఁ బులకలు అడ్డము దోఁచెడి నయ్యో
బంగరు మొలకలవంటివి పైపైఁ దుడువకుఁడీ
తొంగలి రెప్పల కెలఁకుల తొరిగెడి కన్నుల మెరుఁగుల
ముంగిటవేసిన చూపుల మురిపెము మానుపుఁడీ

చ. 3: తిరువేంకటపతినింతికి దెచ్చెదమనఁగా నయ్యో
కరుణించినవాఁడాతఁడె కళవళమందకుఁడీ
తరుణీమణి మా దేవునిఁ దగఁ గౌఁగిట సౌఖ్యంబులు
పరవశమందినదేమో పలుమరుఁ బిలువకుఁడీ

రేకు: 0014-3 పాడి సం: 05-081

పల్లవి: అంత సేయకుండితే నే నాఁటదాననా
పంతపు నీ బిగువెల్ల బయట వేయింతునా

చ. 1: కూరిమి సతుల భీతి గోర నన్ను నంటనీక
సారెకుఁ దప్పించు కొంటా సాము సేసేవు
యేరా నీకు నింత వెరపిటువంటి నిన్ననే పో
జీరలు మేనెల్లఁ జేసి సిగ్గు విడిపింతునా

చ. 2: మొక్కుచుఁ గెమ్మోవి మీఁద మోవనియ్యవేర పల్లు
వెక్కసపు తమకాన విఱ్ఱ వీఁగేవు
చిక్కితి వెక్కడికి విచ్చే సేవు నిన్ను నే
దక్కగొని మదన విద్యలనే చొక్కింతునా

చ. 3: ఎక్కువ నామేని జవ్వాదిందరుఁ దెలిసేరంటా
మిక్కిలి నీ మేనితావి మెరయించేవు
చక్కని వేంకటగిరి స్వామి నన్ను గూడితివి
గక్కన నాచూపు నీకుఁ గావలి వెట్టింతునా

రేకు: 0014-4 నాదరామక్రియ సం: 05-082

పల్లవి: ఏమొకొ చిగురుటధరమున యెడనెడఁ గస్తూరి నిండెను
భామిని విభునకు వ్రాసిన పత్రిక కాదుగదా

చ. 1: కలికి చకోరాక్షికిఁ గడకన్నులు గెంపై తోఁచిన
చెలువంబిప్పుడిదేమో చింతింపరె చెలులు
నలువున బ్రాణేశ్వరుపై నాటిన యాకొన చూపులు
నిలువునఁ బెరుకఁగ నంటిన నెత్తురు గాదు గదా

చ. 2: పడఁతికి చనుఁగవ మెఱుఁగులు పైపై బయ్యెద వెలుపల
కడు మించిన విధమేమో కనుఁగొనరే చెలులు
ఉడుగని వేడుకతోఁ బ్రియుఁడొత్తిన నఖ శశి రేఖలు
వెడలఁగ వేసవికాలపు వెన్నెల గాదు గదా

చ. 3: ముద్దియ చెక్కుల కెలఁకుల ముత్యపు జల్లుల చేర్పుల
వొద్దికలాగు లివేమో వూహింపరె చెలులు
గద్దరి తిరువేంకటపతి కామిని వదనాంబుజమున
అద్దిన సురతపుఁ జెమటల అందము గాదు గదా

రేకు: 0014-4 శ్రీరాగం సం: 05-083

పల్లవి: చిమ్మకువే గోళ్ళంత జీరలయ్యీని
చిమ్ముఁ జెమటల నిన్నుఁ జిక్కించె నతఁడు

చ. 1: కులికి నవ్వకువే కొప్పు వీడీని బెట్టు-
పలుకకువే మోవి బయలయ్యీని
వులికి పడకువే వొళ్ళు నొచ్చీని ని-
న్నెలయించి వలపుల నింత సేసె నతఁడు

చ. 2: కన్నుల మొక్కకువే కాఁక రేఁగీని నీ-
వన్నెలు చూపకువే వడ చల్లీని
సన్నలఁ దిట్టకువే చలమెక్కీని నిన్ను
మన్ననలనే సిగ్గు మరపించె నతఁడు

చ. 3: గుట్టున నడవవే కొంగు జారీని యింత-
తట్టుపుణుఁగేఁటికే తల నొచ్చీని
గట్టిగ శ్రీ తిరువేంకటరాయఁడు నిన్నుఁ
బెట్టని చోట్లఁ బెట్టిఁ పెద్దసేసె నతఁడు

రేకు: 0014-5 ఆహిరి సం: 05-084

పల్లవి: లంజకాఁడవౌదువురా లంజకాఁడవౌదువు నీ లాగులెల్లఁ గానవచ్చె
ముంజేతఁ బెట్టిన సొమ్ములకద్దమేలరా

చ. 1: కొంకక యెవ్వతో కాని కోరి నీబుజము మీఁద
కంకణాల చేయి వేసి కౌఁగిలించఁ బోలును
వంకలైన వొత్తులెల్ల వడిఁ గానవచ్చె నింక
బొంక నేమిటికిరా నీ బూమెలెల్లఁ గంటిమి

చ. 2: ఒద్దిక నెవ్వతో గాని వోరి నీవురము మీఁద
నిద్దిరించఁ గంటమాల నీలములొత్తినది
తిద్దిన జాణవుగాన తిరిగి తిరిగి మాతో
బద్దనేఁటికిరా నేఁ బచ్చి సేయఁ జాలను

చ. 3: వేడుక నెవ్వతో తిరువేంకటేశ్వర నిన్ను
కూడిన నీమేనితావి కొల్ల వట్టుకొన్నది
తోడనె నాకౌఁగిటిలో దొరకొంటి వింక నిన్ను-
నాడ నేమిటికిరా నా యలపెల్లఁ దీరెను

రేకు: 0015-1 ఆహిరి సం: 05-085

పల్లవి: లేత మాయలు నీకు నింతేసి పూత సిగ్గులే బూమిలో వారికి
యీఁత వలపు చిత్తములోన నెవ్వరికైనాఁ దెలుసునే

చ. 1: కొప్పునఁ జిన్ని కొనలు సాగ కురులు దురుము నేఁటికే
కుప్పలే గాఁగఁ జెక్కులదాఁ క కుంకుమ పూయనేఁటికే
ముప్పిరి గొనఁగ రెప్పల తుదల ముద్దులు గునియ నేఁటికే
నిప్పక సెలవిఁబార నవ్వుచు వింతలు సేయనేఁటికే

చ. 2: గుబ్బల మించులు పయ్యెద వెడల కులికి నడవ నేఁటికే
గబ్బితనము చూపులోని కలికి లాగుల లేఁటికే
వొబ్బిడియైన చెలుల లోన వొయ్యారము లేఁటికే
అబ్బుర పడఁ జూచిన వారి కాసలు సేయనేఁటికే

చ. 3: కొండల తిమ్మని జూచి లోలో కుతిల కుడువ నేఁటికే
కొండుక వయసు వారికింత గుట్టున నడవ నేఁటికే
యెండయు నీడయు నిపుడె కంటి మెమ్మెలఁ బొరల నేఁటికే
కొండత మేలు సేసిన వారిని కొడి మెలెన్న నేఁటికే

రేకు: 0015-2 తెలుఁగుఁగాంబోది సం: 05-086

పల్లవి: చెట్ట వట్టేవేరా నన్నుఁ జెంచుదానిని
పుట్టతేనెలారగించి పోకవుండేవా

చ. 1: కుదురు గదలని నాగుబ్బలే చూచితి గాని
గదరుఁ బుణుఁగు కంపు గానవైతివిగా
చిదిమినా నెఱఁగవు చేరేవు నా పొగడని
గుదికొన్నమరునమ్ము గుండె దాఁకెనా

చ. 2: తొరంపు నా మెఱుఁగుల తొడలే చూచితి గాని
జీరల నాచెమటమ్మై చిత్తగించవా
కేరేవు నా పొడగని కిందుపడి నీవు నాకు
యీరాని చనవులెల్లా నియ్యనోపుదా

చ. 3: పిక్కటిల్లు తేనెల నా పెదవే చూచితి గాని
చొక్కపు నా యెంగిలిని చూడవైతిగా
ఇక్కువ గరఁగి వేంకటేశ నన్నుఁ గూడితివి
వొక్కనిమిషమోరవ నోపవైతిగా

రేకు: 0015-3 శ్రీరాగం సం: 05-087

పల్లవి: తేనెయు నేయు నంపోవు తీపుమాటల
కానీలే తేనెయు నేయుఁ గాదా నీయలుక

చ. 1: కప్పురమే యంపోవు కటకటా అందుతోనే
అప్పుడైనా నిమ్మపండు నంపవైతివి
కప్పురగంధికి నీ కరుణ లేకుండుటే
కప్పురము నిమ్మపండుఁ గాదా నీయలుక

చ. 2: సంపెంగనూనె యంపేవు సారెసారె నందుతోనె
అంపవైతి గన్నెరలు అప్పుడైనాను
ఇంపులేని కోమలికి నేఁటికి సంపెంగనూనె
కంపులును గన్నెరలుఁ గాదా నీయలుక

చ. 3: నేరేడుఁ బండ్లే యంపేవు నెలఁతకు నందుతోనె
ఆరనియానవాలై నా నంపవైతివి
కోరి వేంకటేశ యింతిఁ గూడితిగాక లేకుంటే
నేరేడుఁబండ్లుఁ బాలును నేఁడేపో నీయలుక

రేకు: 0015-4 కన్నడగౌళ సం: 05-088

పల్లవి: ఏమనఁగలదిఁకఁ గాలము యింతయు విపరీతములై
భామినిదేము పరితాపంబున వేఁగెడిని

చ. 1: కప్పురమియ్యని వీడెము గైకొనకొల్లని కాంతకు
కప్పురమంటిన చోట్లే కడుఁగడుఁ దొక్కెడిని
పుప్పొడివెన్నెల పొళ్ళు (?) పొలఁతికి వెన్నెల బాయిలు
నిప్పులఁ దోఁగినయట్లే నిలువునఁ గాఁగెడిని

చ. 2: పానుపు పువ్వులఁ బరవక పవళింపుని సతి పూవులఁ
పానుపు కన్నులఁ జూచినఁ బరవశమందెడిని
లేనగవొదవని మాటలు లేనిలతాంగికి నగవులు
కానుకపట్టిన నొల్లక కన్నుల విసిగెడివి

చ. 3: కందర్పుని గురుఁడనఁగాఁ గలిగిన తిరువేంకటపతి - చందము చూపుల బామిని చనవున నొప్పెడిని
ఇందు వదనకే దేవుఁడు యింపులఁగడు మన్నించిన
కందువ పొలయలుకలఁ దమకమువడి రేపెడిని

రేకు: 0015-5 ముఖారి సం: 05-089

పల్లవి: ఆతఁడేపో చెలియా మాయాతఁడు
చేతనే పరము చూపి చెలువైన యాతఁడు

చ. 1: కుప్పలుగాఁ గస్తూరియు కుంకుమయు మయినిండ -
నప్పళించుకొని యున్న యాతఁడు
గొప్పగొప్ప ముత్తేల కుప్పె సవరము పెద్ద -
కొప్పుతోఁ జెలఁగీనదె కో మా యాతఁడు

చ. 2: మలయుఁ జెక్కుల నవ్వు మకర కుండలముల
అలర నిగ్గులె చల్లే యాతఁడు
బలువైన ముత్యాల పదకాల హరాల
వెలుఁగొందీ నదె చూడవే మా యాతఁడు

చ. 3: సంకుఁ జక్రపుఁ జేతుల సందుల బాహుపురుల
అంకెలఁబ్రభల మించే యాతఁడు
వేంకట నగము మీఁద విభవంపుఁ గౌఁగిలి నా -
కుంకువగా నిచ్చె నదెకో మా యాతఁడు

రేకు: 0016-1 సామంతం సం: 05-090

పల్లవి: వద్దు నాతో బొంక నిటువలె నీకు నీ -
సుద్దుల కాఁకల మంట సొద చొచ్చేరా

చ. 1: కనలి నే నపరాధిఁ గానని కలికి నీ -
కొనచూపులనే యలుగులఁ బారేనే
యెనసి యెవ్వతెకొ మోహింతువని నీ మోవి
మనసార నాలిక మడ్డువట్టే రా

చ. 2: మఱచి యెవ్వతెతో నే మాటాడనని నీ -
చిఱునవ్వు నిప్పులు దోసిట ముంచేనే
తెఱలఁ గాఁగిన నీ దేహపు టుక్కుఁ గంబము
కఱతలిన్నియు నని కౌఁగిలించేరా

చ. 3: నెలఁత దక్కితినని నీ వీడెపు రసము
చలివాయ నిపుడు పోసము దాగేనే
కలసియు నన్ను వెంకటరాయ కపటాన -
నలయించేవని నీపై నాన వెట్టేరా

రేకు: 0016-2 వరాళి సం: 05-091

పల్లవి: పన్నీరు చల్లెరా నీపై పలచని దెవ్వతో
అన్నువయలపుతోడ నసలాయఁ జెక్కులు

చ. 1: కప్పురము చల్లె నీపై కలికి యదెవ్వతో
యిప్పుడె నీ వురమెల్ల నెట్టి నాయను
చెప్పరాని మురిపెంపు చేఁతలెల్ల నాకును
కప్పిఁన గప్పఁగరాని గతులాయ నిప్పుడు

చ. 2: మృగనాభి చల్లె నీపై మెలుఁత యదెవ్వతో
తెగువ నీమోమెల్ల తెల్లనాయను
నగపు మేలము గాదు నమ్మరా నా పలుకు
సగవాయ నిప్పుడే యీ చక్కని నీ దేహము

చ. 3: కుంకుమ చల్లెర నీపై కోమలి యదెవ్వతో
సంకె దేరి నీమేనెల్లా చల్లనాయను
వేంకట విభుఁడ నీకు వెచ్చమైతిఁ జెప్పరా
వుంపకుగా నాకు నబ్బె ఉదుటు నీచేఁతలు

రేకు: 0016-3 ఆహిరి సం: 05-092

పల్లవి: కుందణంపుమై గొల్లెత తా -
నెందును బుట్టని యేతరి జాతి

చ. 1: కప్పులు దేరేటి కస్తూరి చంకల
కొప్పెర గుబ్బల గొల్లెత
చప్పుడు మట్టెల చల్లలమ్మేడిని
అప్పని ముందట హస్తిణిజాతి

చ. 2: దుంప వెంట్రుకల దొడ్డతురుముగల -
గుంపెన నడపుల గొల్లెత
జంపుల నటనలఁ జల్లలమ్మేడిని
చెంపల చెమటల చిత్తిణిజాతి

చ. 3: వీఁపున నఖములు వెడవెడ నాఁటిన
కోపపుఁ జూపుల గొల్లెత
చాఁపున కట్టిగఁ జల్లలమ్మేడిని
చాఁపేటి యెలుగున శంకిణిజాతి

చ. 4: గారవమున వేంకటపతి కౌఁగిట
కూరిమిఁ బాయని గొల్లెత
సారెకు నతనితో చల్లలమ్మేడిని
బారపుటలపుల పద్మిణిజాతి

రేకు: 0016-4 ముఖారి సం: 05-093

పల్లవి: సతి గర్వమిది నీ తేజము గాదా
అతివఁ బ్రేమముతోడ నాదరించవయ్యా

చ. 1: కనకపుఁ జమ్మాళిగలు మెట్టియల జ-
వ్వని గర్వమున నిట్టె వచ్చి వచ్చి
వెనక వెనకకె పోయీ వెఱచి దేవరఁగని
కనకపందలము గక్కన నంపవయ్యా

చ. 2: అడప తొయ్యలి తన కాకు మడిచియ్యఁగా
నడపుల మురిపేన నవ్వుచు వచ్చి
అడరి నీ పొడగని ఆకదే తనకుఁ దానె
మడుచుకొనెడి నీవె మడిచియ్యవయ్యా

చ. 3: కొప్పున సంపంగిరేకులు గానరాఁ జెరిగి
కప్పుచు నెరుల నిన్నుఁగని కలికి
యెప్పుడునుఁ దిరువేంకటేశుఁడ నీ వెఱపెల్ల
చెప్పరాని తమకమే చిత్తగించవయ్యా

రేకు: 0016-5 భైరవి సం: 05-094

పల్లవి: గోళ్ళు మీఁటుచునుండెఁ గొన్నాళ్ళు గొల్ల-
వీళ్ళ పాలారగించె వీఁడు కొన్నాళ్ళు

చ. 1: కోడెకాఁడై తిరిగెఁ గొన్నాళ్ళు తాఁ
గోడెల నావుల- గాచెఁ గొన్నాళ్ళు
కోడెల వల్లెతాడై గొల్లెతలా తాఁ
గూడి పైకొననుండెఁ గోరి కొన్నాళ్ళు

చ. 2: గుజ్జు రూపము ధరించెఁ గొన్నాళ్ళు
గుజ్జనగూళ్ళారగించెఁ గొన్నాళ్ళు
గుజ్జుబాలకిఁ దగిలెఁ గొన్నాళ్ళు తా
బొజ్జెనె లోకము నించె పొందుగఁ గొన్నాళ్ళు

చ. 3: కొండ గొడుగుగాఁ బట్టెఁ గొన్నాళ్ళు తాఁ
గొండముచ్చుల నేలెఁ గొన్నాళ్ళు
కొండల కోనేటివాఁడై కోరికలా తాఁ
గొండుక చేఁతలు దొంకొనియెఁ గొన్నాళ్ళు

రేకు: 0016-6 ముఖారి సం: 05-095

పల్లవి: దొరకెఁగా పూజ కందువపూజ నీ-
విరహపు తనుతావి విరవాదిపూజ

చ. 1: కలికి నీ కనుచూపు కలువరేకులపూజ
లలన నీ నగవు మొల్లల పూజ
తలపోఁత చింత చిత్తపుఁ గమలపు పూజ
చలివేఁడి పూర్పు నీ సంపంగి పూజ

చ. 2: కవలుఁ జెక్కునఁ జేయి కరపల్లవపు పూజ
తనుపులకలు జాజినలపూజ
తనరు నీవలులు దొంతరపూవుల పూజ
మొనయుఁ జెమట మల్లె మొగ్గలపూజ

చ. 3: చెనకు నీ గోళ్ళే చిఱుగేదఁగుల పూజ
గునియు గుబ్బలు పూవుగుత్తుల పూజ
ఘనతమ్మైఁ గూడి వేంకటపతి మోము సోఁ-
కిన నీదుమోవి మంకెనపూవు పూజ

రేకు: 0017-1 ముఖారి సం: 05-096

పల్లవి: పసులు గాచేటి కోల పసపుఁ జేల
పొసఁగ నీకింతయేల బుద్ధుల గోల

చ. 1: కట్టిన చిక్కపు బుత్తి కచ్చుకాయల తిత్తి
చుట్టిన పించెపుఁ బాగ చుంగుల సోగ
ఇట్టి సింగారము సేయ నింత నీకుఁ బ్రియమాయ
వెట్ట నీచేతల మాయ విట్ఠలరాయ

చ. 2: పేయలఁ బిలుచుకూఁత పిల్లఁగోవి బలుమోఁత
సేయరాని గొల్లెతల సిగ్గులచేఁత
ఆయెడలఁ దలపోఁత యమున లోపలి యీఁత
వేయరాని మోపులాయ విట్ఠలరాయ

చ. 3: కొంకులేని పాలయాట కూరిములలో తేట
అంకెల బాలులతోడి యాట పాట
పొంకపు తుత్తురు కొమ్ము పొలుపైన నీ సొమ్ము
వేంకటనగము చాయ విట్ఠలరాయ

రేకు: 0017-2 భైరవి సం: 05-097

పల్లవి: ఉగ్గు వెట్టరే వోయమ్మా చె-
యియ్యగ్గేనిదె శిశువోయమ్మా

చ. 1: కడుపులోని లోకమ్ములు గదలీ-
నొడలూఁచకురే వోయమ్మా
తొడికెడి సరుగనఁ దొలఁగఁ దీయరే
వుడికెడి పాలివి వోయమ్మా

చ. 2: చప్పలు వట్టుక సన్నపుబాలుని-
నుప్పరమె త్తకురో యమ్మా
అప్పుడె సకలము నదిమీ నోరనె
వొప్పదు తియ్యరె వోయమ్మా

చ. 3: తొయ్యలులిటు చేతుల నలఁగించక
వుయ్యల నిడరే వోయమ్మా
కొయ్య మాటలను కొండల తిమ్మని-
నొయ్యన తిట్టకురోరమ్మా

రేకు: 0017-3 దేసాళం సం: 05-098

పల్లవి: కొలనిదోఁపరికి గొబ్బిళ్ళో యదు-
కులము స్వామికిని గొబ్బిళ్ళో

చ. 1: కొండ గొడుగుగా గోవులఁ గాచిన
కొండుక శిశువుకు గొబ్బిళ్ళో
దుండగంపు దైత్యులకెల్లను తల-
గుండు గండనికి గొబ్బిళ్ళో

చ. 2: పాపవిధుల శిశుపాలుని తిట్ల-
కోపగానికిని గొబ్బిళ్ళో
యేపునఁ గంసుని యిడుమలఁ బెట్టిన-
గోపబాలునికి గొబ్బిళ్ళో

చ. 3: దండి వైరులను తఱమిని దనుజుల-
గుండె దిగులునకు గొబ్బిళ్ళో
వెండిఁ బైఁడియగు వేంకటగిరిపై
కొండలయ్యకును గొబ్బిళ్ళో

రేకు: 0017-4 కాంబోది సం: 05-099

పల్లవి: తమ్ములాల అన్నలాల తల్లులాల నే
నెమ్మనపు హరిఁ బాసి నిలువనేనిఁకను

చ. 1: కొమ్మలాల మరుకోట కొమ్మలాల వో-
యమ్మలాల తొలరె నా యక్కలాల
తమ్మిరేకుఁ గన్నుల యాతనిఁ బాసి నే-
నుమ్మల సొమ్మలచేత నుండలేనిఁకను

చ. 2: చెలులాల కలికి తొయ్యలులాల వో-
యెల జవ్వనముల మోహినులాల
చెలువంపు హరిఁ దలఁచిన నాకు నే -
నులుకుఁ గన్నీ రాఁపకుండలే నిఁకను

చ. 3: బోఁటులాల జవ్వనపు మేఁటులాల వో-
గాఁటపుఁ దురుముల చీఁకటులాల
వాఁటమైన వేంకటేశ్వరుఁ బాసి నే-
నాఁటదాననై జన్మమందలేనిఁకను

రేకు: 0017-5 పాడి సం: 05-100

పల్లవి: ఏఁటికిఁ జేరీనేమితఁడు
నాఁటించి రతి నన్నేలె

చ. 1: కన్నుల మొక్కీఁ గానుకలంపీ -
నెన్నటికెన్నఁడిదేమితఁడు
నిన్నట నుండియు నెయ్యమె పెంచీ
నన్నేలీతఁడు నవ్వీనే

చ. 2: పువ్వుల వేసీఁ బొంచుక లాసీ-
నెవ్వరికెవ్వరిదేమితఁడు
దవ్వుల నున్నాఁ దాపము రేఁచీ
రవ్వలనే కడు రాసీనే

చ. 3: కంపులె పూసీఁ గౌఁగిట మూసీ-
నింపులు నేసీనేమితఁడు
చెంపల చెమటల శ్రీ వేంకటేశుఁడు
అంపరాని విభుఁడాయఁ గదే

రేకు: 0017-6 శ్రీరాగం సం: 05-101

పల్లవి: సామాన్యమా వలపు సతులుఁ బతులనుభవన -
లేమరినఁ బ్రాణంబులేరీతి నుండు

చ. 1: కలికి చూపుల మనసు గరఁగ కెటువలె నుండు
అలయింతలను దేహమలయకేలుండు
బులుపుఁ బిలుపుల మేను పులకించకేలుండు
మొలకనగవుల యాస మొలవకేలుండు

చ. 2: పచ్చిచూపులు కాఁడి పారకెటువలెనుండు
వెచ్చనూర్పులు మనసు వేఁచకేలుండు
మచ్చికల హృదయంబు మరులు గొనకేలుండు
అచ్చలంబునఁ గాఁకలలమకేలుండు

చ. 3: దంటమాటలఁ గూర్మి దగుల కెటువలెనుండు
నంటునను మోహంబు నాఁటకేలుండు
గొంటుఁజేఁతల మనసు కొల్లగొనకేలుండు
రెంటలను విరహగ్ని రేఁచకేలుండు

చ. 4: కింకలను దమకంబు కెరలకెటువలె నుండు
జంకెనలఁ బ్రేమ కొనసాఁగకేలుండు
వేంకటవిభుఁనిఁ గలసి వెడయలుక యేలుండు
పంకజానన వానిఁ బాసియేలుండు

రేకు: 0018-1 మంగళకౌశిక సం: 05-102

పల్లవి: నేనేలెవ్వరునేల నీకింక లో-
లోనె వలపు లోఁచీఁ బోవయ్యా

చ. 1: కలువరేకులు నీకుఁ గానుక యిచ్చినదట
చెలఁగి నీవెందో విచ్చేయఁగాను
అలమి కన్నులనె నీ వందుకొంటివని యాకె
పిలిచీనంటాఁ బిలిచేరు పోవయ్యా

చ. 2: చిగురుఁదేనెలు నీపై చిలకించినదట
నగవు నీ వెందో నగఁగాను
జిగిగా నీ వపుడే చేకొంటివంటా నాపె
నొగిలీనంటా నొగిలేరు పోవయ్యా

చ. 3: మోవిపండు నీకు మోవినిచ్చినదఁట
మావికింద నీవు మలయఁగాను
శ్రీవేంకటేశ యిచ్చితివి కౌఁగిలి నాకు
నీ వెందు వలచినా నేనే పోవయ్యా

రేకు: 0018-2 శ్రీరాగం సం: 05-103

పల్లవి: గొల్లెతలకేలరా గోవజవ్వాది నీకు
చెల్లుఁగాక యెటువలెఁ జేసినా నన్ను

చ. 1: కట్టినది అంచులతొగరుఁ జీర సందిఁ
బెట్టినది మొలవంక పెద్దగాజు
మెట్టిన కంచుమట్టెల మించుమోఁత చేత-
బట్టినది చల్లచాడె పట్టకురా నన్నును

చ. 2: మాసినది తురుము చెమరుకంపు నే
వేసినది వెండికుప్పె వెంట్రుకదండ
వోసికొట్లు గొట్టి కంచుటుంగరాల చేయి
తీసేవు నీ చెల్లెతోడు తియ్యకురా నన్నును

చ. 3: ముంచినవి చెమటలు మోమునిండ కడు-
నంచినది చూడరా నావాలుఁజూపు
యెంచనేల నన్నునిట్టె యేలితివి వోరి
చెంచెతల లంజకాఁడ శ్రీవేంకటేశుఁడా

రేకు: 0018-3 పాడి సం: 05-104

పల్లవి: ఏతులే నెరప వచ్చినెవ్వఁడే వీఁడు తన-
రాతిగుండెతోడ నన్ను రమ్మనీనే చెలియా

చ. 1: కదిమిన చూపులకుఁ గన్నుల నవ్వుచు నా-
యెదురయి నిలుచున్నాఁడెవ్వఁడే వీఁడు
ఉదుటు మీరి తిరిగీ నొదిగి వీనిమదము
సదసేసి వడి నణఁచఁగదె వోచెలియా

చ. 2: చేరువనె నిలుచుండి చెలితో నవ్వఁగను
యీరసములే యాడీ నెవ్వఁడే వీఁడు
వారించకిటువంటివానిఁ బట్టి కొనగోరఁ
జీరలుగా నొడలెల్లఁ జించఁగదె చెలియా

చ. 3: చెంతనుండి నన్ను వేసీ సేమంతిపూవులనే
యెంత చెప్పినా మానఁడెవ్వఁడే వీఁడు
ఇంతటి యీ తిరువేంకటేశుఁడిదె నన్నుఁ గూడి
పంతము నెరపి పోయీఁ బట్టుకొనవే చెలియా

రేకు: 0018-4 లలిత సం: 05-105

పల్లవి: నిక్కమటే యీ మాట నిజమనేవు
నిక్కముగాక బొంకనేర్తుమా బాలుఁడా

చ. 1: కంటివటే వెన్న దియ్యఁగా గొల్లెతా ని-
న్నంటిమా మా వెన్న వోయనంటిమి గాక
ఇంటికి నే వచ్చితినటే గొల్లెతా మా-
యింటికిఁక నీకు రానేలయ్య బాలుఁడా

చ. 2: ఏలే మాకుఁ బాలు లేవటే గొల్లెతా నీకు-
నేలలేవు మమ్మునిట్టె యేఁచేవు గాక
పాల నేఁబండుట దలంపవే గొల్లెతా ఆ-
పాలు నీకునేల మా పాలేకాక బాలుఁడా

చ. 3: కల్లలాడ దొరకొంటిగా గొల్లెతా యేల
పల్లదాలు వేంకటాద్రిపై బాలుఁడా
చెల్లఁబో నన్నొల్లవటే చిన్ని గొల్లెతా నీకుఁ
జెల్లునిట్టె యేమైనఁ జేయవయ్య బాలుఁడా

రేకు: 0018-5 పాడి సం: 05-106

పల్లవి: అప్పటిని చెక్కు నొక్కే వందుకా యిది
యెప్పుడో కూడితిరి మీరిందుకా యిది

చ. 1: కుందనపు బొమ్మవలెఁ గోపగించుకొని రాఁగా-
నందలానఁ బెట్టుకొంటివందుకా యిది
జందెపు ముత్తెపుఁ బేరు సందులదండల నిట్టే
యిందమంటానింతికిచ్చితిందుకా యిది

చ. 2: దీకొని కోమలి నిన్నుఁ దిట్టుచు దగ్గరి రాఁగా
ఆకు మడిచియ్యఁ జూచేవందుకా యిది
మీకు మీకే మందటాడి మీరు మీరేమీలోన
యేకమై కూడితిరి మీరిందుకా యిది

చ. 3: ముద్దులమోముల మీ మీ మోవులపై చేఁతలెల్ల
నద్దములోపలఁ జూచేరందుకా యిది
తిద్దుకొంటిరి రతులు తిరువేంకటేశ మీ-
యిద్దరికి నింపులాయ నిందుకా యిది

రేకు: 0018-6 పాడి సం: 05-107

పల్లవి: చక్కని తల్లికి చాఁగుబళా తన-
చక్కెరమోవికి చాఁగుబళా

చ. 1: కులికేటి మురిపెపు గుమ్మరింపుఁ దన-
సళుపుఁ జూపులకు చాఁగుబళా
పలుకుల సొలపులఁ బతితోఁ గసరెడి-
చలముల యలుకకు చాఁగుబళా

చ. 2: కిన్నెరతోఁ బతి కెలన నిలుచుఁ దన-
చన్ను మెఱుఁగులకు చాఁగుబళా
ఉన్నతిఁ బతిపైనొరగి నిలుచుఁ దన-
సన్నపు నడిమికి చాఁగుబళా

చ. 3: జందెపు ముత్యపు సరులహారముల -
చందనగంధికి చాఁగుబళా
విందయి వేంకటవిభుఁ బెనఁచిన తన-
సందిదండలకు చాఁగుబళా

రేకు: 0020-1 శంకరాభరణం సం: 05-108

పల్లవి: పోదిగా నేఁడతనికే పొలఁతి మానము గావ
సేదదేరఁ జెమటలు చిలికించెఁ జూడరే

చ. 1: కుంతలపు నెరుల చిక్కుల చీఁకటులఁ జిక్కి
యింతలోనే ముఖచంద్రుఁడింతికి నేఁడు
చెంత వాయఁ బతివచ్చి జిగిచన్నుఁగొండలపై
వింత చందురుల దండు విడియించెఁ జూడరే

చ. 2: ఈతల నిట్టూరుపుల యెండమావులనె వాడె
లేఁతమోవి చిగురు యీ లేమకు నేఁడు
పూఁతగాఁ దెచ్చి చెలియ పులకలవెల్లి నించె
మేఁతలాడి రమణుఁడీ మెలుఁతమ్మైఁ జూడరే

చ. 3: పుట్టుబోగి సిగ్గుల చూపుల పూవుఁదీగెలపై
పిట్టపిడుగాయ సతిప్రేమము నేఁడు
గట్టిగ వేంకటపతి కౌఁగిటనలమి కొమ్మ
దిట్టఁజేసి భయమెల్ల దిగఁదోసెఁ జూడరే

రేకు: 0020-2 నారణి సం: 05-109

పల్లవి: ఏమి సేయఁగవచ్చు నేకాలమేత్రోవ
ఆమీఁది దైవగతులటుగాక పోదు

చ. 1: కనుమాయ నెన్నడిమికరవుననె లలితాంగి
పనువుచునుఁ గుచగిరుల పాలాయను
కనలి లోలోని దొంగలచేతఁ బోటుపడి
వొనరఁ గట్టనచీరయును శిథిలమాయ

చ. 2: పెడమరలి నునుఁదురుము పెదచీఁకటినె చెలియ
బడలి వదనము వంచఁ బాలాయను
వెడఁదకన్నుల చూపువేడుకల వగలెల్ల-
దడవి హితవైన చిత్తంబు నెరవాయ

చ. 3: అరుదైన పరవశంబను అడవిలోఁ దగిలి
పరిమళపుఁ జెమట నది పాలాయను
యిరవైన తిరువేంకటేశు కౌఁగిటఁ గూడి
కురులు సవరించ సిగ్గులునుఁ బగలాయ

రేకు: 0020-3 శ్రీరాగం సం: 05-110

పల్లవి: అంతరంతకు గాలినణఁగునా యనలంబు
కాంత నిట్టూర్పులాఁకలి చెరిచెఁగాక

చ. 1: కలువలూరక నీటఁ గందునా యెండైనఁ
జెలియకన్నీరిట్లఁ జేసెఁ గాక
జలజంబుపై వేఁడి చల్లునా రవి యిట్ల
నలఁచి మదనాగ్ని వదనము నొంచెఁగాక

చ. 2: విరులకునుఁ దుమ్మిదలు వెరచునా యెండైన
మరుబాణముల నెరులు మలఁగెఁగాక
సరుస మంచునఁ దీగె వాడునా యెండైన
అరిది చెమటలనె దేహము నొగిలెఁ గాక

చ. 3: కుముదహితుఁడెండైనఁ గూడునా జక్కవల
కొమరె గుబ్బలమీఁదఁ గూడెఁ గాక
తిమిరంబు తిమిరమునఁ దెమలునా యెండైన
రమణి వేంకటవిభుని రతిమఱపుగాక

రేకు: 0020-4 ముఖారి సం: 05-111

పల్లవి: ఆఁపలేక నిను దూరేనంతె గాక
యేఁపుచుఁ గూడేటి పొందులేలయ్యా విభుఁడా

చ. 1: కోపగించుకొన్నచోట కూరిమితో వినయమే
చూపిన నామాట నీకు సొగసీనటే
యేపు రేఁగి నీకుఁ బ్రియమెక్కడనో వుండఁగాను
తాపమయ్యే పొందు నీకుఁ దగదయ్యా విభుఁడా

చ. 2: నేరములెన్నఁగ నేను నిజములు పలికిన
వైరములే యౌఁగాక వలపౌనటే
యీరుదీయఁ బేను వచ్చీనిఁకనేల మాటలు నీ-
వారము మమ్మిఁకఁ దడవకుమయ్యా విభుఁడా

చ. 3: ననిచి కూడినవారు నమ్మక ప్రియునిమీఁద
కనలి యాడినమాట కసరౌనటే
ఘనుఁడవు తిరువేంకటరాయ మనలోని-
కినుకలన్నియు నిట్టె గెలుపయ్యా విభుఁడా

రేకు: 0020-5 కాంబోది సం: 05-112

పల్లవి: అతివ జవ్వనము రాయలకుఁ బెట్టిన కోట
పతి మదనసుఖరాజ్యబారంబు నిలుప

చ. 1: కాంతకనుచూపు మేఘంబులోపలి మెఱుఁగు
కాంతుని మనంబు చీఁకటి వాపను
ఇంతి చక్కనివదన మిందుబింబము విభుని-
వంత కనుదోయి కలువలఁ జొక్కఁజేయ

చ. 2: అలివేణిధమ్మిల్లమంధకారపు భూమి
కలికి రమణునకు నేకతమొసఁగను
పొలఁతికి బాహువులు పూవుఁదీగెల కొనలు
పొలసి ప్రాణేశు వలపుల లతలఁ బెనచ

చ. 3: పంకజాననరూపు బంగారులో నిగ్గు
వేంకటేశ్వరు సిరులు వెదచల్లఁగా
చింకచూపుల చెలియచేఁత మదనునిచేఁత
యింకా నతనినె మోహించఁ జేయఁగను

రేకు: 0020-6 నాదరామక్రియ సం: 05-113

పల్లవి: ఏమి సేయుదునమ్మ యిన్నియును నిటుగూడె
తామసపుఁ బ్రేమ వేదనఁ బాయనీదు

చ. 1: కినిసి నే పొలసి పలికెద నంటినా యతని-
నెనయుదఁడఁబాటు నోరెత్తనీదు
చెనకి యలపార జూచెద నంటినా యతని-
కనుఁగవ జలంబు సరుగనఁ జూడనీదు

చ. 2: కిందుపడి కదిసి మ్రొక్కెద నంటినా యతని-
యంది పరవశము చేయాడ నీదు
డెందంబు మఱచి యుండెద నంటినా యతనిఁ
జెందిన తలఁపు మఱచియు మఱవనీదు

చ. 3: తిరువేంకటేశుఁ బొందితినంటినా యతని-
దొరతనము నాగరిమ దోఁచనీదు
సిరిదొలఁకు రతుల నలసితి నంటినా యతని-
సరసంబు వేడుకలఁ జాలించనీదు

రేకు: 0021-1 కాంబోది-రచ్చతాళం సం: 05-114

పల్లవి: తవ మాం ద్రష్టుం దయాస్తివా
త్రివిధైర్భునాని తే నామాని

చ. 1: కరరమణీ కంకణైర్భునకుచ-
గిరౌ స్థాపిత కిన్నరీయం
సరసం మ్లేచ్ఛరచనాని త్వయి
స్థిరా నదయతి తే నామాని

చ. 2: కలవర కంపిత కఠంవిలసనం
కిలకిలమేళన కిన్నరీయం
లలనా కావా లంఘితవాద్యం
తిలకయతి తదా తే నామాని

చ. 3: నిరత మూర్ఛనా నిబిడతాళరవ
గిరాయోజిత కిన్నరీయం
తరుణీ రణయతి తదా సమీపే
తిరువేంకటవర తే నామాని

రేకు: 0021-2 వరాళి సం: 05-115

పల్లవి: సొంపుల నీ వదనపు సోమశిల కనుమ
యింపులెల్లఁ జేకొనఁగ నిల్లు నీపతికి

చ. 1: కలికి నీపిఱుఁదనే గద్దెరాతికనుమ
మొలనూళ్ళలతలనే ముంచుకొన్నది
కలయఁ బోకముడినే కట్లువడ్డది
అలరువిలుతుదాడికడ్డము నీ పతికి

చ. 2: ఇదివొ నీ కెమ్మోవి యెఱ్ఱశిల కనుమ
కదిసి లేఁజిగురులఁ గప్పుకొన్నది
వదలకింతకుఁ దలవాకిలైనది
మదనుని బారికి మాఁటువో నీ పతికి

చ. 3: కాంత నీ చిత్తమే దొంగలసాని కనుమ
యింతటి వేంకటపతికిరవైనది
పంతపు నీ గుబ్బలే గుబ్బలికొండకనుమ
మంతనాల కనుమాయ మగువ నీ పతికి

రేకు: 0021-3 కన్నడగౌళ-అటతాళం సం: 05-116

పల్లవి: తురుము నీవియు జార తొయ్యలి వెరగంద
సిరులఁ బరవశము సేసితిగా నీవు

చ. 1: కొమ్మమోవి నీకుఁ బిల్లగోవిగాఁగ నిడుకొని
కుమ్మరించుఁగుత్తుకలోఁ గులుకుచును
తమ్ములపు రసము చిత్తడిగాఁ గురియుచు
చిమ్మిరేఁగ రాగము నించితివిగా నీవు

చ. 2: పడఁతిగుబ్బలు నీకుఁ బాంచజన్యములుగా
కడివోని మొనలోలిఁ గదియ నొత్తి
తడయక మదనయుద్ధము గెలిచితినంటా
వొడలి చెమటలార నూదితిగా నీవు

చ. 3: వెలఁదివీఁపిది నీకు వీణె వొళవుగా
ములువాఁడి కొనగోళ్ళ మోఁపి మోఁపి
కలసి కౌఁగిటను వేంకటగిరి విభుఁడ నీ-
మెలుపుఁగళల తంతి మీఁటితిగా నీవు

రేకు: 0021-4 కన్నడగౌళ సం: 05-117

పల్లవి: రమణి సురటిగాఁ జెరఁగు వీచీని
చెమరించెనంటాఁ జెలి దూరీని

చ. 1: కలగంటినంటా కాటుకకనుల నీరు
వొలకఁగా మలగు పై నుసురనీని
తల నొచ్చీనంటా దంతపుటోవరిలోన
పలుకదు పిలిచినాఁ బవ్వళించీని

చ. 2: తొలఁగితినంటా తూఁగుమంచముమీఁ ద
సెలవినవ్వులతోడ శిరసూఁచీని
అలసితినంటా నలరుఁబానుపుఁ మీద
పులకలమేనితోఁ బొరలెడిని

చ. 3: సొరిగితినంటా సురతపరవశాన-
నరవిరి కనురెప్పలల్లాడించీని
తిరమాయనంటాఁ దిరువేంకటేశ్వరుఁ
దరుణి గలసి యింకాఁ దమకించీని

రేకు: 0021-5 ఆహిరి సం: 05-118

పల్లవి: చెంగటనె చెలువంపుఁ జీఁకటి దవ్వఁగను
ముంగిట నిధానమబ్బె మొక్కుదుఁగాకిఁకను

చ. 1: కొండుకవయసు కొమ్మగుబ్బలపై బ్రేమపు-
టెండదాఁకి పులకలనెన్ను వెళ్ళఁగా
బెండుపడి కైవాలెఁ బెనుదురుమిఁకనేమి
పండెఁ గోసుకొందుగాక పనులేఁటికిఁకను

చ. 2: చక్కని జవ్వని కన్నుఁజాయల పాదరసము
పుక్కిటి వెచ్చని పూరుపుల నూదఁగా
గక్కన బంగారాయ కడలేని కోరికలు
దక్కెఁ దీసుకొందుగాక తడవేల యిఁకను

చ. 3: పల్లదపుఁ జెమటల పాల జలనిధి దచ్చి
వెల్లిగొన సిరులెల్ల వేంకటేశుఁడా
పల్లవాధరిచనపు పచ్చిదేర వేడుకెల్ల
కొల్ల చేకొందువుగాక కొంకనేఁటికిఁకను

రేకు: 0021-6 ముఖారి సం: 05-119

పల్లవి: ఏలే దగ్గర నియ్యవిట్టె నన్ను
తూలపుచ్చి మరుబారిఁదోయ దొరకొంటివి

చ. 1: కాలు దాఁకి మొక్కేమయ్యా గబ్బిననేవు గనక
యేల దగ్గర విచ్చేసేవిట్టె నన్ను
వాలుఁగన్నుల రెప్పలు వంచి వంచి మొక్కేవు
చాలదటే నన్ను నిట్టె చంపనెత్తుకొంటివి

చ. 2: తమ్మరసము వడీని తలవయ్య నీ మీఁద
యెమ్మెలకడ్డము వచ్చేవు యేఁటికే నీవు
వమ్ముదొలి మాటలనె వాఁడివసులనె నన్ను
కుమ్ముచుఁ బ్రాణమునిట్టె కొనదొరకొంటివి

చ. 3: గుబ్బలచెమట దాఁకీఁ గోపగించేవు గనక
ఆబ్బురంపుఁ దిరువేంకటాధీశుఁడా
జొబ్బిలు నా చెమటల సోనల నించక యట్టే
జొబ్బలుగా నామేనెల్లాఁ బొక్కించ దొరకొంటివి

రేకు: 0022-1 పళపంజరం సం: 05-120

పల్లవి: ఏమిటికిఁ జింత యిదె నీకు
ప్రేమపుఁ బెండ్లి బెరసెఁగా నీకు

చ. 1: కలికి నీ చూపుల కలువదండలు దెచ్చి
తలఁకకాతనిమెడఁ దగులవేసి
మొలక నగవుల నీ ముత్యపుసేసలు చల్లి
తొలఁగని పెండ్లి దొరకెఁగా నీకు

చ. 2: చనపుఁ గూరిముల కొసరులను గరమిడి
ఘనమైన కాఁకలఁ గాలుదొక్కి
పనివడి వెన్నెల పాలకూడు గుడిచి
తనివోని పెండ్లి దగిలెఁగా నీకు

చ. 3: తరుణి నీ హృదయపుఁ దిమ్మెపరపుతోడ-
నిరవైన సిరులతో నిల్లు నించి
తిరువేంకటగిరి దేవునితోఁగూడి
సరసపు బెండ్లి జరగెఁగా నీకు

రేకు: 0022-2 కాంబోది సం: 05-121

పల్లవి: చెంపల యేరు ముండ్ల చెంచువారము నీకు-
నింపుగాని మా పొందులేలయ్యా

చ. 1: కమ్మనిమామయి పూఁత గదరుఁబిల్లుల గబ్బు
యెమ్మెల మాపట్టుచీర యేపెనార
సొమ్ములుఁ బెంచపుకన్నుఁ జూపులయమ్ములనె
వొమ్మదు నీ పొందు నాకు నొల్లమయ్యా

చ. 2: కొప్పుగేదఁగులు మాకు కొన నమలీకలు
గొపముత్యాలివి మాకు గురిగింజలు
కప్పురంబు మాకేటి గడ్డల తెల్లని మన్ను
వొప్పదు మాకేల యిచ్చేవొల్లము నేమయ్యా

చ. 3: కుంకుమ మా కిపుడు జేగురుఁదొడి నుదుటికి
బింకపుఁ దిట్లె మా ప్రియములు
కంకిగాఁగ నెలయించి కౌఁగిటఁ గూడితి నన్ను
వేంకటవిభుఁడ యిఁక వీడవయ్యా

రేకు: 0022-3 వరాళి సం: 05-122

పల్లవి: కటకట సతిశృంగారము కన్నులపండువు దోఁపుచు
యిటువలె నిలిచి చిత్తంబిందరినేఁపెడిని

చ. 1: కోమలి కొప్పునఁ జెరివిన క్రొవ్విరులాత్మజు శరములు
వేమరుఁ బొదిగొన నాఁటిన విధమున నొప్పెడిని
కామిని పూసిన కస్తూరి కంతుని బాణారుణిమే
యీమైఁ బైపైఁ బేరిన యిటువలె నొప్పెడిని

చ. 2: అతివకు భూషణజాలంబంతయు మరువస్త్రములకు
జతనంబగు మైమరువై సరిఁ జెలువొందెడిని
సతి గట్టిన వెలిపుట్టము చంపెడు మదనుని బారికి
సితకరుఁడడ్డము చొచ్చిన చెలువము దోఁపెడిని

చ. 3: బలుపగు చెలిచనుగుబ్బలపై వేంకటపతి నించిన-
లలితపు రేఖల బిత్తరిలాగులు దోఁపుచును
వలరాయని చిరునమ్ములు వడిఁదాకిన గంట్లవలెఁ
బొలుపుగఁ జూచినవారల బొమ్మరపరపెడిని

రేకు: 0022-4 ఆహిరి సం: 05-123

పల్లవి: అన్ని జాతులు దానె యైవున్నది
కన్నులకలికి మాయగరచెనో యనఁగ

చ. 1: కన్నె శంకిణిజాతి గాఁబోలు వీఁపునను
సన్నపు మదనాంకములు జడి గొన్నవి
వన్నెలుగ వలరాజు వలపు తలకెక్కించ
పన్నినటువంటి సోపానములో యనఁగా

చ. 2: తెలివ దలపోయ చిత్తిణిజాతి గాఁబోలు
నెఱులు విచ్చుచు వీధి నిలుచున్నది
నెఱతనము మరుఁడు తను నిండవేసిన యంప-
గరులిన్ని యనుచు లెక్కలు వెట్టుగతిని

చ. 3: కాంత హస్తిణిజాతి గాఁబోలు కరమూలము-
లంతకంతకు నలుపులై యున్నవి
పంతంపుమరుఁడు తన భండారమిండ్లకును
దొంతిగా నిడిన కస్తూరి ముద్రలనఁగా

చ. 4: ఘనత పద్మిణిజాతి గాఁబోలు నీలలన
తనువెల్ల పద్మగంధంబైనది
మినుకుగా మరుఁడు తామెరలమ్ములనె మేను
కనలించి వడిఁ బువ్వగట్టెనో యనఁగా

చ. 5: ఇదియు జగదేక మోహిణి దానె కాఁబోలు
కదలు కనుఁగవకెంపు గలిగున్నది
వదలకిటు వేంకటేశ్వరుని కుంకుమపూఁత
చెదరి చెలికనుఁగొనలఁ జిందెనోయనఁగా

రేకు: 0022-5 ఆహిరి సం: 05-124

పల్లవి: కెరలి బయట దాఁగీ వీఁడు తన-
వొరపులు చూపుచు నొరగీ వీఁడు

చ. 1: కొమ్మ చూడవే కొలిమిగూటిలో-
నమ్మెడి సూదులె యదె వీఁడు
ఎమ్మెలు నెరపుచు నెక్కడఁ దిరిగో
నమ్మికబొంకుల నను సొలసీని

చ. 2: నాఁతిరో చూడవే నవ్వుచు మీలకు-
నీఁతలు గరపీనిదె వీఁడు
కాఁతాళంబునఁ గనలెడి నాపై
చేఁతలు సేసీఁ జెలఁగుచుఁ దాను

చ. 3: అల్లనె చూడవె అడవిమృగములకుఁ
బల్లము వేసీఁ బైవీఁడు
వొల్లని నునుని దె వుల్లమి చేకొనెఁ
గల్లరి తిరువేంకటపతి వీఁడు

రేకు: 0022-5 ఆహిరి సం: 05-125

పల్లవి: మూసిన ముత్యాన కేలే మొరఁగులు
ఆసల చిత్తానకేలే అలవోకలు

చ. 1: కందులేని మోము కేలే కస్తూరి
చిందు నీ కొప్పునకేలే సేమంతులు
మందయానమునకేలే మట్టెలమోఁత
గందమేలే పైపై కమ్మని నీ మేనికి

చ. 2: బారపు గుబ్బలకేలే పయ్యెద నీ-
బీరపుఁ జూపుల కేలే పెడమోము
జీరల బుజాలకేలే చెమటలు నీ-
గోరంట గోళ్ళకేలే కొనవాండ్లు

చ. 3: ముద్దుల మాఁటలకేలే ముదములు నీ-
యద్దపుఁ జెక్కులకేలే అరవిరి
వొద్దిక మాటల కేలే వూర్పులు నీకు-
నద్దమేలే తిరువేంకటాద్రీశుఁ గూడి

రేకు: 0023-1 శ్రీరాగం సం: 05-126

పల్లవి: కలకి కాఁతాళమలు కారింపులా
లలితంపు వలపులకు లంచములు గాక

చ. 1: కిసరు కనుఁగొనల జంకెనలు విరసంబులా
రసములొలికెడి మనోరతులు గాక
కొసరు గుంపెనల సిగ్గుల విళంబంబులా
దుసికిలని మోహముల దొంతరలు గాక

చ. 2: అబ్బురములైన పాలయలుక లోలంబులా
గబ్బుఁ దమకముల మీఁగడలు గాక
గబ్బిమాటలు సాళంగంబులవి యేతులా
గుబ్బతిలు మోహముల కుంటెనలు గాక

చ. 3: కొనబు కొనగోళ్ళ తాఁకులవి మే నొప్పులా
ననుపులకు నుబ్బుఁగవణములు గాక
వనితకీవేంకటేశ్వరు సిరులు మరపులా
మనసు మర్మముల తన్మయములవి గాక

రేకు: 0023-2 భైరవి సం: 05-127

పల్లవి: భామ నోఁచిన నోము ఫలము సఫలముగాను
కామతాపంబునకు కాండవము నోమె

చ. 1: కొమ్మ చలిమందులకు గొంతిదామెర నోమె
కమ్మఁదావులకు మును గౌరినోమె
నెమ్మదిని కన్నీట నిండుఁగొలఁకులు నోమె
ముమ్మడించిన వగల ముచ్చింత నోమె

చ. 2: చెదరు గందంబునకు చిట్టిబొట్లు నోమె
కదియు పులకలకు మొలకలనోము నోమె
ముదిత మాటాడకిదె మోనదాగెలు నోమె
పొదలు చెమటలకు నినుపులనోము నోమె

చ. 3: నెలఁత మొగమునకు వెన్నెలమించులటు నోమె
వెలయుఁగాంతికి వీధివెలుఁగు దా నోమె
ఎలమితోఁ దిరువేంకటేశుకౌఁగిటఁ గూడి
లలితాంగి నిచ్చకల్యాణంబు నోమె

రేకు: 0023-3 సామంతం సం: 05-128

పల్లవి: అపురూపమైన మోహము దాఁచి యిటువంటి-
కపటపు నటనలు గడియించనేలే

చ. 1: కిన్నెరకాయలఁ బోలు కిక్కిరిసినట్టి గుబ్బ-
చన్నులపై నునుఁగొంగు జారఁగ
కిన్నెర మీఁటుచు మంచి సన్నపు నడపుతో
కన్నులు దేలఁగమేను కదలించేవేలే

చ. 2: వీడియు వీడనికొప్పు వేగన ముడుచుచు
ఆడెడి బిత్తరిమాటలమరఁగా
చూడనొప్పె నీ మంచి సుద్దులు చెప్పఁగనెంతే
వాడక వాడుదురే వైతాళమేలే

చ. 3: చెక్కుటద్దములమీఁది చెమట చిత్తడితోడ
సొక్కులు దేరఁగ మేను సుదతికి
చిక్కించి నిన్నుఁగూడె శేషగిరీంద్రుఁడు నీ పయి
మక్కువగలిగి కొంత మనసియ్యఁడేలే

రేకు: 0023-4 పాడి సం: 05-129

పల్లవి: ఒఱపో మెఱుపో వొయ్యారమో నీకు
వెఱతుమయ్య గోవిందుఁడా

చ. 1: కపటమో నిజమో కరుణ కోపమో
వుపచారవమో వుపతాపమో
నిపుణత తనపై నెయ్యమే సేసేపు
విపరీతము గోవిందుఁడా

చ. 2: ననుపో నగవో నయమో ప్రియమో
చనవో చలమో సరసమో
కనుకూరిమియో గయ్యాళితనమొ
వెనుతగిలేవు గోవిందుఁడా

చ. 3: మంకో మరులో మదమో ముదమో
జంకో లంకో జగడమో
శంకలేక నను సరుగనఁ గూడితి
వేంకటగిరి గోవిందుఁడా

రేకు: 0023-5 ఆహిరి సం: 05-130

పల్లవి: లలితలావణ్య విలాసముతోడ
నెలంత ధన్యత గలిగె నేఁటితోడ

చ. 1: కుప్పలుగా మైనసలుకొన్న కస్తూరితోడ
తొప్పఁదోగేటి చెమటతోడ
అప్పుడటు శశిరేఖలైన చనుఁగనతోడ
దప్పిదేరేటి మోముఁదమ్మితోడ

చ. 2: కులుకుఁ గబరీభరము కుంతలంబులతోడ
తొలఁగఁ దోయని ప్రేమతోడ
మొలకనవ్వులు దొలఁకు ముద్దుఁజూపులతోడ
పులకలు పొడవైన పొలుపుతోడ

చ. 3: తిరువేంకటాచలాధిపుని మన్ననతోడ
సరిలేని దివ్యవాసనలతోడ
పరికించరాని అరవిరిభావముతోడ
సిరి దొలఁకెడి చిన్నిసిగ్గుతోడ

రేకు: 0023-6 సామంతం సం: 05-131

పల్లవి: చింతాపరంపరలు చిత్తంబునకుఁ దొడవు
ఇంతి సౌభాగ్యంబులిన్నిటికిఁ దొడవు

చ. 1: కలికి నెమ్మోమునకుఁ గబరీభరము తొడవు
తళుకుఁజూపులు చక్కఁదనమునకుఁ దొడవు
ఎలమిచెక్కుల మించులిరువంకలకుఁ దొడవు
మొలకనగవులు సొబగు మురిపెముల తొడవు

చ. 2: కరమూలరుచులు బంగారంబునకుఁ దొడవు
గురిగాని కొఁదీగె గుబ్బలకుఁ దొడవు
సిరిదొలఁకు జఘనంబు చిన్నినడపుల తొడవు
నిరతంపుఁ బాదములు నిలువునకుఁ దొడవు

చ. 3: శ్రీవేంకటేశుకృప చెలియ కెప్పుడుఁ దొడవు
భావసంగతులకునుఁ బరవశమె తొడవు
ఈ వెలఁది నునుఁబలుకులించువిలుతుని తొడవు
లావణ్యములకు నీలలన దాఁ దొడవు

రేకు: 0024-1 పాడి సం: 05-132

పల్లవి: అవి యెటువంటి రహస్యములో
సవరని సతులకు ఝల్లనె మేను

చ. 1: కల గని చెలితో కాంత నాయకుని-
చెలువము చెప్పుచు చిడిముడితో
పలుకఁగ నేరక భ్రమసిన మాటలు
తలఁచి చెలులు కడుఁ దత్తరపడిరి

చ. 2: రమణుఁడు కలలో రమణితో ననిన-
ప్రమదపు దైన్యపు పలుకులివి
చెమరించఁగ విని శిరసులు వంచుక
కొమెరలు దలఁచిరి కూరిమిపతుల

చ. 3: వేంకటరమణుఁడు వెలఁదియుఁ గలలో
బింకపుఁ గూటమిఁ బెనఁగుటలు
లంకెల పొందులు లలనలు విని విని
కొంకక కనుఁగొనఁ గురిసిరి నీరు

రేకు: 0024-2 సామంతం సం: 05-133

పల్లవి: కొనచూపులనె వింతకోరికలు దైవార
పెనగొన్న తమకములఁ బెనఁగు టెన్నఁడురా

చ. 1: కమ్మ కస్తూరితావి కప్పురపువాసనల-
తమ్ములము నోరిలోఁ దగఁ గులికి కులికి
ఉమ్మగింతల రతులనుడివోని వేడుకల
ఇమ్ములను గడి సుఖియించు టెన్నఁడురా

చ. 2: బిగువుఁ గౌఁగిటఁ జేర్చి బిత్తరపుఁ జూపులను
నగవు దేరఁగ మనసు నాఁటించి మించి
మొగము మొగమునఁజేర్చి ముద్దుమాటలను నునుఁ-
బగడవాతెర గదలఁ బలుకు టెన్నఁడురా

చ. 3: కడు మోహమున సిగ్గు గదియు టెన్నఁడు లేక
యెడలేని కూటముల యెచ్చరిక లేక
విడువకిటువలెనె తిరువేంకటేశుఁడ నీవు
వడిఁదలఁచి నాకడకు వచ్చుటెన్నఁడురా

రేకు: 0024-3 శ్రీరాగం సం: 05-134

పల్లవి: దైవకృత మెవ్వరికిఁ దప్పింపరాదనుచు
భావించి జనులాడుపలుకు నిజమాయ

చ. 1: కందునకుఁ బెడఁబాసి చందురుఁడింతి ముఖ-
చందురుఁడైన నది అందును గలిగె
కందువగు చెలినొసలి కస్తూరితిలకమను -
కందు ముఖచంద్రునకుఁ గడునందమాయ

చ. 2: జలజములు శశిచేతనులికి యీ కాంతకుచ-
జలజంబులైన నది సరుసనే కలిగె
లలితమగు ప్రాణవల్లభుని సురతాంకమున
విలువ సేయఁగరాని విదియచందురులు

చ. 3: తీగె బహుజలములకుఁ దెమలి కామిని మేనుఁ-
దీగె యయ్యిన నదియుఁ దిరుగ మరి కలిగె
ఈ గతులఁ దిరువేంకటేశ్వరుని సమసురత-
యోగంబువలన ఘర్మోదకశ్రీలు

రేకు: 0024-4 ముఖారి సం: 05-135

పల్లవి: జానామ్యహంతే సరసలీలాం
నానావిధ కపటనాటక సఖత్వమ్

చ. 1: కిం కరోమి త్వాం కితవ పరకాంతాన-
ఖాంకురప్రకటన మతీవ కురుషే
శంకాం విసృజ్య మమసంవ్యాన కర్షణం
కింకారణమిదం తే ఖేలన మిదానీం

చ. 2: కిం భాషయసి మాం కృతమానసతయా
డాంభికతయా విట విడంబయసి కిం
గాంభీర్యమావహసి కాతరత్వేన తవ
సంభోగ చాతుర్య సాదరతయా కిం

చ. 3: కిమితి మామనునయసి కృపణ వేంకటశైల-
రమణ భవదభిమతసురతమనుభవ
ప్రమదేన మత్ప్రియం ప్రచురయసి మానహర
మమతయా మదననిర్మాతా నకిం త్వం

రేకు: 0024-5 ఆహిరి సం: 05-136

పల్లవి: వట్టిటసలు గాక నాకు వలతు ననెడి మాటలెల్ల
నెట్టుకొన్న మోహమైన నిలువనెట్టు వచ్చురా

చ. 1: కొప్పువెట్టుకొనుచునున్నకొమ్మబాహుమూలమిపుడు
చొప్పదప్ప రెప్పలెత్తి చూడనెట్టు వచ్చురా
అప్పుడుపరిసురతవేళలందుఁ ఇచ్చి దోఁచునట్టి-
చెప్పరాని పనులవంకఁ జిత్తగించినాఁడవో

చ. 2: మొలకనవ్వు నవ్వుచున్న ముదితముద్దు మోవిమీఁది-
చిలుకవోటు చూచి సన్న నేయనెట్లు వచ్చురా
వలను మెరసి నీకునందు వన్నెలైన చేఁతలెల్లఁ
గలయఁ జేయుపనికిఁ గొంత కన్నువేసినాఁడవో

చ. 3: తట్టుపుణుఁగు శిరసుమీఁద దైలువారనంటి నొసలఁ
బట్టువెట్టుకోరి నన్నుఁ బట్టనెట్టు వచ్చురా
వెట్టిగాదు వేంకటాద్రివిభుఁడ నీవు మదనరచన-
లట్టు నిట్టుసేయ నన్నుంగవించినాఁడవో

రేకు: 0024-6 మాళవి సం: 05-137

పల్లవి: ఏమిసేయఁగనగు నెట్టువలసిననౌ
కాముకుల పూర్వసంకల్పమో కాక

చ. 1: కమలోచనహృదయకమలంబె మరుచేతి-
కమలమై తనమనసు గాఁడి పారినది
గములైన యాపదలు గదిరినప్పుడు దమ్ము
తమచేతియమ్ములే తాఁకునో కాక

చ. 2: లోలలోచన మేనిలోని యనలము లోని-
గాలి గూడక చిచ్చు గాలివలెనాయ
తాలిమెడతెగి రతులు దప్పినప్పుడు లోని-
తాలిమే తమకములతాపలో కాక

చ. 3: శ్రీ వేంకటేశ్వరుఁడు చెలియఁ గరుణించినను
కైవశంబయిఁ యవియ కడునితవులాయ
దైవకృప గలిగినను తమకు నాపదలెల్ల
భావింప నిత్యవైభములో కాక

రేకు: 0025-1 సామంతం సం: 05-138

పల్లవి: పొద్దికనెన్నఁడు వొడచునొ పోయినచెలి రాదాయను
నిదుర గంటికిఁ దోఁపదు నిమిషంబొకయేఁడు

చ. 1: కన్నుల నవ్వెడి నవ్వులు గబ్బితనంబుల మాటలు
నున్నని యొయ్యారంబులు నొచ్చినచూపులును
విన్నఁదనంబుల మఱపులు వేడుకమీరిన యలపులు
సన్నపుఁజెమటలుఁ దలఁచిన ఝుల్లనె నామనసు

చ. 2: ఆఁగినరెప్పల నీరును నగ్గలమగు పన్నీటను
దొంగియుఁ దోఁగనిభావము దోఁచిన పయ్యెదయు
కాఁగిన దేహపు సెకలును కప్పిన పువ్వుల సొరబులు
వేఁగిన చెలితాపమునకు వెన్నెల మండెడివి

చ. 3: దేవశిఖామణి తిరుమలదేవునిఁ దలఁచినఁ బాయక
భావించిన యీ కామిని భావములోపలను
ఆవిభుఁడే తానుండిఁక నాతఁడె తానెఱఁగఁగవలె
నీ వెలఁదికిఁ గల విరహంబేమని చెప్పుదము

రేకు: 0025-2 మలహరి సం: 05-139

పల్లవి: ఎందరి దూరుదమిందరుఁ గూడుక
సందడివలుపులఁ జంపేరే

చ. 1: కంటఁ బుట్టినవాఁడు కమలముఖులకడ-
కంటఁ బుట్టినవాఁడు గవగూడి
జంట వాసినఁ జంపుదుమని లేని-
వెంటలు గడియించి వేఁచేరే

చ. 2: ఏఁటఁ బుట్టెడివాఁడు నేడు దెరువులై
వూఁటాడెడివాఁడు నొనగూడి
మాఁటమాఁటాకు మాయపు మనసులు
తీఁటలు రేఁచుక తిరిగేరే

చ. 3: కొండలరాయఁడు కోనేటి తిమ్మయ్య
వుండినచోట నేనుండఁగా
పండిన మోహము బాధలఁ జిత్తము
మెండైన వేడుక మెచ్చినే

రేకు: 0025-3 నాట సం: 05-140

పల్లవి: చిత్తము నిజమైనఁ జేరు నేపనులైన
బత్తి సౌఖ్యమునకుఁ బ్రాణము

చ. 1: కన్నుల కలికికిఁ గలిగెఁబో కడ-
కన్నులమీఁది బింకపు నవ్వు
చిన్నిచెక్కులమీఁది చెమటలు -మేన-
నన్నువ మురిపెపుటలపులు

చ. 2: తోయజగంధికి దొరకెఁబో మన -
మాయ నియతితోడి మఱపులు
సోయగమగు మోము సొబగులు- కడు-
రాయిడి చనుదోయి రచనలు

చ. 3: లావణ్యమతి మీఁద లాసెఁబో
శ్రీ వేంకటేశుని చెలుములు
తావి చల్లెడి కమ్మఁదనములు - పాసి-
పోవని విభుతోడి పొందులు

రేకు: 0025-4 కాంబోది సం: 05-141

పల్లవి: ఒయ్యనె దగ్గరరమ్మ పూడిగాల సతులు
అయ్యో విసరరమ్మ అలశున్నవాఁడు

చ. 1: కరఁగు-జెమటలతో గందపుఁ బేంట్లతోడ
ఒరగి పవ్వళించున్నాఁడొ త్తగిల్లి
సరసపు మాటలతో చాఁచిన పాదములతో
గురియైన సతులతో గోవిందరాజు

చ. 2: తెల్లని కన్నులతోడ తేనెగారు మోవితోడ
చెల్లుబడిఁ బవ్వళించీ శేషునిమీఁద
వెల్లిగొను పూర్పులతో వెన్నెల నవ్వులతోడ
కొల్లవలపులతోడ గోవిందరాజు

చ. 3: బొడ్డు పూఁపకొడుకుతో పుక్కిటి తమ్ములముతో -
నొడ్డిన రతులతోడ నోలలాడీని
వెడ్డు వెట్టి కూడెనిదె వేంకటేశుఁడింతులను
గొడ్డువోని వరముల గోవిందరాజు

రేకు: 0025-5 ఆహిరి సం: 05-142

పల్లవి: కామించి నీవరుగఁ గలయు నాయకుఁడు నేఁ-
డేమి భాగ్యము సేసెనే తరుణి

చ. 1: కాఁగిన గుబ్బలమీఁద కమ్మఁజెమటలఁ దొప్పఁ-
దోఁగిన పయ్యెదకొంగు దూలఁగను
వేఁగైన కొప్పున క్రొవ్విరులు దురిమి విట్టి-
వీఁగుచు నీవెటు వొయ్యేవే తరుణిం

చ. 2: ఒప్పైన శిరసుమీఁదఁ గుప్పళించిన జవ్వాది
చిప్పిలి చెక్కులవెంటఁ జిందఁగను
అప్పళించిన కస్తూరిలప్పలు రాలఁగ నీ-
విప్పుడెక్కడికి నేఁగేవే వోతరుణి

చ. 3: వీడినది మొలనూలు విరులు చెదరెఁ గొంత
వాడినది కెమ్మోని వన్నెలై
యీడులేని తిరువేంకటేశుఁడిదె నిన్నుఁ గూడె
యీడఁ గొత్తలివి యేఁటివే వోతరుణి

రేకు: 0025-6 శుద్ధవసంతం సం: 05-143

పల్లవి: ఇన్ని రాసులయునికి యింతి చెలువపురాశి
కన్నె నీరాశికూటమి గలిగినరాశి

చ. 1: కలికి బొమవిండ్లుగల కాంతకును ధనురాశి
మెలయు మీనాక్షికిని మీనరాశి
కులుకు కుచకుంభముల కొమ్మకును కుంభరాశి
చెలఁగు హరిమధ్యకును సింహరాశి

చ. 2: చిన్నిమకరాంకపు బయ్యెద చేడెకు మకరరాశి
కన్నెపాయపు సతికి కన్నెరాశి
వన్నెమై పైఁడితులఁదూఁగు వనితకుఁ దులారాశి
తిన్ననివాఁడి గోళ్ళసతికి వృశ్చికరాశి

చ. 3: ఆముకొను నొరపుల మెరయు నతివకు వృషభరాశి
గామిడి గుట్టుమాఁటల సతి కర్కాటకరాశి
కోమలపు చిగురువమోవి కోమలికి మేషరాశి
ప్రేమ వేంకటపతిఁ గలసె ప్రియమిథునరాశి

రేకు: 0026-1 సామంతం సం: 05-144

పల్లవి: ఎట్టు ధరింపఁగనగు భువినిట్టి వియోగావలస్థల-
నట్టును నిట్టును విధి దమునారడిఁ బెట్టఁగను

చ. 1: కాంతునిచూపులఁ జిక్కినకాంత వియోగాగ్నికిఁ దగ
శాంతికిఁ జెంగలువలుపైఁ జల్లిరి నెచ్చెలులు
కాంతుఁడు చూచినతొల్లిటి కనుచూపులె బహుళములై
కాంతశరీరంబంతయుఁ గప్పిన తెఱఁగాయ

చ. 2: రమణునిమాటలఁ దగిలిన రమణికి నంగజతాపం-
బమరఁగ మకరందముపై నలికిరి నెచ్చెలులు
రమణుని తియ్యని మాటాలరచనలె కడునగ్గలమై
కమలదళాక్షికిఁ బై పై గట్టినతెఱఁగాయ

చ. 3: ప్రాణము సందియమై యీ పడతికిఁ బ్రాణము వచ్చెను
ప్రాణేశుఁడు తిరువేంకటపతి గరుణించినను
ఏణాక్షికి నొకతెకుఁ గాదీయఖిలంబున కీ దేవుఁడు
ప్రాణము ప్రాణంబనియెడి పలుకిది నిజమాయ

రేకు: 0026-2 కాంభోది సం: 05-145

పల్లవి: ఇంతగాఁ జేసితి నన్ను నింతలోననె వోరి
సంతవలపుబేరాల జట్టికాఁడ రారా

చ. 1: గంపంత దురుముతోడి గబ్బిచూపుఁగన్నుల
గుంపెన గుబ్బలది మేకులు సేయఁగా
అంపలేక మాటలాడే వాపె తోడనె వోరి
జంపు వలపుబేరాల జట్టికాఁడ రారా

చ. 2: గుద్దలింపుఁ గులుకుల కొనవంపుచూపుల -
అద్దపుఁ జెక్కులది నిన్నద్దలించఁగా
పెద్దరికా లాకెతోడ బెరయించేవా వోరి
చద్దివలపుబేరాల జట్టికాఁడ రారా

చ. 3: మెల్లనె మురిపములమ్మెడి లేఁతమాటల-
గొల్లెతచిత్తమంతయుఁ గొల్లగొంటివి
వెల్లిగా నన్నుఁ గూడితి వేంకటేశుఁడా వోరి
చద్దివలపుబేరాల జట్టికాఁడ రారా

రేకు: 0026-3 సామంతం సం: 05-146

పల్లవి: సింగారరాయనిఁ దిట్టిఁ జెంచెత వేలి-
వుంగరాలచేత నన్నొత్తకు నీవనుచు

చ. 1: గురువింద పాదమరఁగున నుండి బిగిసీని
సిరివరు నెదుటనే చెంచెత
దొరలకే కాక నెత్తురుమన్ను మాకేల
బురదచెమటనామై పొలకంపనుచు

చ. 2: గుదిగొన్న మొగలిరేకుల యెన్ను కొనగోరఁ
జిదిమి దేవునివేసీఁ జెంచెత
గదరుఁ బిల్లుల నేతికంపు నీ వొళ్ళెల్ల
కదియకు నా మేను కంటగించీననుచు

చ. 3: కప్పురపుఁ దావి వేంకటపతికౌఁగిటఁ
జెప్పక యేతులే చెప్పీఁ జెంచెత
దప్పిదేరు తేనెల తనివార నీమోవి
యెప్పుడుఁ బాయక ఇట్టె ఇచ్చేవో యనుచు

రేకు: 0026-4 ఆహిరి సం: 05-147

పల్లవి: అయ్యో వీఁడు నన్నుణఁకించీనే వీని-
కొయ్యతనాలణఁచక కోపమేల తీరునే

చ. 1: గుట్టున వాఁడిందు రాఁగ గొబ్బన నే ముంగురులు
పట్టుకొని పరపుపైఁ బడఁదీసి
గట్టిగ గుబ్బలమీఁది కస్తూరిచెమటలనే
అట్టునిట్టు సేయక నాయల పేల తీరునే

చ. 2: గక్కున వాఁడిందు రాఁగా గడెవెట్టి తమకాన
చెక్కుదోయి నాకొనచేతనే నొక్కి
పుక్కిటితమ్ములమిడిపొదిగొన్న కౌఁగిటిలో
నొక్కినఁగాని నానొగులేల తీరునే

చ. 3: కూరిమి వాఁడిందు రాఁగా కొంకక నా వాఁడిగోళ్ళ
జీరలుగా నొడలెల్ల జిమ్ముచుఁ దీసి
ధీరత వేంకటగిరి దేవుఁడైన వానికి నా-
నేరుపెల్లఁ జూపక నా నెగులేల తీరునే

రేకు: 0026-5 దేవగాంధారి సం: 05-148

పల్లవి: ఇట్టిముద్దులాఁడిబాలుఁ డేడవాఁడు వానిఁ
బట్టితెచ్చి పొట్ట నిండఁ బాలు పోయరే

చ. 1: గామిడై పారితెంచి కాఁగేటివెన్నలలోన
చేమపూవుకడియాలచేయి వెట్టి
చీమ గుట్టెనని తనచెక్కిటఁ గన్నీరు జార
వేమరు వాపోయె వాని వెడ్డువెట్టరే

చ. 2: ముచ్చువలె వచ్చి తనముంగై మురువులచేయి
తచ్చేటిపరుగులోనఁ దగఁ బెట్టి
నొచ్చెనని చేయి దీసి నోరనెల్లఁ జొల్లుగార
వొచ్చెలి వాపోవునాని నూరడించరే

చ. 3: యెప్పుడు వచ్చెనో మాయిల్లు చొచ్చి పెట్టెలోన
చెప్పరానివుంగరాల చేయి వెట్టీ
అప్పడైనవేంకటేశుఁడాపాలకుఁడు గాన
తప్పకుండ పెట్టె వానితల కెత్తరే

రేకు:	0026-6 శ్రీరాగం సం:	05-149

పల్లవి:	వద్దు వోరా నీవు గడు వచ్చి తడవాయనేరు
నిద్దురవుచ్చేవు నేము నీ కొలఁదివారమా

చ. 1:	గయ్యాళి యెవ్వతో కాని కస్తూరివాట్లు చూడ
నొయ్యారముగా వేసె నుదుటైన గుబ్బల
కయ్యపుఁ గూటముల నీ కౌఁగిలెల్లానంటె నీవు
పుయ్యక పూసిన కమ్మఁబూత వింతలాయరా

చ. 2:	గొంటెత యెవ్వతోకాని కొదలేని తమకి తా-
నంటఁగాక నిన్నుఁగూడె నదిరి పాటునను
వెంటనే తెచ్చితివోరి వెడగెంపునీరు కోక-
నంటినది నీవు మమ్ము నంటక తొలఁగరా

చ. 3:	కొండలలో నెలకొన్న కోనేటిరాయఁడ యెందు
వుండిన నామనలోనుండి పాయలేవురా
నిండిన కౌఁగిటఁజేర్చ నీవు దానై కూడి-
యుండినట్లనే పాయకుండె నెవ్వతెరా

రేకు: 0027-1 రామక్రియ సం: 05-150

పల్లవి: కొంచెము మాకులము గుణము చంచలము
చెంచతతో నీకు నేల చెప్పవయ్యా చలము

చ. 1: గదరుఁ గస్తూరిమన్ను కమ్మనిమై పూఁత
చెదరిని పట్టునార చీరపాఁత
పదిలమైన పండు ఫలము మామేఁత
ఇదివో నే మెవ్వరికి నేలయ్యా రోఁత

చ. 2: గుబ్బలపై వెడజారు గురుగింజ పేరు
సిబ్బపుఁ జెక్కుల నవ్వుచిక్కుఁ జీరు
మబ్బు మబ్బు నెరుల దిమ్మరి కొప్పుతీరు
గబ్బిచూపు కన్నుల మాకడనేల నోరు

చ. 3: అడవి లేఁతచిగురదివో మాపరపు
వెడ వెడ నగనే మావింత వొరపు
యెడయక తిరువేంకటేశ మాపై వెరపు
గొడవకూటమి నిన్నుఁ గూడిన మైమరపు

రేకు: 0027-2 వరాళి-ఏకతాళి సం: 05-151

పల్లవి: తక్కులచేఁతల మాయదారివట బొంకు-
నిక్కములు నేయనేమి నేరవా యీనీవు

చ. 1: గుట్టున నూఁదిన పిల్లఁగోవి నీ రవమున
వట్టిమాఁకుల నిగురు వెట్టీనట
పట్టినఁ గందెడి నామై పై పులకలిగురు -
వెట్టఁగా నన్నింత సేయ బెట్ట యీ నీకు

చ. 2: పాదముచెమటనీరు పరపి దురితముల
సేదదేర నిందరిని జేసీనట
మేదినీధరుఁడ నీ మేని చెమటలతావి-
నాదరించి ననుఁగాచుటరుదా యీ నీకు

చ. 3: అల నీమదిఁబుట్టిన అంగజుఁడు లోకులను
చెలరేఁగి కాఁపురాలు సేయించీనట
కలసి వేంకటేశ్వర కందువరతుల నన్ను
కలకాలమునేలుట ఘనమా యీ నీకు

రేకు: 0027-3 సౌరాష్ట్రగుజ్జరి సం: 05-152

పల్లవి: కన్నునే నవ్వితే నే గబ్బిదాననా నీవు
నన్నునేల యిట్లా సన్నలనే తిట్టేవు

చ. 1: గొల్లచల్లంటానే యక్కునఁ బోయుమనేవు
చెల్లఁబో గొల్లవారింత చెడఁబోయిరా
గొల్లువేసి యలకల కొప్పున నే ముడిచిన
మల్లెపూవులేల నీకు మనసాయ నిపుడు

చ. 2: కొంత కోక నల్ల నైతే గొరుపడము సవేవు
అంత నేను సదరమనైతినా నీకు
పంతగాఁడవట్టియాకంబళి నీవు ధరియించి
అంత నింతనుండి యాల ఆవులఁగాచితివి

చ. 3: మాఁటలాడ నేరకుంటే మాయదారిననేవు
వేఁటలోన ననునింత వేఁచుమంటినా
యేఁటికింత తిరువేంకటేశ నన్నుఁ గరఁగించి
పూఁట పూఁటకింతేసి బూమెలు సేసేవు

రేకు: 0027-4 శ్రీరాగం సం: 05-153

పల్లవి: అతఁడు చొచ్చినవేళ నలరు యడవి
సతి నీదుమురిపెంపు జవ్వనపుటడవి

చ. 1: గురుకుచముగిరుల నెక్కువయైన యడవి
తరుణంపు బాహులతల యడవి
పురిగొన్న వాలుఁజూపుల తేట యడవి
గరిమతోఁ దనుతావి కప్పురపుటడవి

చ. 2: గనియైన నెరులచీఁకటి పెనుయడవి
ఘనమైన జఘనకందకములడవి
నునుపు నడపుల యేనుక పెద్దయడవి
చెనకు నట్టనడిమి సింహపుటడవి

చ. 3: అతివ నీ వూరుల యరంట్లయడవి
కత కఱపుల చిలుకల యడవి
ప్రతిలేని వేంకటపతి యాఁక యడవి
తతి నీకుఁ గానతఁడు తపమున్న యడవి

రేకు: 0027-5 శంకరాభరణం సం: 05-154

పల్లవి: తలపట్టు వెట్టుకొన్న తరుణీమణి నిన్ను
నలసి వేమరుదూరు నాకెవో యీకె

చ. 1: గొప్పలయిన గుబ్బలవేఁగుల నలయు సతులు
కొప్పులు జారఁగఁ దన్నుఁ గొలిచి రాఁగా
చెప్పరాని నటనల సింగారపుఁ దోఁటలోన
అప్పుడు నిన్నుఁ జూచిన ఆకెవో యీకె

చ. 2: పాదపుఁబెండేలు మ్రోయఁ బడఁతులిరువంకల
సేదలు దేరుచుఁ దనచెంగట రాఁగా
మేదకపు తొలుకరి మెఱుఁగంటా నీ పప్పు-
డాదిగొని చూచిన ఆకెవో యీకె

చ. 3: బంగారు చెరఁగుచీర పయ్యెదకొంగు దూలఁగా
అంగన వొకతె దనకాకు చుట్టీఁగా
ఇంగితమెఱిఁగి వేంకటేశుఁడ నిన్నుఁ గలసి
అంగడినెల్లఁ బెట్టిన ఆకెవో యీకె

రేకు: 0027-6 ఆహిరి సం: 05-155

పల్లవి: దిక్కులేక పోయెనిట్టే దినదినము
వెక్కసపు లోకమేలే విభుఁడెవ్వఁడో

చ. 1: గుత్తముగా నెల్లవారుఁ గుడిచేటి కంచము
ఎత్తుక లోఁబెట్టుకొనె నెవ్వఁడో దొంగ
కొత్తగానే యింతి గట్టేకోక బయట వేసిన
మెత్తనిదంటాఁ బట్టి మింగె నెవ్వఁడో

చ. 2: బంతిగాఁగ నెల్లవారుఁ బండేటి మంచమూర -
గుంతలో విరుగఁదోసి కూళఁడెవ్వఁడో
దొంతుల కడవలోనఁ దొరలి దాఁచిన పెద్ద-
పొంతకూటికుండ గొంటఁబోయె నెవ్వఁడో

చ. 3: సొరిది సంతలలోని సుద్దులెల్లా విని విని
విరసములెల్లఁ బాపె వీఁడెవ్వఁడో
తిరువేంకటగిరిదేవుఁడై యిందరికిఁ
గరుణ లోకముగాచె ఘనుఁడెవ్వఁడో

రేకు: 0028-1 ముఖారి సం: 05-156

పల్లవి: చిన్ననాఁడు మద్దులు వంచినవాఁడు తా-
నున్నవాఁడే యిపుడు నాయెడయఁడై నేఁడు

చ. 1: గోవులఁ గాచినవాఁడు గొల్లెతల మేనిగబ్బుఁ -
దావుల పెనుభ్రమలఁ దగులువాఁడు
కోవిదుఁడెట్లనాయఁ గోమలులఁ బదియారు-
వేవురను వలపించే వెరవరెట్టాయెనే

చ. 2: వెన్నలారగించువాఁడు విడువక వెకలియై
కన్నచోనే తిరిగేటి గద్దరీఁడు
వన్నెకాఁడెట్లానాయ వడి గోపవనితల -
నెన్నరాని చేఁతలెల్ల నెట్టు సేసినాఁడే

చ. 3: కొండలెక్కి దాఁటువాఁడు కొండ మోచునట్టివాఁడు
కొండలే నెలవుగాఁ గైకొన్నవాఁడు
కొండుక పాయపువాఁడు గుబురైన తిరుమల-
కొండమీఁద నెలకొన్న కోనేటివాఁడు

రేకు: 0028-2 ముఖారి సం: 05-157

పల్లవి: కలికి కోరికల నుంగరము వెట్టిననాఁడె
చెలువంపు విరహగ్ని సేసెఁగా పెండ్లి

చ. 1: గరిమెఁ గేయూరకంకణహస్తముల సతులు
మురియుచును నిన్నుఁ గరములఁ జూపఁగా
తరుణి నినుఁ జూచినంతటనె మదనుఁడిద్దరికి-
నరవిరుల సేసలిడె నాయెఁగా పెండ్లి

చ. 2: పొదరిండ్ల చవికెలో పువ్వుఁదేనెల చెమట
చెదరకిరువంక నభిషేకములుగా
కొదమ తేంట్ల విప్రకోటి మిమ్మిద్దరిని
పొదలించఁ జిత్తములు పొసగెఁగా పెండ్లి

చ. 3: సోలుచును పేరఁటపు శుకపికంబులు మిమ్ముఁ
బాలుపడి నలుగడలఁ బాడఁగాను
తేలించి లలితాంగి తిరువేంకటేశ నినుఁ
గాలు దొక్కినదిపుడె కలిగెఁగా పెండ్లి

రేకు: 0028-3 కన్నడగౌళ సం: 05-158

పల్లవి: వంచన ప్రియములవారే కాక
నించిన కన్నీటి నేనేల నీకు

చ. 1: గిలుకు మట్టెలతోడ కిందిచూపులతోడ
సెలవి నవ్వులు నీ పైఁ జిందఁగాను
వలతువుగాక యెవ్వతి కైనఁ జిత్తము
నిలుపఁగనోపని నేనేల నీకు

చ. 2: గోడచాట్లతోడ కొనచీఁకటితోడ
వాడల నెలయించువారేకాక
వాడుచు లేమావి వడచల్ల వెడమాయ-
నీడలనెండే నేనేల నీకు

చ. 3: జగడంబులతోడ సణఁగు సొలపుతోడ
వగ నిన్ను భ్రమయించువారె కాక
దిగులులేక నిన్ను తిరువేంకటేశుఁడ
నెగులెఱుఁగక కూడు నేనేల నీకు

రేకు: 0028-4 ఆహిరి సం: 05-159

పల్లవి: వేడుక నెవ్వతెరా విడుపక నిన్నుంటి
వాడుదేరే వలపుల వన్నెలు వెట్టనది

చ. 1: గద్దరి యెవ్వతెరా నీ గారవంపు చెక్కున
నిద్దంపు చంద్రరేఖ నిలిపినది
అద్దిరా దానిగయ్యాళితనమెట్టిదో
ముద్దుఁదనమోహము నీ మోహమున రాచినది

చ. 2: దిట్టెన యది యెవ్వతెర నీ యధరమందు
కొట్టఁగొన మరుచిలుకులొత్తినది
గట్టిగఁ జూడర దానిగబ్బితనమెట్టిదో తన-
గుట్టెల్ల నీకు నాకున వ్రాసెంపినది

చ. 3: చక్కనిదెవ్వతెర నీ సరిలేని మేనఁ దన-
మిక్కుటంపు మేనితావి మేళవించినది
అక్కరగాఁ దిరువేంకటాధీశ కూడితివి
మక్కువతో నీకు పరిమళములంపినది

రేకు: 0028-5 పాడి సం: 05-160

పల్లవి: అలమేలుమంగ నీవభినవరూపము
జలజాక్షుకన్నులకు చవులిచ్చేనమ్మా

చ. 1: గరుడాచలాధీశు ఘన వక్షమున నుండి
పరమానందం సంభరితవై
నెరతనములు చూపి నిరంతరము నాథుని
హరుషించఁగఁ జేసితి గదమ్మా

చ. 2: శశికిరణములకు చలువల చూపులు
విశదముగా మీఁద వెదచల్లుచు
రసికత పెంపునఁ గరఁగించి యెప్పుడు నీ-
వశము చేసుకొంటి వల్లభునోయమ్మా

చ. 3: రట్టడి శ్రీ వేంకటరాయనికి నీవు
పట్టపురాణివై పరఁగుచు
వట్టిమాఁకులిగిరించు వలపుమాటల విభు
జట్టిగొని పురమున సతమైతివమ్మా

రేకు: 0028-6 దేశాక్షి సం: 05-161

పల్లవి: ఒడయఁడవు నినుఁబాసి యుండవశమా తరుణి
చిడుముడియలుక చేతిచిలుకఁ బగచేసె

చ. 1: గారవపు జలరాశికన్య నీతోనలిగి
ఆరామములలోన నలయఁగాను
వైరంపుబాణమ్మై వనజమిరుమ్మై గాఁడె
ఈ రీతి నీ యలుక యిల్లు పగఁజేసె

చ. 2: ఎలజవ్వనిటు నీకు నెదురుచూచుచు వెడలి
చెలఁగి వెన్నెలకు విచ్చేయఁగాను
నలువొందఁ జంద్రకిరణములు మయివడిఁ బొక్కె
బులుపుఁ గోపము తోడఁబుట్టుఁ బగచేసె

చ. 3: పంతంపు శ్రీసతికిఁ బతివి వేంకటరమణ
కాంతహృదయంబెఱిఁగి కలయఁగాను
అంతలోననె మదనుఁడలయించె నిప్పుడిటు
కొంతవడి నీకసరు కొడుకుఁ బగచేసె

రేకు: 0029-1 సామంతం సం: 05-162

పల్లవి: ఎన్ని సేఁతలై నఁ జేయునిపుడు యీతఁడు
కన్నెవయసువారినెల్ల గాఁకదేర్చె నీతఁడు

చ. 1: గుబ్బచన్నుదోయి మెఱుఁగుఁ గులుకరించి చెలఁగి నడచు
గబ్బుతావిరమణి చల్లకడవతోడను
సిబ్బమైన చెక్కులందు చిన్నిచెమటగారఁ జెనకి
గబ్బిసేఁతలెల్లఁ జేసె కళలుగరఁగ నీతఁడు

చ. 2: వాలుఁగన్నుదోయి మెఱుఁగు వల్లెవేసివేసి రతికి
కాలుదవ్వురమణి చల్లకడవతోడను
కేలుదమ్మి కంకణాలు గిలుకరించి చెలఁగి నడచు
కీలుగొప్పు సడిలి జారఁ గిందుపరిచె నీతఁడు

చ. 3: కొదలుదేరు కోవిలెలుఁగు కుత్తికందు సాళగించి
కదలుమోవిరమణి చల్లకడవతోడను
ఎదురమెరయు వేంకటేశుఁడింతి ప్రేమదీరఁ జెనకి
కదిసి మదనకదనమందు కలికిఁజేసె నీతఁడు

రేకు: 0029-2 పాడి సం: 05-163

పల్లవి: ఏలేయేలే మరఁదలా చాలుఁజాలు చాలును
చాలు నీతోడి సరసంబు బావ

చ. 1: గాఁటపు గుబ్బలు గదలఁగఁ గులికేవు
మాటలఁ దేటల మరఁదలా
చీటికి మాటికిఁ జెనకేవే వట్టి-
బూటకాలు మాని పోవే బావ

చ. 2: అందిందె నన్ను నదలించి వేసేవు
మందమేలపు మరఁదలా
సందుకోఁ దిరిగేవు సటకారి వోబావ
పొందు గాదిఁకఁ బోవే బావ

చ. 3: చొక్కపు గిలిగింత చూపుల నన్ను
మక్కువ నేసిన మరఁదలా
గక్కున నను వేంకటపతి కూడితి
దక్కించుకొంటివి తగులైతి బావ

రేకు: 0029-3 ఆహిరి సం: 05-164

పల్లవి: కామిని నీ సౌభాగ్యము గలిగిన ఫలమిది గలిగెను
ఆమని వెన్నెలకేఁటికి నలయుచు వచ్చెదవే

చ. 1: గుబ్బల చెమటల పయ్యెద కొనగొంగున నల్లార్చుచు
ఉబ్బున గమనావస్థల నూఁటాడెదవేలే
బబ్బిలికాయల రవములు పదనూపురములఁ గెలయఁగ
తబ్బిబ్బుగ నునుపాదము తాటించెదవేలే

చ. 2: ఎత్తిన కరమూలపురుచులిరుగడ మెఱుఁగులు దొలఁకఁగ
తత్తరమందుచు నెవ్వనిఁ దలఁపుచు మ్రొక్కెదవు
ముత్తెపుసరముల వేఁగున మరియుచు నెచ్చరివై నీ-
వొత్తిలి నిట్టూర్పులతో నొయ్యన పలికెదవే

చ. 3: తావులు చల్లెటి దేహము తలఁపులుమీరిన హరుషము
లోవెలుతుల వెడయాసలు లోపలి కోరికలు
శ్రీవేంకటగిరినాథుని చెలువపు కౌఁగిటి వుయ్యాల
భావజసౌఖ్యాంబుధిలో పలుమరుఁ జెలఁగెదవే

రేకు: 0029-4 కాంబోది సం: 05-165

పల్లవి: చెలికిఁ జక్కఁదనము నేసిన యజుఁడు భూమిఁ
గలవారికెల్లఁ బ్రేమ గలిగించెఁ గదవే

చ. 1: గుబ్బలపై కొనగోరి గురుతు లంటినచోటు-
లబ్బురమై మృగమందమంటినది చూడవే
గబ్బికన్నుల కలికి కప్పిన పయ్యదలోన
నిబ్బరపుఁ దనువల్లి నిగ్గులు వెళ్ళఁబారెనే

చ. 2: కొప్పునఁ దట్టుపుణుఁగు కొలఁదిమీరఁగ నంటిన-
జిప్పిలి చెక్కులవెంటఁ జిందినది చూడవే
ఒప్పయిన నీ నడపున నొడికపుమట్టియల-
చప్పుడు విన్నఁ జిత్తము జల్లురనెఁ గదవే

చ. 3: చక్కఁదనములచేత సరిలేనివాఁడు గన
దిక్కుల వెలసినట్టి తిరువేంకటేశుఁడు
మక్కువలరఁగ నింతి మరగించి ప్రియమెల్లఁ
జక్కఁదనముగఁ జేసెఁ జాలదా యింతయును

రేకు: 0029-5 రీతిగౌళ సం: 05-166

పల్లవి: రాధామాదవరతిచరితమితి బోధావహం శ్రుతిభూషణం

చ. 1: గహనే ద్వావపి గత్వా గత్వా రహసి రతిం ప్రేరయతి సతి
విహరతస్తదా విలసంతౌ విహతగృహశౌ వివశౌ తౌ

చ. 2: లజ్జాశబళ విలాసలీలయా కజ్జలనయన వికారేణ
హృజ్జావ్యవహృత హృదయా రతి స్సజ్జా సంభ్రమచపలా జాతా

చ. 3: పురతో యాతం పురుషం వకుళైః కురంటకైర్వా కుటజైర్వా
పరమం ప్రహరతి పశ్చాల్లగ్నా గిరం వినాపి వికిరతి ముదం

చ. 4: హరి సురభూరుహ మర్ధతివస్స్వ చరణేన కటిం సంవేష్ట్య
పరిరంభణ సంపాదితపులకై- స్సురుచిర్జాతా సుమలతికేవ

చ. 5: విధుముఖదర్శన విగళితలజ్జా త్వధరబింబఫలమాస్వాద్య
మధురోపాయనమార్గేణ కుచౌ నిధివద త్వా నిత్యసుఖమితా

చ. 6: సురుచిరకేతక సమదళ నఖరైర్వరచిబుకం సా పరివృత్య
తరుణిమసింధౌ తదీయదృగ్జల- చరయుగళం సంసక్తం చకార

చ. 7: వచన విలాసైర్వశీకృత తం నిచులకుంజ మానితదేశే
ప్రచురసైకతే పల్లవశయనే రచితరతికళా రాగేణాస

చ. 8: అభినవకల్యాణాంచితరూపా వభినివేశ సంయతచిత్తౌ
బభూవతు స్తత్పరౌ వేంకట విభుణా సా తద్విధినా సతయా

చ. 9: సచ లజ్జావీక్షణో భవతి తం కచభరం గంధం ఘ్రాపయతి
నచలతిచేన్మానవతీ తథాపి కుచసంగాదనుకూలయతి

చ. 10: అవనతశిరసాప్యతి సుభగం వివిధాలపైర్వివశయతి
ప్రవిమల కరరుహరచన విలాసై- ర్భువనపతి తం భూషయతి

చ. 11: లతాగృహమేళనం నవసై - కతవైభవ సౌఖ్యం దృష్ట్వా
తత స్తతశ్చరసా కేలీ- వ్రతచర్యాం తాం వాంఛంతౌ

చ. 12: వనకుసుమ విశదవరవాసనయా ఘనసారరజోగంధైశ్చ
జనయతి పవనే సపది వికారం వనితా పురుషౌ జనితాశౌ

చ. 13: ఏవం విచర హేలా విముఖ- శ్శ్రీవేంకటగిరి దేవోయం
పావనరాధాపరిరంభసుఖ- శ్రీ వైభవసుస్థిరో భవతి

రేకు: 0030-1 ధన్యాశి సం: 05-167

పల్లవి: ఏవం దర్శయసి హితమతిరివ
కేవలంతే ప్రియసఖీవా తులసీ

చ. 1: ఘటిత మృగమద మృత్తికా స్థాసకం
పటు శరీరే తే ప్రబలయతి
కుటిలతద్ఘనభారకుచవిలగ్నంవా
పిటర స్థలే మృత్స్రితా తుళసీ

చ. 2: లలిత నవ ఘర్మలీలా విలసనో-
జ్జ్వలనం తవ తనుం వంచయతి
జల విమలకేలీవశా సతతం
అలిక ఘర్మాంచిత విహరా తులసీ

చ. 3: సరస నఖచంద్రలేశా స్తే సదా
పరమం లావణ్యం పాలయతి
తిరువేంకటేశ తత్కరుణా గుణా వా
వరరూప నవచంద్రవదనా తులసీ

రేకు: 0030-2 సామంతం సం: 05-168

పల్లవి: సారెసారె విన్నవించఁ జాలమిఁక నీవు
దారిదప్ప దిరిగేవు తగవా వోరి

చ. 1: చెప్పరాదు కడు వలచిన వానివలె నా-
కొప్పులోని సవరము కొంటఁబోయి
అప్పుడే వొక్కతికిచ్చితట వోరి నా-
తప్పుగాని నీవల్లఁ దప్పులేదు వోరి

చ. 2: కడలేని మోహంబు గలవానివలె నా-
కడితాను చీర నీవు కాసెవోసి
వడిగా నేఁగెదవు యవ్వతికియ్యవలెనో నన్ను
వడిఁబెట్టి యింతసేయవలెనా వోరి

చ. 3: ముద్దుల నా వేలనున్న ముద్దుటుంగరము నీవు
వుద్దండానఁ గొంటఁబోతి వోరి
తిద్దలేము నీగుణాలు తిరువేంకటేశ నీవు
వొద్దికతో నన్నుఁబాయకుండరా వోరి

రేకు: 0030-3 సామంతం సం: 05-169

పల్లవి: తలనొక్కమాటాడఁ దలకెక్కె వలపు దీని-
తలఁపు రేఁచక మీరు తలరమ్మా

చ. 1: చిత్తజు నమ్ములు దాఁకి జీర వారినందుకు పూ-
వత్తులు వేయక కాని వాడదమ్మా
బత్తిగల వారిందరు పచ్చకప్పురము మేన
మెత్తకకాని మానదు మెత్తరమ్మా

చ. 2: కంటిచూపు కాయజుని వింటిబాణములు దాఁకి
గంటిలేని పోటులాయఁ గదరమ్మా
అంట ముట్టరాని తాప మగ్గలమైనది ముల్లు
ముంటఁగాని పోదు మేను మూయరమ్మా

చ. 3: అప్పుడింత సొబగు లేదతివమొగమునందు
చొప్పులెల్ల బాగులాయ చూడరమ్మా
అప్పుడు శేషాద్రిరాయఁడంగనఁ గలిసెఁ గాన
యెప్పుడూఁ బాయని చనవిచ్చె నమ్మా

రేకు: 0030-4 పాడి సం: 05-170

పల్లవి: చింతల చిగురులె చిచ్చులట
యింతటిలోనిఁక నేలాగే

చ. 1: చక్కని మన్మథ సంవత్సరంబున
చుక్కలరాజే సూరియుఁడై
యెక్కువరాత్రుల యెండగాయునట
యెక్కడిదిఁక బ్రదుకేలాగే

చ. 2: కాంతల నడుములఁ గఱవయ్యెడినట
అంతట జవ్వనపామనిని
వింత మీన సని వెలఁదులకన్నుల -
నెంత గనమౌనొ యేలాగే

చ. 3: కంకుమగుబ్బల కుంభరాశికిని
వంకల చంద్రుఁడు వచ్చెనట
వేంకటరమణుఁడు వెలఁదిఁ గూడెనట
యింక నీ తమక మేలాగే

రేకు: 0030-5 పాడి సం: 05-171

పల్లవి: మారుకు మారు సేయ మఱచి నీ వంతలోనె
నేరములెంచుకొనేవు నేఁటిలోనే తప్పెనా

చ. 1: చొక్కపు నీ గుబ్బలపై జూజపు నేఁతలవలె
చిక్కులు జీరలువారఁ జించెనాతఁడు
తెక్కుల నీ వూరకుండి తెలిగన్నుల నీళ్ళు
గుక్కేవు నీ చేతులేమి కూరగోయఁ బోయెనా

చ. 2: ముసిముసి నగవుల మోవిమీఁది కెంపులవి
కసిగాటు సేఁతలనే కప్పె నతఁడు
అసురుసురై నీవు అతనిఁజేయఁగలేక
వుసురనేవప్పుడేమి వూరలేక వుంటివా

చ. 3: కూరిమి నీ కౌఁగిటిలోఁ గూడి నీ చిత్తమనెడి
వూరిలోనఁ గాఁపురమైవుండె నాతఁడు
వేరులేని మహిమల వెంకటేశుఁడతనిమై
చూరగొంటి వప్పుడేమి జోడువెట్టుకుండెనా

రేకు: 0030-6 కాంబోది సం: 05-172

పల్లవి: ఉయ్యాల మంచముమీఁద నూఁచి వేసారితిమి
ముయ్యదించుకయు రెప్ప మూసినాఁ దెరచును

చ. 1: చందమామ పాదమాన సతికి వేఁగినదాఁకా
యెందును నిద్రలేదేమి సేతమే
గందపుటోవరిలోనఁ గప్పురంపుటింటిలోన
యిందుముఖి పవ్వళించు నింతలోనే లేచును

చ. 2: పంచసాయకుని పుష్పబాణమాన యిందాఁక
మంచముపై బవ్వళించి మాటలాడదు
నించిన వాలుగన్నుల నిద్దురంటానుండితిమి
వంచిన రెప్పలవెంట వడిసీఁ గన్నీరు

చ. 3: వెన్నెలల వేంకటాద్రివిభుని లేనవ్వులాన
నన్నుఁ జూచియైనాఁ జెలి నవ్వదాయను
ఇన్నిటాను సంతసిల్లి యీ దేవదేవుని గూడి
మన్ననల యింత లోన మలసీని జెలియ

రేకు: 0031-5 కాంబోది సం: 05-173

పల్లవి: ఉండఁబాసీ నడవిలో వొకతె నేను
ఎండలు నీడలు గాసీ నేమి సేతురా

చ. 1: చిన్నినానడుము చూచి సింహము దగ్గరెనంటా
ఉన్నతపుఁ గుచముల కొరసెఁ గరి
మున్నిటి పొందులు వైరమును జేసె మృగపతి
యిన్నిటికి నగ్గమైతి నేమి సేతురా

చ. 2: నిండు నా నడపు చూచి నెమలి దగ్గరి వచ్చె
బండు నేసి నారుసూచి పాయదు పాము
రెండుఁ జూచి పగయుఁ గూరిమి దోఁచె నింతలోనే
యిండె వట్టె నిన్నిటికి నేమి సేతురా

చ. 3: కోరి నాపలుకు విని కోవిల దగ్గర వచ్చె
చేరీ నామోవికిదె చిలుక నేఁడు
గారవాన నిన్నియు వేంకటగిరి విభుఁడా
యేరా యిట్టె చేకొంటివేమి సేతురా

రేకు: 0031-6 శంకరాభరణం సం: 05-174

పల్లవి: వెక్కసమగుఁ గుచవిభవములు
జక్కవా పులుగుల జగడములే

చ. 1: చింతచేత నిదె చెలియ నుదిటిపై
చెంతలఁ జెదరిన చిరునెరులు
కాంత కన్నులను గండుమీలకును
కంతుఁడు వేసిన గాలములే

చ. 2: తమకంబునఁ గాంతకుఁ గరమూలపు-
చెమటల తావుల చెలువములు
మమతలఁ బెంచిన మరుని కొంతముల-
జమళితీఁగెలకు జలకములే

చ. 3: తెఱమోవిపై తిరువేంకటపతి
గుఱుతులు సేసిన కురుఁబసలు
ఒఱిగి వివశతల నుండఁగ సురతపు
మఱపులు దెలిపిన మర్మములే

రేకు: 0061-1 కొండమలహరి సం: 05-175

పల్లవి: భోగీంద్రశయనుని బోయతి దివ్య-
భోగాలు మరిగిన బోయతి

చ. 1: పొదిగొన్న పెనుఁగొప్పు బోయతి మించుఁ-
బొదలిన గుబ్బల బోయతి
పొదలఁ బూవులు చూచి బోయతి యంప-
పొది సవి వెరచెనె బోయతి

చ. 2: పొడల గందపుమేని బోయతి పచ్చి-
పొడికప్పురపు బూఁత బోయతి
పొడవైన హరిఁ జూచి బోయతి నేఁడు
పుడుకు వేఁదురుగొన్న బోయతి

చ. 3: పొందైన రచనల బోయతి పతిఁ
బొందక పొందిన బోయతి
పొందులెరఁగని బోయతి రతిఁ
బొందె వేంకటపతి బోయతి

రేకు: 0061-2 ముఖారి సం: 05-176

పల్లవి: ఎవ్వఁడో వీఁడేల తంగి వచ్చి
నవ్వీ నవ్వీ నాతోనే

చ. 1: పచ్చిపాలే పచ్చిపాలే
పచ్చిపాలే తోడంటుఁబాలే
వచ్చి వచ్చి వాడ వాడలఁ
జొచ్చియారగించెఁ జూడరే

చ. 2: పెంట పెరుగే పెంట పెరుగే
పెంటమంద పెనుఁబెంట పెరుగే
అంటకంటకు మనఁగానే వాఁడు
వొంటి నారగించీ నోయమ్మా

చ. 3: బొంకుగోరో బొంకుగోరో
బొంకుగోరో కోరో పాలఁతులు
వేంకటేశుండు వేసాలరాయఁడు
అంకెలా నన్ను నలరించెనే

రేకు: 0061-3 సామంతం సం: 05-177

పల్లవి: ఎటువంటి భోగి వీఁడెటువంటి జాణ
వటపత్రమున నున్నవాఁడా వీఁడు

చ. 1: పొదిగొనఁ బూచిన పున్నాగతరులలో
పొదలుఁ బుప్పొళ్ళపైఁ బూఁదేనె సోనలు
గదలుచు జడివానకాలంపుఁ బెదపెద్ద-
నదులై పారనున్నతిని
కదలని నడిగడ్డ కల్పభూజంబుల
పదిలమైన నీడ బంగారు చవికెలో
కదిసిన జలరాశి కన్నెకౌఁగిటఁ గూడి
వదలకెప్పుడు నున్నవాఁడా వీఁడు

చ. 2: వలనగు తావుల వాంతికలలోన
కెలఁకుల నరవెడ్పుఁ గెందామరలయందు
పొలయుచు గొజ్జంగపూవుల దూళితో
లలితంపు గాలి చల్లఁగను
కొలందిమీరిన మంచి కోనేటి పన్నీటి-
జలములలో నున్న జలముఖులఁ దాను
అలరుచుఁ దననోలలాడుచు నేప్రొద్దు
వలపులు చల్లినవాఁడా వీఁడు

చ. 3: లోకము లోపలి లోలలోచనలెల్లా
జోకైన తనవాలుఁ జూపులచేఁ జిక్కి
యీకడాకడ చూడనెఱఁగక నిజమైన-
సాకారమునకె మెచ్చఁగను
పైకొన్న సరసపుఁ బలుకులఁ గరఁగించి
యేంకాతమున సౌఖ్యమెల్లఁ జేకొనుచుఁ దా-
నీకడఁ దిరువేంకటేశుఁ డై యున్నాఁడు
వైకుంఠపతియైన వాఁడా వీఁడు

రేకు: 0061-4 శ్రీరాగం సం: 05-178

పల్లవి: వేవేగన రానివిభునితోడి పొందు
యేవూరికేవూరు యేవూరే

చ. 1: ప్రేమమెఱిఁగి రాఁడు పలిచిన పతితోడ
యేమందమేమందమేమందమే
భామిని తను నొవ్వఁబలికెననుచు నాడె
యేవమాఁటకేమాఁట యిది యేఁటికే

చ. 2: జామాయ నిదె వచ్చి సటలెల్లఁ బచరించి
యేమేలుకేమేలు ఇదియేఁటికే
కామునిశరములఁ గాఁగునింతకుఁ జెలి
యేమిటికింక మనమేమిటికే

చ. 3: దిమ్మరితనములఁ దిరువేంకటేశుని
రమ్మను రమ్మను రమ్మనవే
నెమ్మనమలరఁగ నేఁడింతలోననే
కమ్మరఁ గమ్మరఁ గరుణించెనే

రేకు: 0061-4 దేసాళం సం: 05-179

పల్లవి: నెయ్యములల్లోనేరేళ్ళో
వొయ్యన వూరెడి వువ్విళ్ళో

చ. 1: పలచని చెమటల బాహుమూలముల-
చెలమలలోనాఁ జెలుపములే
థళథళమను ముత్యపు జెఱఁగు సురటి
దులిపేటి నీళ్ళతుంపిళ్ళో

చ. 2: తొటతొటఁ గన్నులఁ దొరిగేటి నీళ్ళ
చిటి పొటి యలుకల చిరునగవే
వటఫలంబు నీ వన్నెల మోవికి
గుటుకలలోనా గుక్కిళ్ళో

చ. 3: గరగరికల వేంకటపతి కౌఁగిట
పరిమళములలో బచ్చనలు
మరునివింటి కమ్మనియంప విరుల-
గురితాఁకులినుపగుగ్గిళ్ళో

రేకు: 0061-5 శుద్ధవసంతం సం: 05-180

పల్లవి: ఎన్ని సేసినా నీకు నిది గొత్తలా
అన్నిటిలోపల నుండే అతఁడౌదో కావో

చ. 1: వొలఁతి మొయిఁదీగెపై పులకలు వొడమించే-
విల నిన్నుఁ దలఁపించి యిది గొత్తలా
తలకొన్న వేణునాదమునవె పట్టిమాఁకు-
లలర- జేసినవాఁడవౌదువో కావో

చ. 2: గుట్టునఁ బయ్యెదకొంగు గుబ్బలనె జారించే-
విట్టె నీ ప్రేమనే యిఁతికిది గొత్తలా
మట్టుకొని వేణురవమున గొల్లెతల చీర-
లట్టు నిట్టు వదలించి నాతఁడౌదో కావో

చ. 3: కాంత కవుఁగిటను వేంకటగిరి విభుఁడా నీ-
వింత మేను మఱపించుటిది గొత్తలా
పంతమూడి యడవిలో పసుల నీరాగాల-
రంతులనే మఱపించే రాజవపుదో కావో

రేకు: 0062-1 ఆహిరి సం: 05-181

పల్లవి: ఎంతవడి దాఁక నీ యెల యింపులు
నంతమ్మై విభునికిటు చనవియ్యరాదా

చ. 1: పొగరుఁగెమ్మోవి గిరుపుల నగవులాఁడి నీ-
పగడవాతెర దెరచి పలుకవమ్మా
బిగువుఁ బొలయలుక మురిపెముల నీ సొబగెల్ల
సగమాయఁ జలమింకఁ జాలించరాదా

చ. 2: కలికి నునుమెఱుఁగుఁ బుల కల గుబ్బలాఁడి నీ-
సొలపుఁ గన్నులు దెరచి చూడవమ్మా
వలపు వసివాడ జవ్వనపు లేఁదీగతో
తలఁకేవు కోపంబు తలఁగించరాదా

చ. 3: లావణ్యముల సొబగులాఁడి నీ ప్రియుఁడైన-
కోవిదునిపైఁ బ్రేమ గులుకవమ్మా
శ్రీ వేంకటేశ్వరుఁడు చెలఁగి నిను మన్నించె-
నీ వేఁడుకలనైన నిట్లుండరాదా

రేకు: 0062-2 ఆహిరి సం: 05-182

పల్లవి: శిఱుత నవ్వులవాఁడు శిన్నెకా వీఁడు
వెఱపెఱఁగడు సూడవే సిన్నెకా

చ. 1: పాలసుమేనివాఁడు బోరవీఁపువాఁడు
సెలసు మోరవాఁడు సిన్నెకా
గొలసుల వంకల కోరలతో బూమి
వెలసినాఁడు సూడవే సిన్నెకా

చ. 2: మేఁటి కుఱుచవాఁడు మెడమీఁది గొడ్డలి-
సీటకాలవాఁడు సిన్నెకా
ఆఁటదానిఁ బాసి అడవిలో రాకాశి-
వేఁటలాడీఁ జూడవే సిన్నెకా

చ. 3: బింకపుమోఁతల పిల్లఁగోవివాఁడు
సింక సూపులవాఁడు సిన్నెకా
కొంకక కలికియై కొసరి కూడె నన్ను
వేంకటేశుఁడు సూడవే సిన్నెకా

రేకు: 0062-3 శ్రీరాగం సం: 05-183

పల్లవి: చెల్లఁబో అలుగ నేఁడు సిగ్గుగాదా
వొల్లని వీనిఁ బాసి వుడికి నామనసు

చ. 1: పొలసి యీ ప్రాణమిట్టే పోయినాఁ బోయఁ గాక
తలవంపు సేసే యీ తను వేఁటికే
కలసియుఁ గలయని కఠిచిత్తుని వీని
సొలసి కమ్మరఁ జూచీ నా మనసు

చ. 2: మరుతాపమున మేను మాఁడిన మాఁడెఁగాక
పరులబారికిఁ జిక్కే బ్రదుకేఁటికే
విరహాన నొకతెవై వేదనఁ బొరలు వీని-
కరుణలే కోరీని కష్టపు నామనసు

చ. 3: సడిఁబెట్టి వయసిట్టే చంపినఁ జంపెఁ గాక
వడిఁ బెట్టి వేఁచే నావయసేఁటికే
కడు జాణఁడైన వేంకటగిరీంద్రుఁడు వాని-
వొడలు సోఁకిన నిట్టే వుబ్బెడి నామనసు

రేకు: 0062-4 కాంబోది సం: 05-184

పల్లవి: ఇదె మొగంబిదె యద్దమిఁకనేఁటికే మిగులఁ
బదరేవు చెలివద్ద బవళించి నీవు

చ. 1: పెట్టినది నాయకుని బిరుదు పెనుఁబెండెంబు
కట్టినది యతనిమెడ కంటమాల
యెట్టు బొంకెదవె చెలి యిందాఁక బంగారు-
పట్టెమంచముమీఁదఁ బవళించి నీవు

చ. 2: పుక్కిటిది నాయకుని పొందైన తమ్ములము
చెక్కిటిది పతినొసలి చిన్నిచెమట
యిక్కు వెరిఁగియు బొంకనిఁకనేలె చెలి యతని-
పక్కనే యిందాఁకఁ బవళించి నీవు

చ. 3: బచ్చెనలు కుచయుగముపై నతని మృగమదము
లచ్చెనలు కొనగోళ్ళలాంచనములు
ఇచ్చకునిఁ దిరువేంకటేశుఁ గూడితివె చెలి
పచ్చలోవరి లోనఁ బవళించి నీవు

రేకు: 0062-5 శ్రీరాగం సం: 05-185

పల్లవి: పిడికిటి తలఁబాల పెండ్లికూఁతురు కొంత
పెడమరలి నవ్వీనె పెండ్లి కూఁతురు

చ. 1: పేరుకల జవరాలె పెండ్లికూఁతురు పెద్ద-
పేరులముత్యాలమేడ పెండ్లికూఁతురు
పేరంటాండ్ల నడిమి పెండ్లికూఁతురు విభుఁ
బేరు కుచ్చ సిగ్గువడీఁ బెండ్లికూఁతురు

చ. 2: బిరుదు పెండెము వెట్టెఁ బెండ్లికూఁతురు నెర-
బిరుదు మగనికంటెఁ బెండ్లికూఁతురు
పిరిదూ రినప్పుడె పెండ్లికూఁతురు పతిఁ
బెరరేఁచీ నిదివో పెండ్లికూఁతురు

చ. 3: పెట్టెనె పెద్దతురుము పెండ్లికూఁతురు నేఁడె
పెట్టెఁడు చీరలుగట్టెఁ బెండ్లికూఁతురు
గట్టిగ వేంకటపతికౌఁగిటను వడి-
పెట్టిన నిధానమైన పెండ్లికూఁతురు

రేకు: 0062-6 బౌళి సం: 05-186

పల్లవి: పెట్టని కోటిందరికిఁ బెండ్లికొడుకు బొమ్మ-
బెట్టె నసురలకెల్ల- బెండ్లికొడుకు

చ. 1: పెల్లగించి భూమెత్తీఁ బెండ్లికొడుకు వాఁడె
పిల్లఁగోవి రాగాల పెండ్లికొడుకు
పెల్లైన యీావుల పెండ్లికొడుకు వాఁడె
పిల్లేఁదీపుపెన్నుద్ది పెండ్లికొడుకు

చ. 2: పెంచెపు శిరసుపాగ పెండ్లికొడుకు గుం-
పించిన కోపగించీఁ బెండ్లికొడుకు
పెంచకప్పుడే పెరిగెఁ బెండ్లికొడుకు వల-
పించెఁ జక్కనిసిరిఁ బెండ్లికొడుకు

చ. 3: పెంట పెరుగులదొంగ పెండ్లికొడుకు భూమిఁ
బెంటి పోతులఁ గూరిచెఁ బెండ్లికొడుకు
గెంటులేని వేంకటగిరిమీఁదను వాఁడె
పెంట వెట్టుకున్నవాఁడు పెండ్లికొడుకు

రేకు: 0063-1 ముఖారి సం: 05-187

పల్లవి: పైపై దూరక పదరో యింతి
కోపాన బాసైనఁ గొనీఁ గాని

చ. 1: పరివారపుఁ బడఁతులేఁటికే
దొరలనంటేరు తొలరో
సరసపు తమ జగడాల నిట్టే
పరుల దూరేరు పచ్చిగనే

చ. 2: చక్కని విభుని సారెకుఁ జెలులు
వెక్కసాలాడక విడరో
దిక్కులకెల్లాను తెలివఁ బాసి తాఁ
నొక్కఁడే విచ్చేయుటొచ్చెమని

చ. 3: శ్రీ వేంకటేశుఁడు చెలువుఁ డొక్కఁడే
యేవంకకేఁగిన నేమౌను
భావించి యురముపనున్న కొమ్మదాఁ
నేవేవి గడించె నెఱుఁగరా

రేకు: 0063-2 ఆహిరి సం: 05-188

పల్లవి: గుట్టునఁ గోరికలెల్లఁ గొల్లవట్టీ నీ-
పట్టపుదేవికి నీకుఁ బల్లాండు పల్లాండే

చ. 1: పచ్చల సందిదండలు బాహుపురులు మెరయ
నెచ్చెలిపై మేను సోఁక నిలుచుండి
పచ్చవిలుకానితల్లి బంగారు దోసిట నీపై
బచ్చకప్పురము చల్లీఁ బల్లాండు పల్లాండే

చ. 2: మంతనపు మాఁటలతో మాఁటుగ నిన్ను సొలసి
కొంతపు గోళ్ళ నిగ్గు గుమ్మరింపుచు
చెంతలఁజెంగలువలు చెలులు చేనందియ్యఁగ
పంతమున నీపై వేసి పల్లాండు పల్లాండే

చ. 3: అలరుల మేడలోన అలమేలు మంగ నీ
యలయిక దీరఁ బ్రేమ నలరఁ జేసి
కలసి వేంకటేశ నీ కౌఁగిలి చేకొనీ నిదే
పలుమారు మీకు మీకుఁ బల్లాండు పల్లాండే

రేకు: 0063-3 మాళవి సం: 05-189

పల్లవి: తఱచు సూసకపు ముత్యపుఁ దలఁబాలతో
నెఱుల తుఱుము వంచీనే నెలఁత

చ. 1: పచ్చఁదోరణముఁ బలుకులింటికిని
పచ్చిముత్యాలనే కట్టె బాసికము
ముచ్చటలేనగవుల ముంగిట ముగ్గులుపెట్టి
నిచ్చకల్యాణములాడీనే నెలఁత

చ. 2: బచ్చెనల మెఱుఁగు గుబ్బల అయిరాణి దెచ్చి
కుచ్చుఁ బులకల బూజ గుండలాయను
దిచ్చరిమరునిఁ దెచ్చి తెరమరఁ గెడలించి
హెచ్చిన పెండ్లికూఁతురే నెలఁత

చ. 3: మరువింటి పేరింటి మంచిలగ్నమునందు
పరువంపుఁ జనుదోయి పరుపుమీఁద
తిరువేంకటగిరిదేవునికౌఁగిటఁ గూడి
నిరతంపు సిరులందెనే నెలఁత

రేకు: 0063-4 నారణి దేశాక్షి సం: 05-190

పల్లవి: ఎందరికి మెహించి యెందువోతివో నీ-
యందపు జేఁతలు నాతో నానతియ్యరాదా

చ. 1: పాదమున నంటిన పచ్చకప్పురములోన
వేదుగాఁ దులసితావి విసరీని
యేదెసఁ బవ్వళించితి వెవ్వతె పాదములొత్తె-
నాదరముతోడ నాతో నానతియ్యరాదా

చ. 2: చెలువంపు నొల నించిన పచ్చి కస్తూరి
తులసి పరిమళము దొలఁకీని
యెలమి నెక్కడకేఁగి యెవ్వతెకు మొక్కితివో
అలవి దేరఁగ నాతో నానతియ్యరాదా

చ. 3: ఉరము నీ మాణికాన వొనరిన జవ్వాది
సరిగాఁ దులసితావి చల్లీని
తిరువేంకటేశ పొందితివి నన్నిదె నీ-
యరవిరి విధమైన నానతియ్యరాదా

రేకు: 0063-5 శ్రీరాగం సం: 05-191

పల్లవి: చలిగాలి వేఁడేల చల్లీనె కప్పురపు
మలయజము తానేల మండీనే

చ. 1: పాపంపు మనసేల పారీనే నలుగడల
చూపేల నలువంకఁ జూచీనే
తాపంపుమేనేల తడవీనె పూవింటి-
తూపేల చిత్తంబు దూరీనే

చ. 2: వాయెత్తి చిలుకేల వదరీనె పలుమారు
కోయిలలు దామేల గొణఁగీనే
రాయడికి నలులేల రాసీనె మాతోను
కాయజుఁడు తానేల కసరీనే

చ. 3: ఏకాంతమునసేల యెదురైతినే తనకు
లోకాధిపతికేల లోనైతినే
చేకొనిదె మన్నించె శేషాద్రివల్లభుఁడు
పైకొనిదె మమ్మేల పాలించెనే

రేకు: 0063-6 వరాళి సం: 05-192

పల్లవి: కొలిచి బిందెలఁ దోసుకొనుఁగాక యీఁ
మలయుఁగోరికలనెడి మాడలే పండె

చ. 1: పొలఁతి సిగ్గులపోడు వొడిచి చిత్తపుటడవి
తొలుచూపు బదనుననె దున్నఁగాను
తలపోఁత విత్తఁగా తను చెమటవానలనె
బలువైన తమకమను బంగారు పండె

చ. 2: ఇచ్చకపుఁ జిరునగవులింటిలోపలి తోఁట
మచ్చుఁజేఁకట్లె పలుమరుఁ దవ్వఁగా
ఎచ్చుకుందుల సొలపులేతపుజలము వారి
నచ్చుఁగాఁకల పైఁడినక్కులే పండె

చ. 3: తగిలి వేంకటవిభుని తనివోని కొఁగిటను
జగడంపుఁ గూర్మి సరసము చల్లఁగా
నిగనిగని పలుకుఁదేనియలు వేమఱుఁ బారి
నిగుడు విరహాగ్ని మాణికములే పండె

రేకు: 0064-1 శంకరాభరణం సం: 05-193

పల్లవి: నాకుఁ జెప్పరె వలపు నలుపో తెలుపో
నూకి పోవఁగరాదు నుయ్యో కొండో

చ. 1: పొలఁతి మరునికి వెరవ పులియో యెలువో
పులుకుఁదుమ్మిదమోఁత పురుమో మెరుమో
తిలకింపఁ జందనము తేలో పామో
యెలమిఁ గోవిలకూఁత యేదో పోదో

చ. 2: పొదలిన చలిగాలి పొగయో వగయో
వదలిన కన్నీరు వాఁగో వంతో
వుదరమునఁ బన్నీరు వుడుకో మిడుకో
యెదుటఁ దలవంచుకొనుటెగ్గో సిగ్గో

చ. 3: అసమశరుపై పరపుటదనో పదనో
పసగలవానిమోవి పంచదారో తేనో
అసమగతి వానిరాక ఆదోపాదో
రసికు వేంకటేశు పొందు రాజ్యమో లక్ష్మో

రేకు: 0064-2 వరాళి సం: 05-194

పల్లవి: చెలఁగి కూఁతాకుగాఁ జేసేవునీ-
తలమీఁదనుండే తరుణిఁబో నేను

చ. 1: పిసుకకు పలుమారు పసురువేసీ నంత
వసివాడుకోర్చిన వనితఁ గాను
పస రేఁచి నీవింత పాలించు తొల్లిటిఁ
సిసువయిన నీ పెట్టుఁ జెట్టఁబో నేను

చ. 2: చిదుమకు పరుమారు చెక్కునొచ్చీ నీవు
వదనము నొక్కేటి వనితఁ గాను
ఎదురెదురనే భూమినెందరు లేరు నీఁ
నిదురవుచ్చినవారు నేనెవ్వతిని

చ. 3: కందించకు నన్నుఁ గౌఁగిట కాఁకల
అందునిందును గడు నలముచును
ఇందిరాపతి వేంకటేశ నీరతుల
పొందు నాకిదె మఱపుకెల్ల నెలవు

రేకు: 0064-3 శంకరాభరణం సం: 05-195

పల్లవి: లేఁతచెమటలనె తెలిసె మాకు నీకు
నీఁతలు మోఁతలునైన యింటిలోని సాము

చ. 1: పొదలు నీ నిట్టూరుపులనె తెలిసె మాకు
తుద మీరు వలరాచతొలిసాము
చెదరు నీ నెరులు చూచిననె తెలిసె మాకు
వెదచలు కాఁకల విరహపు సాము

చ. 2: పొలిఁతి నీ చూపువంపులనె తెలిసె మాకు
తలపోఁతవగల బిత్తరిసాము
పలుకకుండిన నీ కోపాననె తెలిసె మాకు
అలవోక నగవు నీ అరవిరిసాము

చ. 3: వొద్దికఁ గస్తూరితావులనె తెలిసె మాకు
గద్దరి నీ రతుల చీఁకటిసాము
ముద్దుల నీ నగవుల మోమునఁ దెలిసె మాకు
నిద్దపు వేంకటపతి నెరపిన సాము

రేకు: 0064-4 శ్రీరాగం సం: 05-196

పల్లవి: ఎనలేని బీరములెండ మావులు
ఇనుపగుగ్గిళ్ళు నీవేమిసేసేవే

చ. 1: పల్లదపుఁ గోరికల బలిమి గలుగఁబట్టి
తల్లడపు దమకము దక్కెఁగాక
వెల్లిగొను మమతపై విసిగేవు యీ-
యిల్లులేని ముంగిలి నీవేమి సేసేవే

చ. 2: లేఁత నీచిత్తములోఁ దాలిమి గలుగఁగఁ బట్టి
చేఁతల నీయలుకెల్లఁ జెల్లఁగాక
పూఁతమాఁటల సొలపుబొంకులనె దూరేవు
యీఁతలేని చల్లులాట యేమిసేసేవే

చ. 3: నెరతనముల నీ నెయ్యము గలుగఁబట్టి
తొరలి వేంకటపతి దొరకెఁగాక
తెరవ నీకితనికిఁ దియ్యపుఁ గూటముల
యెరుకలేనిమఱపులేమి సేసేవే

రేకు: 0064-5 ఆహిరి సం: 05-197

పల్లవి: బయలీఁ దించేవే గొల్లపడుచా- నీవె
బయలీఁదించేవు లోపలనె కన్నులను

చ. 1: పాలు వోయవుగా గొల్లపడుచా-యీా-
పాలుకుండలివి లోలోపల నున్నవి
పాలుమాలేవేలే గొల్ల పడుచా- మా-
పాలు నీ కేలయ్యె పాలవారివాఁడవు

చ. 2: పచ్చితేనె దేవే గొల్లపడుచ- మాకు
పచ్చితేనె లేదు మావిపంటనే కాని
పచ్చిమాటలేలే గొల్లపడుచ- పూవుఁ-
బచ్చితేనెలివివో నీ పలుకుల కొనలు

చ. 3: పసిచల్లమ్మే గొల్లపడుచా- నీవె
పసివడి తిరిగేవు బడివాయక
పసిబాలవటె గొల్లపడుచా- కురుఁ-
బల వేంకటగిరిపతి నన్నేలితివి

రేకు: 0064-6 ధన్యాశి సం: 05-198

పల్లవి: ఇందూ నందును రుచులెట్లుండునో
కందువెరిఁగి మేలుకైకొందువు

చ. 1: పదివేలు పళ్యాల పళ్ళిభోగము నీఁ
వదన నారగింతువప్పాలతో
పొదవిన యింతేసి పొందైన మతితో నీ-
సుదతికెమ్మోవినే చొక్కితివిగా

చ. 2: సరిలేని కల్పభూజముల పూవుల పూజ
సిరులుగా సురలచేఁ జేకొందువు
పరిపరివిధముల పరిమళములనెడి-
తరుణి పువ్వులతావిఁ దగిలితిగా

చ. 3: కొత్తయిన కస్తూరితోఁ గోరి తట్టుపుణుఁగు
మెత్తుకొందువు నీవు మేనిండను
ఇత్తరిఁ దిరువేంకటేశ యీ చెలిఁగూడి
హత్తిన చెమటలతో నలరితిగా

రేకు: 0065-1 కాంబోది సం: 05-199

పల్లవి: కూరిములే కదవమ్మ కోపమయ్యాని కడు-
భారమైన పోటుగాదా పచ్చిదేరే పలుకు

చ. 1: పున్నమచందురుని తోఁబుట్టుగైన నీమోము-
వెన్నెలలే కదవమ్మ వేఁచఁజొచ్చీని
పన్నిన పగల వెలుపటివారికంటెను
ఎన్నరాని పగగాదా యింటిలోని పోరు

చ. 2: చిత్తజుని జనియించఁ జేసే మొక్కలపు నీ-
చిత్తమిదే కదవమ్మ సిగ్గు వాపీని
మిత్తివలెఁ జెలరేఁగి మీఁదఁగానే యెండకంటే
నెత్తిమీఁదిచిచ్చుగాదా నీడలోని యెండ

చ. 3: కట్టఁగడ చందనపుగాలికి మీరిన నీ-
నిట్టూరుపులేకావా నిగ్గుదేరీని
యిట్టె యివె తిరువేంకటేశుఁగూడఁ బట్టి నీకు
చుట్టపుఁ బగలే మంచిచుట్టములైనవి

రేకు: 0065-2 సామంతం సం: 05-200

పల్లవి: కడు నీకు మోహించుఁగాని చక్కనివిభు-
నెడసి నిమిషమైన నెట్టోరిచేవే

చ. 1: పసిఁడిమంచముమీఁదఁ బవళించి యతనితో
కసరులాడెడియట్టు గాదువో నేఁడు
విసిగించెఁ గదనె యీ విరహానలము నిన్ను-
నిసుమంత దడవైన నెట్లోరిచేవే

చ. 2: అడుగులొత్తుచు నీ యడుగులు నతనియ్మై
కడఁగి వొత్తినయట్లు గాదువో నేఁడు
బడలించెఁ గదవె యీ పరితాపమున నిన్ను-
నెడయెడ యలుకలనెట్టోరిచేవే

చ. 3: ఒరపైన యతినిపై నొరగి యాతనిమతిఁ
గరఁగించునటువలెఁ గాదువో నేఁడు
వెరవక కలసితి వేంకటపతితోడ-
నెఱిఁగెఱుంగని చేఁతలెట్టోరిచేవే

రేకు: 0065-3 శ్రీరాగం సం: 05-201

పల్లవి: వనితలఁ గరఁగించు వన్నెకాఁడవు యిట్టె
తనివి దీరవేమిటఁ దగునయ్య విట్ఠల

చ. 1: పైపైనె యేరమణిగుబ్బలతో యిచ్చితివి నీ-
వైపైన కరముల వాఁడిగోళ్ళు
దూపిలిన రతితోడఁ దోయఁ డు చేతులతోడ
యేపుననున్నాఁడవిపుడేమయ్య విట్ఠల

చ. 2: పొందైన యేలలన చూపులకొ యిచ్చితివి నీ-
విందైన మురిపెపు వేయిగన్నులు
అందపు రెండుగన్నులరవిరి నీ మోమున
చెందమ్మి రేకులఁ బోలుఁ జెల్లునయ్య విట్ఠల

చ. 3: కింకల నేసతికో చిక్కెను నీచిత్తమెల్లను
అంకెల నన్ను నేలితివబ్బురంబుగా
పంకంపుఁ గస్తూరిమేన పండరంగిపతివైన-
వేంకటనగముమీఁది వెడమాయ విట్ఠల

రేకు: 0065-4 ముఖారి సం: 05-202

పల్లవి: కలిసి కాఁకలఁబెట్ట కనుసన్నలనె తిట్ట
చలపట్ట నీకుఁ జెల్లే జాణఁడే యతఁడు

చ. 1: పగటుగుబ్బలురాయ పసిఁడి మట్టెలు మ్రోయ
నగవువెన్నెల గాయ నడచేవు
వగ నిన్ను భ్రమయించ వలపువారిధి ముంచ
జగడాలు వచరించ చతురుఁడే యతఁడు

చ. 2: చూపులనె పగచాట సొబగులఁ గనుగీఁటఁ
దీపు పైపైమీఁటఁ దిరిగేవు
కోపగింతలనేప కూరిములు పైఁజాఁప
రాపులు పెరరేప రసికుఁడే యతఁడు

చ. 3: సందుల దండలు జార జవ్వాదిచెమట గార
నందములు దైవార నలసేవు
కందువుల నినుఁగూడి కరఁగి సిగ్గులు వీడి
విందై నీతోడుతనాడే వేంకటేశుఁడితఁడు

రేకు: 0065-5 ఆహిరి సం: 05-203

పల్లవి: ఎంతపని యిది యానతియ్యరాదా యీ-
చింతచే నీ మనసు చిముడఁబెట్టేవు

చ. 1: పండువెన్నెల బయటఁ బవళించి వేడుకల-
నుండి చెలి యేఁటికో వుసురంటివి
కొండుకవయసు నిడుకోరికల నిట్టూర్పు-
టెండలనె యీ చిత్తమేల వేఁచేవు

చ. 2: తూఁగు మంచముమీఁదఁ దురుముఁ బయ్యద జార-
నూఁగుచును నేఁటికో వుసురంటివి
కాఁగేటి కుచగిరులు కమ్మఁజెమటలఁ దొప్పఁ-
దోఁగగా తమకంబు తొలఁగ దాఁచేవే

చ. 3: నిద్దంపు వేడుకల నీవు వేంకటవిభుని-
వొద్దికై యేఁటికో వుసురంటివి
వొద్ద నీకెపుడాతఁడుండవలె నాతనిని
వద్దనఁగ రాదనుచు వాడఁబారేవు

రేకు: 0065-6 బౌళి సం: 05-204

పల్లవి: కావరాదా కరుణించి
వావిగాని వావి వాడీఁ దరుణి

చ. 1: పచ్చిదేరునగ్గి బగబగ మండేటిఁ
చిచ్చరకోలల చేఁతల
వెచ్చియు వేవని వేదనఁబొరలుచు
అచ్చపుటాసల నలసీఁ దరుణి

చ. 2: నీడలేని మాఁకు నిక్కపుటెండల
తాడులేని కట్టుఁదగులున
గోడలేని పెద్దకోరిక చిత్తారు
వాడుచు లోలోనె వ్రాసీఁ దరుణి

చ. 3: పొందు లేని పొందు భోగపుఁ బ్రియముల
కందెడి తనలోని కరఁగుల
కందువెటిఁగి వేంకటగిరిపతి నినుఁ
బొందిన తమకానఁ బొరలీఁ దరుణి

రేకు: 0066-1 దేశి సం: 05-205

పల్లవి: ముదిత చిత్తమునకు మొక్కరమ్మా
తుదలేని పతినిదె తోడితెంచె నిపుడు

చ. 1: పొలఁతి గుబ్బలనెడి పొడపు గుబ్బలిమీఁది-
మొలకచందురునకు మొక్కరమ్మా
నెలవుగఁ దనపతి నిద్దిరించే యింటిలోన
వెలయు వెన్నెలతీగె వెంటఁదెచ్చె నిపుడు

చ. 2: వనిత కన్నులనేటి వనజదళములపై
మొన చెంగలువలకు మొక్కరమ్మా
పెనగొన్న తనవిభ పెదపెద కన్నుల
గొనకొన్న పొందులెల్లఁ గొంటవచ్చె నిపుడు

చ. 3: అంచగమనకుఁ దొడవైన జవ్వాది నీట
ముంచిన మేనితావికి మొక్కరమ్మా
యెంచరాని తిరువేంకటేశుఁ గూడి యాతనిఁ
లంచపుఁ గౌఁగిటితావి లంకెఁ బెట్టె నిపుడు

రేకు: 0066-2 ముఖారి సం: 05-206

పల్లవి: రాఁడుగాక సరుగన రసికుఁడు యిట్టే
నేఁడే మచ్చికలనే నిధులు నిలుపఁడా

చ. 1: ప్రేమపు నీ యధరమే పెట్టరానిజీతము
కోమలి నీ తమ్ములమే కొంగుభత్యము
జాము నిన్నుఁ గొలిచిన చక్కని నీ విభుఁడు
యేమరక వలపులయేకరాజ్యమేలఁడా

చ. 2: పూఁత నీ గర్వముల చూపులే వారకములు
లేఁత నీ నగవులే పళ్ళెములో కూడు
పూఁతగాని చిత్తమనే పుప్పరిగెనుండినా
బాఁతి పడి నీ గుబ్బలపైఁడి కుండలెత్తఁడా

చ. 3: పుయ్యని నీ మేనితావి పువ్వుల చప్పరము
తొయ్యలి నీ కౌఁగిలిది తూఁగుమంచము
కయ్యపుఁ గూటముల వేంకటగిరివిభుఁడు
గయ్యాళి నీ కోరికల గద్దెమీఁద నుండఁడా

రేకు: 0066-3 ముఖారి సం: 05-207

పల్లవి: ఇందరినేలితి విఁకనేలే నీ-
యందపు బనులకు నంపుదు గాక

చ. 1: పొక్కుచు నిదె వలపుల సింహాసన-
మెక్కితి వంగన యిఁకనేమే
పుక్కిటి నిట్టూర్పుల ప్రసాదములు
చక్కని చెలులకుఁ జల్లుదు గాక

చ. 2: పరిమళపు నుదుటఁ బట్టునఁ బట్టము
ఇరువుగఁ గట్టితివిఁకనేమే
తరగని మేని ప్రతాపానలమున
అరుదగు సిగ్గుల నణఁతువు గాక

చ. 3: రాఁపుల మోహపురతుల రాజ్యమిది
యేపునఁ జేసితివిఁకనేమే
పైపై వేంకటపతిరూప సిరులు
చేపడె నిన్నిటఁ జెలఁగుదు గాక

రేకు: 0066-4 ముఖారి సం: 05-208

పల్లవి: వెరవకువే యింత వెరగేలా నీకు
నెటిఁ గురిసీఁ గొప్పున నీలాలు

చ. 1: పగడాలు వాతెరఁ బాయక కురియఁగ
మొగిఁ గురిసీఁ గన్నుల ముత్యాలు
మగువ నీవిభుని ప్రేమపుఁగూటమి గన్నుల
మగుడఁ గురిసీ నింక మాణికాలు

చ. 2: పడఁతి నీపుట్టానఁ బచ్చలు గురియఁగా
వడిసీని నీమేన వజ్రాలు
కడఁగి నీరమణుని కాఁకలఁ గూడఁగ
తొడరీ నీగోళ్ళతుదఁ గెంపులు

చ. 3: హితవైన తిరువేంకటేశుకౌఁగిట మోహ-
రతులఁ బొడమె నవరత్నాలు
ప్రతలేని లప్పలైన పచ్చి కస్తూరి శయ్య
మితిలేక రాలెనే గోమేధికాలు

రేకు: 0066-5 ముఖారి-ఆటతాళం సం: 05-209

పల్లవి: ఎవ్వరిపై నింతేసి యేల దూరేవే
పువ్వులు నిన్నే తాఁకఁ బొంచెనటవే

చ. 1: పండువెన్నెలలు నీపై గాయఁగా నీఁ
కెండలాయెనంటా నేల తిట్టేవే
నిండిన చందురుఁడు నీకు నాతనికి
కొండుకపాయము రూపు కూడపెట్టె నటవే

చ. 2: చల్లగాలి నిన్నును జాలిఁబెట్టెనంటా
వెల్లిగ నాకేలేలట్టే విఱిచేవే
మెల్లనే నీవిభుని మేనితావి యింతేసి
చల్లుమని గాలియేమి చాటెనటవే

చ. 3: కోవిలలు నిన్నుఁ గోపగించెనంటా
యీవల నావలనెల్ల నేల దూరేవే
శ్రీ వేంకటేశుని చెలియ నీకౌఁగిట
చేవగాఁ గూడుమని చెప్పెనటవే

రేకు:	0066-6 సాళంగం		సం:	05-210

పల్లవి:	నీవు దురగముమీఁద నేర్పు మెరయ
	వేవేలు రూపములు వెదచల్లితపుడు

చ. 1:	పదిలముగ నిరువంక పసిఁడిపింజల యంప-
	పొదుల తరకసములొరపులు నెరపఁగ
	గదయు శంఖంబుఁ జక్రము ధను:  ఖడ్గములు
	పదివేలు సూర్యబింబములైనవపుడు

చ. 2:	సొరిది శేషుని పెద్దచుట్టు పెనుఁ గేవడము
	సిరిదొలఁక నొకచేతఁ జిత్తగించి
	దురమునకుఁ దొడవైన ధూమకేతువు చేత-
	నిరవైన బల్లెమై యేచెనందపుడు

చ. 3:	కరకజడతో రమాకాంత జయలక్ష్మియై
	తొరలి కౌఁగిట నిన్నుఁ దొడికి పట్టి
	చరచె వెను వేంకటస్వామి నిను గెలువుమని
	మెరుఁగు కుచకుంభముల మిసిమితో నపుడు

రేకు: 0067-1 కాంబోది సం: 05-211

పల్లవి: కాంత నీ నెరుల చీఁకటినతఁడు భ్రమయఁగా
చింత చీఁకట్లు ముంచినది యరుదా

చ. 1: పొలఁతి నీ చిఱునవ్వు పువ్వులాతఁడు గోసి
కులికి కన్నుల నొత్తుకొనఁగాను
వలరాయఁడపుడు తన వాఁడి పువ్వు టమ్ములను
చలముకొని మిమ్ము ముంచక మానునా

చ. 2: నెలఁత నీపలుకుఁదేనియలాతఁడిటు గ్రోలి
సొలయుచును మైమరచి చొక్కఁగాను
తలఁపఁ గోవిలల యమృతంపుఁ బలుకుల వెల్లి
అలర మీమీఁదఁ గురియక మానునా

చ. 3: పరగు నీ మెఱుఁగు గుబ్బలనెడి గిరులపై
తిరువేంకటేశ్వరుఁడు తిరుగఁగాను
పరువంపు వలపు తాపల పెద్దకొండలై
గరిమతో మీకుఁ బెరుగక మానునా

రేకు: 0067-2 శ్రీరాగం సం: 05-212

పల్లవి: పతిఁ గలసి మేనెల్ల పరవశంబగుకంటె
హితవిరహమున నెదిరి నెఱుఁగుటే మేలు

చ. 1: పరపీడ గావించి బతుకు బతుకుటకంటె
పరహితము చేయునాపదలె మేలు
సిరుల నడిమికి భయము సేయు చనుఁగవకంటె
తరుణి నీ నెన్నడిమి దైన్యమే మేలు

చ. 2: కాంత నితరులకింద గరువించుకంటె మతిఁ
జింతఁగందుచు నలయు సిలుగె మేలు
కుంతలంబుల కిందఁ గులుకుఁ జూపులకంటె
చెంతలను నీతురుము చెదరుటే మేలు

చ. 3: తొడరి సరివారి వొత్తుడుకు నోర్చుటకంటె
గొడవతో వాఁడి గైకొనుటె మేలు
పడఁతి నీ వేంకటప్పనిరతి నలయుకంటె
కెడపి కొనగోళ్ళ సోఁకించుటే మేలు

రేకు: 0067-3 ముఖారి సం: 05-213

పల్లవి: వన్నెమాటల వలతువా నీవు నామనసు
కన్ను పెట్టఁగఁ గదా కడుబేలనైతి

చ. 1: పట్టుకొని నిన్నుఁ గోపముదీర చూపులనె
కట్టివేసినఁగదా గర్వమడఁగు
అట్టునిట్టును నీకు నయ్యలునసాదలును
బెట్టైకా నీచేతఁ బిరివీకులైతి

చ. 2: మరిగించి నిన్ను నా మనసారఁ గుచగిరుల-
చరులఁ దోసినఁ గదా చలమణఁగును
అరిది మోహమున నీ యడుగులకు మడుగులేఁ
బరచికా విరహతాపమునఁ బడవలసె

చ. 3: చెనకి నిన్నిట్ల నాచేయారఁ గోరికల
తనివి దీర్చినఁగదా తగులవదువు
ఘనమూర్తివైన వేంకటగిరీశ్వర నీకు-
నొనర లోనైకదా వొడలెరఁగనైతి

రేకు: 0067-4 ముఖారి సం: 05-214

పల్లవి: కొలవిలోన మును గోపికలు
మొలక నవ్వులతో మ్రొక్కిరి నీకు

చ. 1: పిరుఁదులు దాఁటిన పించెపుటలకల
తురుములు వీడఁగఁ దొయ్యలులు
అరిదినితంబములందునె దాఁచుక
మురిపెపుఁ గరముల మొక్కిరి నీకు

చ. 2: నిద్దపు మానము నెలఁతలు లోఁగుచు
గద్దరి తొడలనె కట్టుచును
ముద్దుటుంగరంబుల కరములతో
ముద్దులు గునియుచు మొక్కిరి నీకు

చ. 3: పాలిండ్ల పెనుభారంబుల కర-
మూలపు మెఱుఁగులు ముంచఁగను
వేలపుఁ బ్రియముల వేంకటేశ నిను
మూలకుఁ బిలుచుచు మొక్కిరి నీకు

రేకు: 0067-5 రామక్రియ సం: 05-215

పల్లవి: మానరె మాయలు మగువలు నేఁ
గాను కాననుచుఁ గనలీ శిశువు

చ. 1: పాలట దొంగిలె బాలుఁడు గో-
పాలులఁ గూడుక పలుమరును
పోలవిమాఁటలు బొంకులు యిది
యేలె యేలె మీరెలజవ్వనులు

చ. 2: సారెకు వెన్నలు చవులట యీా-
దూరులు మీకిఁక దొసగులు
చేరువ గరిమలు చెల్లవు మీరు
పోరె పోరె వొరపుల నెర సతులు

చ. 3: కింకలు మీకివి గెలుపులు నెల-
వంకలు మీకివి వన్నెలు
వేంకటపతి మీ విభుఁడట మీరు
బొంకక బొంకక పొలఁతులు మనరే

రేకు: 0067-6 ముఖారి సం: 05-216

పల్లవి: ఎండలు రేయెండలుగా నిరువంకఁజూచువాఁడు
కొండలుఁ గోట్లునయిన గుణములవాఁడు

చ. 1: పాలవెల్లి కొండమీఁదఁ బల్లెగట్టినవాఁడు
పాలలోని పాపఁడన్న ప్రాణమైనవాఁడు
పాలఁ బుట్టినట్టికూఁడు పంచిపెట్టినవాఁడు
పాలునేయి మ్రుచ్చిలించి బదికినవాఁడు

చ. 2: అలపోతువానితోడ నంటినమేనివాఁడు
ఆలఁగాపరులతోడ నాడినవాఁడు
ఆలజాలమైన నీటనలరఁ దేలినవాఁడు
ఆలపోతు కొండమీఁద ననువైనవాఁడు

చ. 3: పాఁపరేని మేను దన పానుపు వేసినవాఁడు
మోఁపరయి సకలము మోచినవాఁడు
కోపము శాంతములేని కొండలకోనేటివాఁడు
పాపముఁ బుణ్యము లేక బదికినవాఁడు

రేకు: 0068-1 శంకరాభరణం సం: 05-217

పల్లవి: వేఁటకాఁడనంటా నా వెంటఁ బాయవు వోరి
చీటకపు చెంచెత నాచేతిలాగెరఁ గవా

చ. 1: పొదలో నేనేసిన పులి నీవేసితినని
పెదపెద్ద యెలుగుఁల బెదరించేవు
కుదురుగుబ్బల నిన్నుఁ గుమ్ముదునో వుండేవో మేను
చిదియఁగా మేటిచెంచెత నన్నెఱఁగవా

చ. 2: చేరువ నామోఁటునఁ జేరిన నామెకముల
నేరుపరినంటా నీవునేసేవు
జీరలుగా కొమ్ము గోరఁ జింతుతో వూరకుండేవో
పేరుకల చెంచెత నాబిరుదులెరఁగవా

చ. 3: చొల్లెపు చుట్టలతోడ చూపులకు నడ్డాలు
చెల్లునంటా వచ్చి చెట్టవట్టేవు
నొల్లననఁగా గూడేవు వుద్దండపు వేంకటేశ
జల్లివింటి చెంచెత నాచలములెరఁగవా

రేకు: 0068-2 భైరవి సం: 05-218

పల్లవి: ఏమీననకురే యెప్పుడు మీరు
గామిడియై కాలిసన్నఁ గదలీని బిడ్డఁడు

చ. 1: పాలసీననకురే పాదిగి యిందరుఁగూఁడి
వులికి తలదీసుకవున్న బాలుని
పలుకఁడనకురే బలుమోరతోఁపుఁ గోపి
తలఁకి సిబ్బితిగొని తలరమ్మ బిడ్డఁడు

చ. 2: అడిగీననకురే ఆసదీరదనకురే
కడఁగి చలమరియై గాసిఁబెట్టీని
జడలున్న వనకురే జననుతుఁడీశిశువు
కడు దూరీ గిరులకు గమనించి బిడ్డఁడు

చ. 3: బిత్తలున్నాఁడనకురే పృథివిలోఁ బిన్నవాఁడు
మత్తులై వున్నవారి మడియించీని
చిత్తిణివాఁడనకురే శ్రీ వేంకటేశుఁడు
యెత్తుక యీరేడులోకాలేలీని బిడ్డఁడు

రేకు: 0068-3 సామంతం సం: 05-219

పల్లవి: అడుగడుగుకు నీ వాడఁగాను మా-
బడలికంతయుఁ దోయ పండరంగిరాయ

చ. 1: పాదికెత్తు మెరుఁగారు బంగారుగుండు
సేదదేర మెడఁగట్ట చిత్తగించితి
యేదెస కానికదెచ్చి యిచ్చిరి నీ కెవ్వరో
పాదపుగజ్జెలు మోయ పండరంగిరాయ

చ. 2: మద్దికాయలు చెవుల మాణికాల పోఁగులు
పెద్దపెద్దముత్యాలు పెంపు మీరఁగా
ముద్దల వెన్నపాలు ముచ్చిలించు సేఁతలవి
బద్దుల పనులైపోయ పండరంగిరాయ

చ. 3: వెల్లిగొను వేడుకల వేంకటాదిపతివై
తెల్లనికన్నుల నవ్వుతీగె సోగల
గొల్లెతల గుబ్బలపై కూరిమి మెరయఁగా
పల్లకి నీకిప్పుడాయ పండరంగిరాయ

రేకు: 0068-4 మంగళకౌశిక సం: 05-220

పల్లవి: అబ్బురంపు శిశువు ఆకుమీఁదిశిశువు
దొబ్బుడు రోలశిశువు త్రుప్వి త్రుప్వి త్రుప్వి

చ. 1: పుట్టు శంఖుచక్రములఁ బుట్టిన యాశిశువు
పుట్టక తోల్లే మారుపుట్టువైన శిశువు
వొట్టుపక పాలువెన్నలు నోలలాడు శిశువు
తొట్టెలలోని శిశువు త్రుప్వి త్రుప్వి త్రుప్వి

చ. 2: నిండిన బండి దన్నిన చిన్నిశిశువు
అండవారి మదమెల్ల నణఁచిన శిశువు
కొడలంతేశసురులఁ గొట్టిన యా శిశువు
దుండగంపు శిశువు త్రుప్వి త్రుప్వి త్రుప్వి

చ. 3: వేఁగైన వేంకటగిరి వెలసిన శిశువు
కౌఁగిటి యిందిరా దొలఁగని శిశువు
ఆఁగి పాలజలధిలో నందమైన పెనుఁబాము
తూఁగుమంచము శిశువు త్రుప్వి త్రుప్వి త్రుప్వి

రేకు: 0068-5 ముఖారి సం: 05-221

పల్లవి: పలుకుఁదేనియల నుపారమియ్యవే
అలరువాసనల నీ యధరబింబానకు

చ. 1: పుక్కిటి లేనగవు పొంగుఁబాలు చూపవే
చక్కని నీవదనంపు చందమామకు
అక్కరొ నీవాలుఁగన్నులా రతిగా నెత్తవే
గక్కన నీచెక్కుతొలుకరి మెరుపులకు

చ. 2: కమ్మని నీమేని తావి కానుకగా నియ్యవే
వుమ్మగింత చల్లెడి నీవూరుపులకు
చిమ్ముల నీచెమటలఁ జేయవే మజ్జనము
దిమ్మరి నీమురిపెపు తీగమేనికి

చ. 3: పతి వేంకటేశుఁ గూడి పరవశమియ్యవే
యితవైన నీమంచి హృదయానకు
అతనినే తలఁచఁగ నానతియ్యఁ గదవె
తతితోడ నీలోని తలపోఁతలకు

రేకు: 0068-6 భైరవి సం: 05-222

పల్లవి: ఆనపెట్టుదువు నీవప్పటి నానోరణఁచి వోరి
నీ నిజానకు నాతో నేఁడైన మానరా

చ. 1: పచ్చడాన జవ్వాది పరిమళమేడదిరా
పచ్చిసేఁతలు చెక్కిళ్ళపై నీకేడవిరా
గచ్చు మోవిమీఁదనున్న కసిగాటులేడవిరా
యిచ్చకుఁడ కనుఁగెంపులేడవి గలిగెరా

చ. 2: ముద్దుల చక్కని నీదు మోముకళలేడవిరా
కొద్దిగాని సందొత్తుగోరేడదిరా
గద్దరీఁడ యీ చిట్లు గందము నీకేడదిరా
తిద్దెను గస్తూరిబొట్టు దిమ్మరి యెవ్వతెరా

చ. 3: భీతితో నీవాడేటి తబ్బిబ్బుమాటలేడవిరా
రాతిరేడ నుండితి వెరవక చెప్పరా
యేతరీఁడ తిరువేంకటేశ నన్ను నేలితివి
యేతులతో వలపించ నెంత కలికివిరా

రేకు: 0069-1 కన్నడగౌళ సం: 05-223

పల్లవి: కామయాగము చేసెఁ గలికి తన-
ప్రేమమే దేవతాప్రీతిగాను

చ. 1: పొలుపలర సురతతాంబులరసపానంబు
నలినాక్షి సోమపానంబు గాను
కలకలంబుల మంచి గళరవంబుల మోఁత
తలకొన్న వేదమంత్రములుగాను

చ. 2: పడఁతి తన విరతాపమునఁ బుట్టిన యగ్ని
అడరి దరికొన్న హోమాగ్నిగాను
ఒడఁబడిక సమరతుల నుదయించిన చెమటఁ
దడియుటే యది యవభృథంబుగాను

చ. 3: తనరఁ గుచముల రుచులు దంతాక్షత క్రీడ
ననుపైన పశుబంధనంబుగాను
యెనసి శ్రీతిరువేంకటేశ్వరుని పొందు
ఘనమైన దివ్యభోగంబుగాను

రేకు: 0069-2 శ్రీరాగం సం: 05-224

పల్లవి: పట్టనీకనోప నాప్రాణంబులు నీ-
పట్టు దైవమె యెరుఁగు బ్రదుకవయ్యా

చ. 1: పడితినిన్నాళ్ళు నిర్బంధమున నాచేత
కడమొదలు లేని కాఁకల సొలపుల
బడలెఁ గడు నామేను పట్టనీకనోప నీ-
పడఁతులను గూడుకొని బ్రదుకవయ్యా

చ. 2: నొగిలితివి నాచేత నొప్పిమాటలనెంతె
వగలఁ గడు నన్ను విడువఁగనోపక
జగడమిఁక లేదు విరసము మాని సుఖివియై
పగలేక యిఁకనైన బ్రదుకవయ్యా

చ. 3: ఎంత నొగిలినను నాకేమాయ నీకు నీ-
సంతోషమబ్బినను జాలుఁగాక
యింతసేసియు వేంకటేశ కూడితివి నీ-
పంతంబు చెల్లెనిఁక బ్రదుకవయ్యా

రేకు: 0069-3 శ్రీరాగం సం: 05-225

పల్లవి: కపయఁగవలెనంటి కాఁగలించేవా నీ-
వువిదలఁ దలఁచకవుండనోసేవా

చ. 1: పారిటాకులు గట్టి పారనోపేవా
యేరులెల్ల దాఁటి కొండలెక్కనోపేవా
యీరీతి వెదురుబియ్యమేరనోపేవా
పేరినతేనెలు తెచ్చి పెట్టనోపేవా

చ. 2: యెడమఁ గుడిని వింటనేయనోపేవా
అడవిమెకాల వేఁటలాడనోపేవా
కడఁగి చెంచెత నాతోఁ గలశుండేవా
అడరి నాపొత్తుల నారగించేవా

చ. 3: యిప్పటి మాఁటలు యీడేరించనోపేవా
చెప్పినట్టే కాఁపురము సేయనోపేవా
కప్పిరంపుశయ్యపై వేంకటరాయఁడా
యెప్పుడుఁ బాయని చనవియ్యనోపేవా

రేకు: 0069-4 మాళవి సం: 05-226

పల్లవి: చూడవమ్మ యశోదమ్మ
వాడల వాడల వరదలివిగో

చ. 1: పొంచి పులివాలుఁ బెరుగు
మించు మించు మీఁగడలు
వంచి వారలుపట్టిన
కంచపుటుట్ల కాఁగులివిగో

చ. 2: పేరీఁ బేరని నేతులు
చూరలు వెన్నల జున్నులును
ఆరగించి యట సగఁబాళ్ళు
పారవేసిన బానలివిగో

చ. 3: తెల్లని కనుఁదీగెల సోగల
చల్లలమ్మేటి జవ్వనుల
చెల్లినట్లనే శ్రీవేంకటపతి
కొల్లలాడిన గురుతులివిగో

రేకు: 0069-5 ధన్యాశి సం: 05-227

పల్లవి: బండి విరిచి పిన్నపాపలతో నాడి
దుండగీఁడు వచ్చె దోబూచి

చ. 1: పెరుగు వెన్నలుఁ బ్రియమున వే-
మరు ముచ్చిలించు మాయకాఁడు
వెరవున్నాఁ దనవిధము దాఁచుకొని
దొరదొంగ వచ్చె దోబూచి

చ. 2: పడుచు గుబ్బెత పరపుపై పోక-
ముడి గొంగు నిద్రముంపునను
పడియుఁడా వద్దఁ బవళించినట్టి-
తొడుకుదొంగ వచ్చె దోబూచి

చ. 3: గొల్లపల్లెలో యిల్లిల్లూ చొచ్చి
కొల్లలాడిన కోడెకాఁడు
యెల్లయినా వేంకటేశుఁడు ఇదె
తొల్లటిదొంగ వచ్చె దోబూచి

రేకు: 0069-6 సామంతం సం: 05-228

పల్లవి: చల్లనై కాయఁగదొ చందమామా నీ
వెల్లగాఁ దిరువేంకటేశునెదుర
మొల్లమిగ నమృతంపు వెల్లి గొల్పుచు లోక-
మెల్ల నినుఁ గొనియాడఁగాను

చ. 1: పొందైన హితులు నాప్తులు రసికులును గవులు
నందమగు నునుమాటలాడ నేర్చిన ఘనులు
చిందులకు నాడేటి సీమంతినీ మణులు
చెలఁగి యిరుగడఁ గొలువఁగాను

చ. 2: వందిమాగదులు గైవారింపఁ దనదివ్య-
మందిరోపాంత ఘనమార్గమునఁ గోనేటి-
ముందటను మంద మందప్రయాణములతోఁ
నిందిరాపతి మెరయఁగాను

చ. 3: ఏకాంత ముఖగోష్టినింపొంద మానవా-
నీకంబులెడఁ గలసి నిలిచి సేవింపఁ గాం-
తాకదంబముల హస్తముల కంకణఝుణ-
త్కారములు నిగుడఁ జామరములిడఁగ

చ. 4: జోకైన మణిగణస్తోమాంకితంబులై
సొంపొందు నాలపట్టములు గరములఁ దాల్చి
యేకాంతులిరువంక నెదిరి కొలువఁగ సకల-
లోకేశ్వరుఁడు మెరయఁగాను

చ. 5: బంగారుపత్రిమలకు ప్రతులైన దివిజలోఁ
కాంగనలు ఘనవిమానాంగణంబుననుండి
చెంగలువలును మంచిసేవంతిరేకులను
చెలఁగి యిరుగడఁ జల్లఁ గాను

చ. 6: మంగళాత్మకములగు మహితవేదాంత వే-
దాంగవిద్యలకు ప్రియమంది చేకొనుచుఁ దిరుఁ
వేంగళేశ్వరుఁడు గడు వేడుకలతోడఁ దిరుఁ
వీథులను విరించఁగాను

రేకు: 0070-1 పాడి సం: 05-229

పల్లవి: మూలమూల నమ్ముడుఁజల్ల ఇది
రేలుఁ బగలుఁ గొనరే చల్ల

చ. 1: పిక్కటిల్లు చన్నుల గుబ్బెత వొకతి కడుఁ-
జక్కనిది చిలికిన చల్ల
అక్కునఁ జెమటగార నమ్మీని యిది
యెక్కడఁ బుట్టదు గొనరే చల్ల

చ. 2: వడచల్లు మేని జవ్వని వొకతి కడు-
జడియుచుఁ జిలికిన చల్ల
తడఁబడు కమ్మనితావులది మీ-
రెడయకిపుడు గొనరే చల్ల

చ. 3: అంకులకరముల వొయ్యారొకతి కడు-
జంకెనలఁ జిలికిన చల్ల
వేంకటగిరిపతి వేడుకది
యింకానమ్మీఁ గొనరే చల్ల

రేకు: 0070-2 పాడి సం: 05-230

పల్లవి: అదిగాక సౌభాగ్యమదిగాక వలపు
అదిగాక సుఖమింక నందరికిఁ గలదా

చ. 1: ప్రాణవల్లభునిఁ బెడఁబాసి మరుబాణములు
ప్రాణబాధల నెగులుపడుటేఁటి వలుపే
ప్రాణేశ్వరుఁడు దన్నుఁ బాయఁ జూచిన యపుడు
ప్రాణంబు మేనిలోఁ బాయంగవలదా

చ. 2: ఒద్దికై ప్రియునితోనొడఁ గూడి యుండినపు-
డిద్దరై విహరించుటిది యేఁటివలుపు
పొద్దువోకలకుఁ దమపొలయలుకకూటముల
బుద్దిలోఁ బరవశము పొందంగవలదా

చ. 3: చిత్తంబులోపలను శ్రీవేంకటేశ్వరుని
హత్తించి వాఁడు దానయివుండవలదా
కొత్తయిన యిటువంటి కొదలేని సంగతుల
తత్తరము మున్నాడి తగులంగవలదా

రేకు: 0070-3 భూపాళం సం: 05-231

పల్లవి: ఎట్టుసేయనైన నేర్చు నిందునందు నీతఁడు
నెట్టుకొన్న విద్యలెల్ల నేర్చుఁగాన యీతఁడు

చ. 1: పలుదెరఁగుల దొంతులైన పాలపెరుగుకుండలెల్లఁ
దొలఁగ దించి పాలుద్రాగి దొంతివేర్చె నీతఁడు
తొలఁగఁ దోసి జగములెల్లఁ దొల్లిటట్ల బహువిధముల
నెలవుకొలిపి దొంతివేర్చ నేర్చుఁగాన యీతఁడు

చ. 2: పాలమీఁగడెల్లఁ దిగిచి పలుదెరఁగులఁ దోడనాడు
బాలులైనవారికెల్లఁ బంచిపెట్టె నీతఁడు
మేలిమైన పాలజలధి మీఁగడఖిలదేవతలకు
నోలిఁబంచి పెట్టినట్టి యోగిగాన యీతఁడు

చ. 3: తలుపుదెరచి కన్నె మేలుకొలిపి విభుఁడు గానివానిఁ
నెలమిఁ గలపినట్టి వేంకటేశుఁడమ్మ యీతఁడు
తలఁపులోని నాగకన్నెఁ దెలిపి పరపురుషునిఁ గూడి
కలయఁ జేయనేర్చినట్టి ఘనుఁడు గాన యీతఁడు

రేకు: 0070-4 కాంబోది సం: 05-232

పల్లవి: వెలినుండి లోనుండి వెలితిగాకుండి
వెలి లోను పలుమారు వెదకేవె గాలి

చ. 1: పండువెన్నెలలకునుఁ బ్రాణమగు గాలి
నిండుఁగొలఁకులలోన నెలకొన్న గాలి
బొండుమల్లె లతావిఁ బొడవైన గాలి
యెండమావులఁ బోలితేలయ్యె గాలి

చ. 2: కొమ్మావిచవికెలోఁ గొలువుండు గాలి
తమ్మికుడుకులఁ దేనె దాగేటి గాలి
యిమ్మయిన చలువలకిరవైన గాలి
కుమ్మరింపుచు వేఁడి గురిసేవె గాలి

చ. 3: తిరువేంకటాదిపైఁ దిరమైన గాలి
సురతాంతముల జనులఁ జొక్కించు గాలి
తొరలి పయ్యెదలలోఁ దూరేటి గాలి
విరహాతురులనింత వేఁచకువె గాలి

రేకు: 0070-5 సామంతం సం: 05-233

పల్లవి: రెప్పవేసి లోకమెల్ల రేయుఁ బగలుఁ జేయనేర్చుఁ
చెప్పరాని చేఁతలెల్ల చెప్పిచూపనేర్చునే

చ. 1: పాలలోను దచ్చి వెన్న పలుదెరఁగులఁ దివియనేర్చు
రాలువేసి నీరుమీఁదఁ దేలఁజేయు నేర్చును
గాలిపుంటి సంటి లోనఁ గాఁపురంబు సేయనేర్చు
అలికట్టుఁ జీరలోన నాలిఁబడయనేర్చును

చ. 2: ముద్దులాఁడికొడుకుచేత ముజ్జగములు దిప్పనేర్చును
చద్దికంట వేఁడికంటఁ జక్కఁజూడ నేర్చును
గద్దెరాతి కొండవింట గసికయ్యె చెలఁగనేర్చు
సుద్దులెల్ల మందులనఁగ సొంపుమిగులనేర్చును

చ. 3: పాఁపరేని కొండమీఁదఁ బందివేఁటలాడ నేర్చు
గోపసతుల మానమెల్ల కొల్లలాడనేర్చును
యేపు మీరినట్టి వేంకటేశుఁడనెడివాఁడు పిన్న-
పాఁపడై యశోదయెదుట పరువులిడఁగ నేర్చును

రేకు: 0070-6 బౌళి సం: 05-234

పల్లవి: ఏమి సోద్యమిది యెంతయును వెరగాయ
ఈ మగువ విభుఁగలయుటెట్లనో యనుచు

చ. 1: పొలసి నునుఁజెమటలుబ్బుచు నణంగుచునున్న-
చెలియభావము చూచి చెప్ప వెరపాయ
కలికి వలరాజు బింకపుశరము వాఁడిగా
పలుమరునుఁ బదనిడిన భావమో యనుచు

చ. 2: చలముకొని వేఁడి వెదచల్లు చూపులతోడి
నెలఁతఁ గని కట్టెదుర నిలువ వెరపాయ
చెలఁగి లోపలనున్న చిత్తజానలమెల్ల
వెలికి వెళ్ళుచు వెల్లివిరిసెనో యనుచు

చ. 3: తిరువేంకటేశుఁ బొందిన యింతిచనుదోయి-
కురునఖాంకములు గనుఁగొనఁగ వెరపాయ
తరుణినేచిన విధుఁడు దైవయోగమువలన
అరుదయిన శకలంబులా యనో యనుచు

రేకు: 0071-1 కాంబోది సం: 05-235

పల్లవి: ఏల రాఁడమ్మ యింతిరో వాఁ-
డేల రాఁడమ్మ నన్నేలినవాఁడు

చ. 1: పచ్చని పులుగుల బండిమీఁద నుండు-
పచ్చవింటి పిన్నబాలుని తండ్రి
పచ్చనిచాయలఁ బాయని బంగారు-
పచ్చడము గట్టి బాగైనవాఁడు

చ. 2: తెల్లని పులుగుపైఁ దిరుగ మరిగినట్టి-
తెల్లని సతిపాలి దేవరతండ్రి
తెల్లని పరపుపైఁ దేలిపొరలు వెట్టు-
తెల్లని కన్నుల తెలివైనవాఁడు

చ. 3: కొండవింటివాని గుత్తగొనిన యట్టి-
కొండుక పాయపుఁ గూఁతురుతండ్రి
కొండలరాయఁడు కోనేటి తిమ్మయ్య
కొండ తలనెత్తి గుఱుతైనవాఁడు

రేకు: 0071-2 శ్రీరాగం సం: 05-236

పల్లవి: చంపరాని పగనంబు: చల్లగాలి వేఁడి చిగురు-
టంపకోల దాఁకి దేహమప్పుడెట్లనోర్చెనే

చ. 1: పువ్వుటమ్ము దాఁకి చెలికిఁ బొక్కె మేను విభునిచూపు-
లివ్వలవలఁ గాఁడినప్పుడెట్లనోర్చెనే
జవ్వనంపు గుచభరము జడిసె నడుము కొప్పు వేఁగు
రవ్వదోఁప నడపుచేతి రాయిడెట్లనోర్చెనే

చ. 2: తప్పకెపుడు నతనిఁ జూచి తనివివోని తరుణి నేఁ-
డిప్పుడింత దడవు వాసి యెట్లనోర్చెనే
నొప్పికించుకోర్వలేక నొసలఁబట్టు వెట్టుకాంత
దప్పిదేరునట్టి విరహతాపమెట్లనోర్చెనే

చ. 3: ఇంచుకంత కప్పురమునఁ బారు తనువుమీఁద
నెంచరాని మదనరేఖలెట్లనోర్చెనే
మించి వేంకటాద్రివిభుఁడు మీఁదమీఁదనొరసి కూ
చరాని కంటసరులు వనిత యెట్లనోర్చెనే

రేకు: 0071-3 ఆహిరి సం: 05-237

పల్లవి: ఆపదలె సంపదలకాధారమై తోఁచె
పైపైనె తమకంబె పరిణామమాయ

చ. 1: పురిగొన్న మదనాగ్ని పుటము దాఁకినవలన
తరుణిదేహంబు కుందణమువలెనాయ
నురుగక వియోగాగ్ని చొచ్చి వెలువడెఁ గాన
మరుజన్మమై మహామహిమఁ బొగడొందె

చ. 2: పొలుపైన యిరులచేఁ బూవుగట్టిన వలన
సొలయకే మేను జాజుల పొట్లమాయి
నెలకొన్న గొజ్జంగనీటఁ దడియఁగఁబట్టి
కలకంటిమేను పులు గడగినట్లాయ

చ. 3: అందుపైఁ దిరువేంకటాద్రీశు నిజకృపా-
నందంబు తనకు బ్రహ్మానందమాయ
పొందైన వేడుకలు పొదిగొన్న చెలువంబు-
నందమయి సౌభాగ్యమగ్గలంబాయ

రేకు: 0071-4 సాళంగనాట సం: 05-238

పల్లవి: తనువెల్లఁ గోమలము తలఁపు వెగ్గలమాయ
వనితభాగ్యము గంటివా తరుణి

చ. 1: పోఁకలంతేసి ముత్యముల కంటసరులవి
వేఁకపు గుబ్బలమీఁద వేఁగుఁగాక మానునా
కాఁకల నడుము చిక్కేఁగదె గోరుచుట్టుపై
రోఁకటిపోటాయనమ్మరో తరుణి

చ. 2: ముమ్మడించినట్టి పెద్దమొగపుల మొలనూలు
యిమ్మైన పిరుఁదుమీఁద నింతభారమేఁటికే
బొమ్మరపోయెడి నవ్వులఁ బూఁటకూటిమీఁదఁ
దమ్మ వుమియఁగాదా తరుణి

చ. 3: సరసరూపవిలాసముల నింతికి నెందు
తిరువేంకటాచలాదిపుఁడెట్ల నిచ్చెనే
అరిదిబంగారునకు నపురూపమగుమణి
దొరకినట్లాయఁగాదో తరుణి

రేకు: 0071-5 ముఖారి సం: 05-239

పల్లవి: ఎవ్వరు గలరీతనికిఁక నేమిటికిని వెరవకు మన-
నెవ్వరుగలరాత్మరక్ష యేప్రొద్దునుఁ జేయను

చ. 1: పసిబాలకు బండివిరిగి పడి మేనెల్ల నొచ్చెను
కసుగందుకు నీరుపాముకాటున మై గందెను
నసికొట్లఁగోడెచేత నరుమాయను శిశువింతయు
వసముగాని చను ద్రావినవలనఁ బాపఁడు వాడెను

చ. 2: పెనుమాఁకుల పైపాటున బెదరి వెరచెఁ బిన్నవాఁడు
ఘనమగు సుడిగాలి దాఁకి కనుమూయనోపఁడు
అనువున వేంకటగిరిపై నన్నిసంకటములుఁ బాసి
మునిజనముల గేహముననుండెడి దేవుఁడు

రేకు: 0071-6 ముఖారి సం: 05-240

పల్లవి: ఎంత నేరఁడీదైవమిందరికి
బ్రాంతి గడుఁ బుట్టించి పరము మరపించె

చ. 1: ప్రాయమనియెడి మహాబహురూపమిది యొకటి
కాయములఁ గరఁగించీఁ గళలనెక్కించి
సోయగంబగు కన్నుచూపులనియెడు మహ-
మాయములఁ బొరలించి మనసు నాటించె

చ. 2: చక్కఁదనమనెడి వేషంబొకటి మేనిపై
నిక్కించి యది గోర్కి నెలవుగాఁ జేసి
తక్కువలు నెక్కువలు తమకములు నొల్లములు
మక్కువలు గలిగించి మల్లువెనఁగించె

చ. 3: ఇట్టి మోహము వేంకటేశ్వరుఁడు దనమీఁదఁ
బెట్టించుకొనె నయినఁ బ్రేమగల ఫలము
నెట్టుకొని తానతని నిజమెఱిఁగి మేలు చే-
పట్టైనెనను జన్మపరుఁడైన ఫలము

రేకు: 0072-1 భైరవి సం: 05-241

పల్లవి: పుడమిలోన మగలు గలుగు పొలఁతులకును దిరుగఁబాసె
అడవివారినుండనియ్యఁడమ్మ నీ కొమారుఁడు

చ. 1: భారమైన కుచభరంబుపై చెరంగు జారనొకతె
జారుఁజూపులాఁడి మంచిసాళగంపుటెలుఁగున
కోరో చల్లయనుచు మెరుఁగుగుచములదర మెట్టినడవ
గోరుదీసి పారితెంచె కొమ్మ నీ కుమారుఁడు

చ. 2: నెరులు దొంగలించినట్టి నీలవేణి యొకతె పెద్ద
తురుము దురిమి చల్లకడవతో విలాసమమరఁగా
చెరఁగుదూల వాఁడిగోళ్ళ చేయివీచి పిలిచి గోప-
తరుఁణిఁ గొంగువట్టి తీసె తల్లి నీ కుమారుఁడు

చ. 3: కంచుమట్టియల రవంబు గజబజింపఁ బదము దా-
టించి గబ్బినడపు నడచు మించుగుబ్బలాఁడిని
ఇంచుకంతవాఁడు వేంకటేశుఁడంటఁబట్టి కౌఁగిఁ
లించి మోవి గంటిసేసె నిపుడు నీకుమారుఁడు

రేకు: 0072-2 శంకరాభరణం సం: 05-242

పల్లవి: కొలమున మొదలనె గొల్లవారము యీ-
చలమునఁ బగ నిన్ను సాదించ నేరుతుమా

చ. 1: బూతులఁ దిట్టుచు సొలపులఁ జూచేవు మేనిఁ
నేతులకంపుల నేము నీ కేలరా
యేతులు రేఁపుచు మమ్మునెలయించేవు యేర
మాతోనే యింతేసి నేము మాటలు నేరుతుమా

చ. 2: కన్నుల నద్దలింపుచు గయ్యాళించేవు వోరి
నిన్ను మెప్పించఁ గలేము నేమేలరా
వెన్నలుఁ బాలునమ్మేటి వెట్టివారము యీ-
కిన్నెర మీట్ల గిలిగించఁగ నేరుతుమా

చ. 3: చేరి నన్నుఁ బోసినని చేయివట్టేవు యేమీ
నేరనివారము నీకు నేమేలరా
గారవపు తిరువేంకటగిరివిభుఁడ యీ
కూరిమినిట్టే నిన్నుఁ గూడఁగ నేరుతుమా

రేకు: 0072-3 శ్రీరాగం సం: 05-243

పల్లవి: ఊరకుంటే నన్ను నుండనియ్యవు ఇంత
పేరుకుచ్చి తిట్ట నన్నుఁ బ్రియమా నీకు

చ. 1: బుజముపైఁ జేయి వేసి బుజ్జగించేవు ఇంత-
నిజమా నామీఁద నీ కరుణ
భజన మొరయ నన్నుఁ బచ్చి సేసేవు ఇంత-
గజరుఁజేఁతలకోపఁగలనా యిఁకను

చ. 2: కాలుమీఁదఁ గాలువేసి కరఁగించేవు యింత-
మేలా నాతోడి సమేళములు
వాలుకచూపుల నాకు వాఁడివెట్టేవు యింత-
యేలికవై యిటుసేయనేలా యిపుడు

చ. 3: చక్కఁదనమిది నాది జట్టిసేసేవు నా
చెక్కుల రేకలు వ్రాయఁ జిత్తగించేవు
చక్కని వేంకటగిరిస్వామీ నీవు యిట్టే
దక్కిన నన్నింత సేయఁ దగునా యిఁకను

రేకు: 0072-4 నాట సం: 05-244

పల్లవి: నల్లనిమేని నగవుఁ జూపులవాఁడు
తెల్లనికన్నుల దేవుఁడు

చ. 1: బిరుసైన దనుజుల పీఁచమణఁచినట్టి--
తిరుపుఁగైదువతోడి దేవుఁడు
చరిఁబడ్డ జగమెల్లఁ జక్కఁజాయకుఁ దెచ్చి
తెరువు చూపినట్టి దేవుఁడు

చ. 2: నీటఁ గలసినట్టి నిండిన చదువులు
తేటపరచినట్టి దేవుఁడు
పాటి మాలినట్టి ప్రాణుల దురితపు-
తీఁట వాపినట్టి దేవుఁడు

చ. 3: గురుతు వెట్టఁగరాని గుణముల నెలకొన్న-
తిరువేంకటాద్రిపై దేవుఁడు
తిరముగ ధ్రువునికి దివ్యపదంబిచ్చి
తెరచి రాజన్నట్టి దేవుఁడు

రేకు: 0072-5 భైరవి సం: 05-245

పల్లవి: అతనుచే నెట్టయిన నౌదుఁగాక యీ-
గతిమాలి సొలసే కాయము నాకేఁటికే

చ. 1: బాససేసి యైనఁ గొంత పట్టలేను చిత్తము
దోసము మాటాడఁ దనతో నాకును
అసలాఁపలేక చేరి యంటిఁ గాక యింత-
సేసిన యాతనిమోము చెల్లఁబో నేఁజూతునా

చ. 2: దగ్గరి నావద్దఁ దనతరుణిఁ దలఁచినంత
సిగ్గుపడవలెను నాచిత్తమునందే
నిగ్గుదేరేకాఁకతోడ నిలువలేఁ గాక యింత-
బగ్గన నాదేహమిది పారవేయ సరకా

చ. 3: దేవుఁడంటాఁ దనమీఁద తెగి సొలపుమాటల
మోవనాడలేక యింత మొక్కితిఁ గాని
శ్రీ వేంకటేశుఁడింత చిత్తిణివిద్యల నాతఁ-
డేవంక కేఁగినను మాయింటికి విచ్చేసెఁగా

రేకు: 0072-6 శంకరాభరణం సం: 05-246

పల్లవి: ఉయ్యాలా బాలునూఁచెదరు కడుఁ
నొయ్య నొయ్య నొయ్యనుచు

చ. 1: బాలయవ్వనలు పసిఁడివుయ్యాల
బాలునివద్దఁ బాడేరు
లాలి లాలి లాలి లాలెమ్మ యెల్ల
లాలా లాలి లాలి లాలనుచు

చ. 2: తమ్మిరేకుఁ గనుఁదమ్ముల నవ్వుల
పమ్ముఁ జూపులఁ బాడేరు
కొమ్మలు మట్టెల గునుకుల నడపుల
ధిమ్మి ధిమ్మి ధిమ్మనుచు

చ. 3: చల్లుఁజూపుల జవరాండ్లు రే-
పల్లెబాలునిఁ బాడేరు
బల్లిదు వేంకటపతిఁ జేరి యందెలు
ఘల్లు ఘల్లు ఘల్లనుచు

రేకు: 0073-1 శంకరాభరణం సం: 05-247

పల్లవి: సారెకు నంటకురే జడనందురు
ధీరుఁడాతఁడున్నతపు దేహియట

చ. 1: బాయిటఁ బెట్టకురే పక్షులు పారెడిపొద్దు
వోయమ్మ బాలులకు నొప్పదందురు
మాయపు బులుగొకటి మచ్చికనీబాలుని
చేయిచ్చి యెక్కించుకొనఁ జేరీనట

చ. 2: పంచలఁ దిప్పకురే పాములు వెళ్ళేటి పొద్దు
కొంచెపుబాలులఁ బైకొనునందురు
మించిన పాముకటి మెరసి యీ బాలుని
దించక యెక్కించుకొనఁ దిరిగీనట

చ. 3: అలమి పట్టకురే అంటఁ గాకుండెడివారు
తొలరమ్మ బాలులకు దోసమందురు
కలికి యీ తిరువేంకటపతిఁ గదిసిన
చెలఁగి వేగమే చీరచిక్కీనట

రేకు: 0073-2 శ్రీరాగం సం: 05-248

పల్లవి: కొప్పుతావి సారెసారె కుప్పళించవలసి
అప్పటి నీ మారుమొగమయ్యేవాతనికి

చ. 1: భారపు నీ గుబ్బల సంపద చూపవలసి
వోరగా నొరగుమీఁద నొరగేవు
తోరపు నీకన్నుల యేతులె చూపవలసి
సారెకు చూపులఁ బగచాటేవాతనిని

చ. 2: తట్టెడి నీమట్టెలమోఁతలు చూపవలసి
పట్టఁబట్టఁ గానే పుష్పరిగెక్కేవు
వట్టి నీకోపాన చెలువము చూపవలసి
పెట్టినహరముల గుంపెనలఁ దీసేవు

చ. 3: తొయ్యలి నీ మేని మృదువు చూపవలసి
కయ్యపు వేంకటపతిఁ గౌఁగిలించేవు
చయ్యననే నీ సరసము చూపవలసి
చయ్యాటములనె యిట్టె జంపులనేచేవు

రేకు: 0073-3 ఆహిరి సం: 05-249

పల్లవి: కాల కడఁ దెగెఁ జెలియగర్వంపు దాలిములు
కాలగతి యిఁకనెంత గాఁగలదొ మీఁద

చ. 1: బలుపుఁ దురుమరజాతి పగలుచీఁకట్లాయె
పాలయుఁగన్నీట నిప్పులు గురిసెను
చలితాపమున శశియు సవితుండుఁ గవఁబొడచె
ఇల మదనదైవికం బెటుగాఁ గలదొ

చ. 2: చెడుగు నిట్టూరుపుల చిచ్చు గాలియుఁ గూడె
వెడగుఁ జెమటల జలధి వెల్లివిరిసె
కడుఁబులకలనె శిథిలి కన్నచోటనె పొడమె
సుడిసి చెలిసిగ్గెట్ల చూరఁబోఁగలదో

చ. 3: భామకుచముల మీఁదఁ బ్రతిచందురులు వొడచె
చీమ దొంతర లతలఁ జిగిరించెను
వామాక్షి వేంకటేశ్వరుకౌఁగిటను గలసె
ప్రేమమిఁక నిదియెంత పెద్దగాఁగలదో

రేకు: 0073-4 శ్రీరాగం సం: 05-250

పల్లవి: ఇచ్చకాలు రమణికి నెంత చేసేవు నీ-
ముచ్చిమిసేఁతలిన్నియు మూసేటి కొరకా

చ. 1: బెట్టుగఁ బెద్దతురుము పెట్టేననుచు నింతి-
తట్టుపుణుఁగునెరుల తలదువ్వేవు
గట్టిగ నెవ్వతెఁ గూడో కొఁగిటఁదెచ్చిన నీ-
తట్టుపుణుఁగుల తావి దాఁచేటికొరకా-

చ. 2: గబ్బివై నీపదకము గట్టేననుచుఁ జెలి-
గుబ్బల మించుఁజెరఁగుకొంగు దీసేవు
వుబ్బున నెక్కడనో వుండి నీవిదె వచ్చిన-
దెబ్బలవాట్ల తప్పు దీరేటికొరకా

చ. 3: ఇప్పుడిట్లనే విడెమిచ్చేననుచు నీవు
కప్పురము ఘనముగఁ గడునిచ్చేవు
అప్పుడె శ్రీ తిరువేంకటాద్రీశ యీా యింతి
చొప్పుదప్ప రతిఁగూడి చొక్కించుకొరకా

రేకు: 0073-5 ఆహిరి సం: 05-251

పల్లవి: వద్దు మమ్మింత నెవ్వగల వలయించ నిటు
పొద్దువొద్దునకు నోపుదుమా వోరి

చ. 1: బీరమున నిన్ను వలపించుకొన నేమంత-
వారమా వట్టిగరువములు గాక
నేరుపే కలిగినను నీచేఁతలకు నింత
దూరుచును కాఁకఁ గందుదుమా వోరి

చ. 2: కన్నులనె వలపు చిలుకఁగఁ జూడ నేమంత-
కున్నారమా నీవుదుటు గాక
వన్నెలను నిన్ను నేవలపింతునైన నీ-
వున్నవిధమిటు చూడనోర్తుమా వోరి

చ. 3: నీ నేరములు దక్కె నీకు నినుఁ బాయఁగల-
నైన నేనిట్టవుదు నటరా
కోనేటిరాయ తక్కులుమాని మచ్చికల-
నూని నాకౌఁగిటనె వుండరా వోరి

రేకు: 0073-6 శ్రీరాగం సం: 05-252

పల్లవి: మామనునేతు మాగతవానసి
కాముకవిద్యాకల చలరే

చ. 1: భిల్లవధూకుచపీడన కుతుకో-
త్ఫుల్లకరాంబుజ భూషణ
పల్లవ గోపక పరివృత శరజన-
వల్లభ రతిపరవశ చలరే

చ. 2: గోపీజన కుచకుంకుమ పంక వి-
లేపన మిళిత లలితదేహ
తాపకరణ సంతత బహువినయా-
లాప రూపమేళన చలరే

చ. 3: పరవనితామణి పరతంత్రత్వాఽ
త్పరుష నఖాంకిత పతిరసికిమ్
కురవకభూరుహ కుంజగృహంతే
తిరువేంకటనగాధిప చలరే

రేకు: 0074-1 శుద్ధదేశి సం: 05-253

పల్లవి: కానరటె పెంచరటె కటకటా బిడ్డలను
నేను మీవలెనే కంటి నెయ్యమైన బిడ్డని

చ. 1: బాయిటఁ బారవేసిన పాలు వెన్నలును
చేయివెట్టకుందురా చిన్నిబిడ్డలు
మీయిండ్లు జతనాలు మీరుసేసికొనక
పాయక దూరేరేలే ప్రతిలేని బిడ్డని

చ. 2: మూసిన కాఁగుల నేయీ ముంగిటి పెరుగులూ
ఆసపడకుందురా ఆడేబిడ్డలు
వోసరించి మోసపోక వుండలేక మీరు
సేసేరింతేసి దూరు చెప్పరాని బిడ్డని

చ. 3: చొక్కమైన కొప్పెరల జున్నులు జిన్నులును
చిక్కినవిడుతురా చిన్నిబిడ్డలు
మిక్కిలి పూజలు నేసి మెచ్చించఁ దగదా
యెక్కువైన తిరువేంకటేశుఁడైన బిడ్డని

రేకు: 0074-2 కాంబోది సం: 05-254

పల్లవి: పేగుల జంద్యాలు వేసి పెంచపునమలిపురి
పొగగాఁ జుట్టిన నాబాఁపనయ్య వీఁడివో

చ. 1: బిత్తలై పరువులిడి పిన్నబోడితలతోడ
కొత్తబొమ్మచారియై గోఁచిగట్టెను
నెత్తురుదానమునేసి నిండిన జడలతోడ
బత్తుఁడైన చక్కని నాబాఁపనయ్య వీఁడివో

చ. 2: కలివిద్యబాఁపనిచేఁ గలిచె నేరుపులెల్ల
గుఱుతుబాఁపనిఁ గనెఁ గొడుకుఁగాను
తటితోడ సందెపొద్దు దప్పనీక జలధిలోఁ
బలుపుగాఁ బండిన నాబాఁపనయ్య వీఁడివో

చ. 3: పచ్చియిల్జి తోలుచొచ్చి బడలి చొరనిచోటు
చొచ్చి తెచ్చె వేదాలు చూడరమ్మా
మచ్చిక వేంకటగిరి మరిగి నాకౌఁగిట
పచ్చనిదోపతి నాబాపనయ్య వీఁడివో

రేకు: 0074-3 సామంతం సం: 05-255

పల్లవి: ఏకాలమేది దనకెట్ల సుఖమైయుండు -
నాకాలవశతఁ దానట్లుండవలనె

చ. 1: బలువియోగాగ్ని దలఁపంగ నెట్టిదొకాని
చలిగాలి యెండనుచు జాలిఁ బడవలనె
వలరాజుకోపమెటువంటిదో పడఁతులకు
తలిరాకు చేఁదనుచుఁ దలపోయవలనె

చ. 2: భావంబు తలపోఁత బలిమెట్టిదోకాని
నోవి దోఁపనిచోట నొచ్చెననవలనె
ఈ విరహపరితాపమిఁకనెట్టిదో కాని
కోవిలల కూఁతలకుఁ గోపించవలనె

చ. 3: తిరువేంకటేశుకృప తియ్యమెట్టిదొ కాని
చిరునవ్వు మోవిపైఁ జెరలాడవలనె
సురతసౌభాగ్యముల సొంపులెట్టివొ కాని
మురిపెంపుఁ గనుచూపు ముయ్యఁగావలనె

రేకు: 0074-4 శంకరాభరణం సం: 05-256

పల్లవి: అప్పుడు మజ్జనమాడీనంగనఁ గూడి
కుప్పలుఁ దెప్పలుగాఁ గుమ్మరించరో

చ. 1: బంగారుకొప్పెరల పన్నీరు నించి
రంగైన పచ్చకప్పురపు ధూళొత్తి
చెంగటఁ గస్తూరిధూళి చికిలి గావించి
పొంగారుఁదట్టుపుణుఁగు పోయరో గిన్నెలను

చ. 2: పటికంపు గాఁగుల పరిమళాలెల్లా
ఘటియించి కుంకుమతోఁ గడు మేదించి
అటునిటు గొజ్జంగనీరందంద నించి
కుటిలకుంతలులు పైఁగుమ్మరించరో

చ. 3: బలుపింగాణులఁ గదంబము గంధమును
కలపము గావించి గంబూరముతో
వెలయ మజ్జనమాడీ వేంకటాద్రివిభుఁడు
చెలఁగి యింతులు చేరి సేస చల్లరో

రేకు: 0074-5 భూపాళం సం: 05-257

పల్లవి: కలిమి నిందరిని దగ్గరుకొరకే- వీఁడె
సులభుఁడై తిరిగీని చూడరమ్మా

చ. 1: భంగపెట్టి గొల్లవారి పాలువెన్నలు
దొంగిలించు కొరకే తోవలనెల్లా
చెంగలించి చేతులెత్తి చెలఁగుచును- వీఁడె
దొంగ దొంగ తిరిగీని తోలరమ్మా

చ. 2: గుట్టుదీర రేపల్లెకొమ్మలనెల్లా
రట్టుసేయుకొరకే రచ్చలనెల్ల
గట్టిగాఁ జాటెడి మొలగంటలతోడ- వీఁడె
చుట్టపుబాలునివలెఁ జూడరమ్మా

చ. 3: చెప్పరాని తనమాయచేత నిందరినిఁ
గప్పెడికొరకే వేంకటవిభుఁడు
కప్పెడి నల్లనియలకలనుదురు-వీఁడె
గుప్పెడి ముద్దులు యెత్తుకొనరమ్మా

రేకు: 0074-6 ఆహిరి సం: 05-258

పల్లవి: వలతునందువు నాకు వడినెప్పుడును నేఁ-
డెలమి నొకచో భావ మెట్లుండె నీకు

చ. 1: బరువైన మదనతాపంబునకు వెరవకిటు
పురవేదనలను నేఁబొరలఁగాను
సరసమున నీవచట సతులకౌఁగిటనుండి
యిరవుకొననపుడు మనసెట్టుండె నీకు

చ. 2: వదలిన తురుముతోడ వాడువదనముతోడ
వొదిగినేనిటు చింతనుండఁ గాను
సదమదముగాఁగ నొకసతిని గౌఁగిటి రతుల-
గదియంగఁ జిత్తమేగతి నుండె నీకు

చ. 3: జమలి మొలనూళ్ళతో జవ్వాదిమేనితో
నమరి యీరీతి నేనలరఁగాను
కొమరొందఁ గూడితివి కోనేటిరాయ నీ-
తమకమెందాఁక నెంతటినుండె నీకు

రేకు: 0075-1 ముఖారి సం: 05-259

పల్లవి: చెప్పరాదీయింతి సిరులు - దీని -
వొప్పులిన్నియుఁ జూడ వొరపులోకాని

చ. 1: ముదితజఘనముమీఁది మొలనూలిగంటలవి
కదలు రవమెట్లుండెఁ గంటిరే చెలులు
మదనుఁడుండెడి హేమమందిరము దిరిగిరాఁ
గదిసి మ్రోసెడి పారిఘంటలో కాని

చ. 2: కొమ్మపయ్యెదలోని కుచమూలరుచి వెలికిఁ
జిమ్మటది యెట్లుండెఁ జెప్పరే చెలులు
యిమ్మైన మరుధనములెల్ల రాసులు వోసి
కమ్ముకొని చెంగావి గప్పిరో కాని

చ. 3: నెలతకంఠమునందు నీలమణిహరములు
అలరుటెట్లుండు కొనియాడరే చెలులు
లలితాంగి ప్రాణవల్లభుఁడు వేంకటవిభుఁడు
నెలకొన్న కౌఁగిటనె నిలిచెనో కాని

రేకు: 0075-2 ఆహిరి సం: 05-260

పల్లవి: మానసీఁడు వుంటినోవి మరఁది వీఁడే
నూనముపైఁ జేయి చాఁచీ మందవారిమరఁది

చ. 1: మంచమెక్కి వావిచూచీ మరఁది వీఁడే
మంచినీటి చెలమల మరఁది
మంచు గుంచానఁ గొలిచే మరఁది వీఁడే
పించెపు శిరసు పొగ పిన్ననాఁటి మరఁది

చ. 2: మంద మిరియాలు చల్లే మరఁది వీఁడే
మందు నూరీ మాటలనే మరఁది
మందుమాయసేఁతల మరఁది వీఁడే
కుందణపు వన్నెదట్టి కొంగు జారే మరఁది

చ. 3: మక్కళించే వలపుల మరఁది వీఁడే
మక్కువ నాకౌఁగిట మరఁది
మక్కువలఁ గరఁగించే మరఁది వీఁడే
చిక్కె వేంకటాద్రిమీఁది చిన్ననాఁటి మరఁది

రేకు: 0075-3 సామంతం సం: 05-261

పల్లవి: చెలువపు సేఁతల శిన్నెకా పెద్ద
వలపువేదనల వాడీనయ్యో

చ. 1: మొగమునకెగరెడి మొనవాఁడి గుబ్బల-
చిగురుఁబెదవులాఁడి శిన్నెకా
నిగనిగ మెరిచేటి నీలిమేనివానిఁ-
సొగసు చూచి వాని సొలశీనయ్యో

చ. 2: మొగ్గల మొలకల మురిపెపుఁ గన్నుల-
శిగ్గుల చిరునవ్వు శిన్నెకా
ఉగ్గున రేపల్లె వుసురు గొనేటివాని
దగ్గరి తమకానఁ దడవీనయో

చ. 3: చంకల బంగారు చల్లిన మెఱుఁగుల
చింకబెదరులాఁడి శిన్నెకా
వేంకటపతిఁ గూడి వేడుక తోడుత
సుంకుల సోగల సొలశీనయ్యో

రేకు: 0075-4 శ్రీరాగం సం: 05-262

పల్లవి: మరుని నగరిదండ మాయిల్లెఱఁగవా
విరుల తావులు వెల్లవిరిసేటి చోటు

చ. 1: మఱఁగు మూఁక చింతల మాయిల్లెఱఁగవా
గుఱుతైన బంగారుకొండల సంది
మఱపు దెలివి యిక్క మాయిల్లెఱఁగవా
వెఱవక మదనుఁడు వేఁటాడేచోటు

చ. 2: మదనుని వేదంత మాయిల్లెఱఁగవా
చెదరియు జెదరని చిమ్మఁ జీఁకటి
మదిలోన నీవుండేటి మాయిల్లెఱఁగవా
కొదలేక మమతలు కొలువుండేచోటు

చ. 3: మరులుమ్మెతల తోఁట మాయిల్లెఱఁగవా
తిరువేంకటగిరిదేవుఁడ నీవు
మరుముద్రల వాకిలి మాయిల్లెఱఁగవా
నిరతము నీ సిరులు నించేటిచోటు

రేకు: 0075-5 ఆహిరి సం: 05-263

పల్లవి: ఏందాఁకా జాగిది యేలే- తన-
అందములచటనె అయ్యీఁగాక

చ. 1: మృగమదమీతఁడు మెత్తీనిదె మై
ధగధగమనఁగాఁ దనకేలే
మగువకుచముల చెమట నంటిన యా-
పొగరుఁ బరిమళమె పూసీఁ గాక

చ. 2: బెడిదపుఁ దురుమిదె పెట్టీనీతఁడు
తడవుగ నలరులు తనకేలే
పడఁతి శిరసునను పైపైఁ జెరిగిన-
జడివాన విరులు జారీఁ గాక

చ. 3: చిమ్ముచు వీడెము సేసీనీతఁడు
తమ్ములముమియఁడు తనకేలే
కొమ్మ వీడెమిఁక కోనేటప్పఁడు
తమ్మివదనమున దాఁచీఁ గాక

రేకు: 0075-6 శ్రీరాగం సం: 05-264

పల్లవి: బిగ్గెఁ గాఁగలించుకోవే పిరితీయక
నిగ్గుల యాతనిమేను నేఁడే నొచ్చీనా

చ. 1: మందరమెత్తినవాఁడు మల్లుల మొత్తినవాఁడు
అందపు నీ గుబ్బల వేఁగాన లేఁడా
గొందినున్న కుచములు కొనవాండ్లైతేను
చెందిన యాతనిమేను చిల్లులయ్యీనా

చ. 2: భూమెల్ల మోఁచినవాఁడు పొడవు దాఁచినవాఁడు
భామ నీ మొలనూలు భారమనీనా
వోమక యాతనితోడి వుపరిసురతానకు
యేమని వేఁడుకొనిన యేల లోఁగేవే

చ. 3: వేంకటనగమువాఁడు వెన్నెలమొగమువాఁడు
కింకల నీ చేఁతలకుఁ గిందుపడీనా
పంకజవదన నీకుఁ బాయలేక చెనకిన
కుంకుమగుబ్బల చెనకులకోపఁడా

రేకు: 0076-1 దేశాక్షి సం: 05-265

పల్లవి: అవ్వలిమాటలే హితవవుఁగాక
రవ్వలై నీకింక నిందు రాఁదీరునా

చ. 1: మందలించి మధురలో మగువల మాటలే
విందుగాక చెవులకు విందులుగాను
మందల మగువుల మా మాటలు చెవులకు గో-
విందుఁడా మాసుద్దులిఁక వినఁదీరునా

చ. 2: వాసనగాఁ బువ్వులింటివారతోడి పొందులే
సేసి నీవు మమ్ము నీవు చెనకే వింక
దోసాలు గావుగద మాతోడి పొందులివి శ్రీని-
వాసుఁడా మాచేతలను వడదీరునా

చ. 3: మాయలు మందులుసేసే మానినుల పొందులే
రేయుఁబగలును నీకు రేసులుగాక
పాయక కూడితి నన్ను బాపురే వేంకటగిరి-
రాయఁడా మాకౌఁగిటి రట్టుకోపుదా

రేకు: 0076-2 శంకరాభరణం సం: 05-266

పల్లవి: ఇంతి భువనమోహినియైన ఫలము
కాంతునిఁ దలఁచి వగలఁ జిక్కెనిపుడు

చ. 1: మెలుఁతకన్నులు గండుమీలైన ఫలము
తొలఁకురెప్పల నీరు దొరకె నేఁడు
లలనమై నవపుష్పలతయైన ఫలము
వలపు చెమట నీట వడిఁ దోఁగె నిపుడు

చ. 2: మెఱుఁగారు నెరులు తుమ్మిదలైన ఫలము
నెఱిఁ దమ్మిమోముపై నెలకొన్నవి
పఱచు జక్కవలు గుబ్బలైన ఫలము
తొఱలి తాపపురవితోఁ గూడె నిపుడు

చ. 3: పలు వన్నెమోవి బింబమైన ఫలము
చిలుక వోట్లచేతఁ జెలువొందెను
కలికి వేంకటపతిఁ గలసిన ఫలము
సొలసినాడనె నిత్యసుఖమబ్బె నిపుడు

రేకు: 0076-3 ఆహిరి సం: 05-267

పల్లవి: ముచ్చటకెవ్వరు లేరు మోహమిది బలుదూరు
యెచ్చుట నెవ్వరులేరు యేఁటికే నాపేరు

చ. 1: మంచముపై నుండరాదు మలఁగుపైఁ బొద్దువోదు
నించిన వుయ్యెలలోనా నిద్దుర రాదు
అంచెలఁ గన్నుల నీరు ఆఁపరాదాతనిఁబాసి
యించుకంత నిలువలే నెట్లు ధరియింతునే

చ. 2: పవ్వళించేటిల్లు చూచి ప్రాణము నిలుపరాదు
దివ్వెచూచి తాలిమైనఁ దిప్పఁగరాదు
దువ్వటపుఁ బయ్యదపైఁ దోఁగిన తట్టు పుణుఁగు
పువ్వుటమ్ము బాసటమై పొక్కేనేమిసేతునే

చ. 3: చింతతో ధరించరాదు చెల్లఁ బో మేనైనఁ బోదు
ఇంతటఁ జెలులకైన యెఱుక లేదు
ఇంతలోనె వేంకటేశుఁడింతి మరుఁగుననుండి
యెంతసేసెఁ గలికి వీఁడేమని చెప్పుదునే

రేకు: 0076-4 బౌళి సం: 05-268

పల్లవి: శిన్నెక తేవే శెలువుని తా
వెన్నలు సవిగొను వెన్నుని తా

చ. 1: మూటల్ మాటల్ మూరల్ బారల్
బాటల్ సదివే బాపలు తా
వేటల్ వీపుల్ వేలుపు గుడుపుల్
తేటలు మరగిన దేవుని తా

చ. 2: వాకుల్ చీకుల్ వాదుల్ పోదుల్
సోకపు తొల్లిటి సుద్దుల్ తా
పోకులు లోకుల్ పొగడఁగ మనిపెడి
కేకిగరుల తల కిష్ణుని తా

చ. 3: బగ్గుల్ నగ్గుల్ బావుల్ సారెగా
దగ్గర వెరపగు తపసుల తా
సిగ్గుల్ వాపెడి శ్రీ వేంకటపతి-
నగ్గపు సొమ్ములయాతని తా

రేకు: 0076-5 ముఖారి సం: 05-269

పల్లవి: భావమెరఁగని పడుచా వోసి
పోవే పోవే పోవే పడుచా

చ. 1: మొరఁగు మరఁగు వింత కరఁగుదేనెల-
పరచుమాటల పడుచా
చురుకు మెరుపు వాలుఁజూపుల కన్నుల
కెరలఁ బొడిచి గిలిగించేవే పడుచా

చ. 2: కెలపు మలపుఁ బయిఁడి గిలుకుల మట్టెల-
బలుపుమోఁతల పడుచా
అలపు సొలపు ముద్దులొలుకు నవ్వుల
జలుకువలపు మీఁదఁ జల్లేవే పడుచా

చ. 3: వెదకి వెదకి తిరువేంకటేశ్వరుఁ
బదరి కూడిన పడుచా
కదలు గుబ్బల కలికిచేఁతల
పుదుటు నడపులనె వొరగేవే పడుచా

రేకు: 0076-6 శంకరాభరణం సం: 05-270

పల్లవి: దిమ్మరివలె నిటులఁ దిరుగకువే
చిమ్ముల వలపు నీపైఁ జిలికించీఁ గృష్ణుఁడు

చ. 1: మెల్లనే వుద్దాలు మెట్టి మీరిన తురుము పెట్టి
తెల్లని ముత్యాలు గట్ట తిరుగకువే
చల్లలమ్మేనంటా నీవు చక్కని గొల్లెతవు
వల్లెవేసీఁ జూపులనే వన్నెకాఁడు కృష్ణుఁడు

చ. 2: మట్టెలనే గిలుకొట్టి మణుల పెండెముపట్టి
దిట్టనడపుల వీధిఁ దిరుగకువే
జట్టిగొనుచూపుల జంకెన గొల్లెతవు
పెట్టెడుఁ జిక్కుల నిన్ను బిత్తరీఁడు కృష్ణుఁడు

చ. 3: చెక్కులదాఁకాఁ గస్తూరి చెలఁగి నొసలఁ బెట్టి
దిక్కులు చూచుచునంత తిరుగకువే
గక్కున శ్రీవేంకటాద్రి ఘనుఁడు కౌఁగిటను
చొక్కులఁ బెట్టెడి నిన్ను చూరకాఁడు కృష్ణుఁడు

రేకు: 0077-1 వరాళి సం: 05-271

పల్లవి: మోపుల చిగురుల చిమ్ముల వేదము
ఆవుల మందలలోని ఆవేదము

చ. 1: మంచముపైఁ జదివేది మరవకుమీ
కొంచెపు లేఁబలుకుల కొనవేదము
పించెపు శిరసుతోడఁ బిన్ననాఁడే చదివిన
తుంచి తుంచిన మాటల తొలువేదము

చ. 2: చల్లలమ్మే గొల్లెతల చక్కనిజంకెనలకు
గొల్లపల్లెలోన దొరకొన్న వేదము
తల్లిబిడ్డలనక యందరినొక్కవావిగా
పిల్లఁ గోవి నేరిపిన పెనువేదము

చ. 3: పంకజభవాదుల బడిబడిఁ జదివించే
లంకెలు చెలఁగిన మేలపువేదము
వేంకటనగముమీఁద వెలయ నిందిరఁగూడి
కొంకక చదివిన చొక్కుల వేదము

రేకు: 0077-2 వరాళి సం: 05-272

పల్లవి: నిండిన వేడుకలెల్ల నీకె గాక
అండనె తాపము చల్ల నమరెగా నాకు

చ. 1: మగువకన్నుల మొక్కు మట్టెల పాదపుఁ దొక్కు
నిగుడు వాతెరనొక్కు నీకె కాక
అగడునెరుల చిక్కు అరచేతిపై చెక్కు
వగల గుక్కును మిక్కు వన్నెగా నాకు

చ. 2: తొయ్యలిఁ గూడినరట్టు తుదచెమటల మెట్టు
నెయ్యపుమాటల గుట్టు నీకె కాక
పయ్యద జారినకట్టు భారంపు నొసలిపట్టు
కయ్యపుటలుక తిట్టు గలిగెఁగా నాకు

చ. 3: మొగలిపువ్వులతావి ముంచినకన్నులకావి
నిగనిగ నగుమోవి నీకె కాక
సగము జారిన నీవి చనవుల నీదేవి-
నగుట వేంకటేశ నేఁడబ్బెఁగా నాకు

రేకు: 0077-3 శ్రీరాగం సం: 05-273

పల్లవి: ఆలవట్టములు వట్టేరవధరించఁ గదో పెద్ద-
పాలిండ్ల బరవున భామ బడలితివి

చ. 1: మజ్జనమవధరింతు మగువ విచ్చేయవో
గొజ్జంగ కస్తూరినీటఁ గుంకుమనీట
గజ్జల గరుడునిపై కలికి విభునిఁ గూడి
ముజ్జగములఁ దిరిగి మొగినలసితివి

చ. 2: బోనము వెట్టినారిదె పొలఁతి విచ్చేయవో
ఐనకూరలెల్లఁ జల్లనారీనిదే
తేనెలూరెడి కెమ్మోవితీపులు నీ విభునకుఁ
గానుకగా నిచ్చియిచ్చి కడునలసితివి

చ. 3: చప్పరమంచముపైకి సరుగ విచ్చేయవో
అప్పఁడు వేంకటరాయఁడలరీ వాఁడే
కొప్పెరగుబ్బలమీఁది కొనగోరిరచనల
కప్పురము మెత్తిమెత్తి కడునలసితివి

రేకు: 0077-4 హిందోళవసంతం సం: 05-274

పల్లవి: జగడపుఁ జనవుల జాజర
సగినల మంచపు జాజర

చ. 1: మొల్లలు దురుముల ముడిచిన బరువున
మొల్లపు సరసపు మురిపెమున
జల్లనఁ బుప్పొడి జారఁగఁ బతిపై
చల్లేరతివలు జాజర

చ. 2: భారపుఁ గుచముల పైపైఁ గడు సిం-
గారము నెరుపేటి గందవొడి
చేరువ పతిపై చిందఁగఁ బడఁతులు
సారెకుఁ జల్లేరు జాజర

చ. 3: బింకపుఁ గూటమి పెనఁగేటి చెమటల-
పంకపుఁ బూఁతల పరిమళము
వేంకటపతిపై వెలఁదులు నించేరు
సంకుమదంబుల జాజర

రేకు: 0077-5 ముఖారి సం: 05-275

పల్లవి: పొద్దువోకలివి నీకు భువిలో నెన్నఁగ నీ-
సుద్దులు చెప్పెదమన్న చూడఁజూడఁ గొత్తలు

చ. 1: మోఁతనీటిలోని యీఁత మూఁపునఁ బుట్టిన మేఁత
మూఁతిమీఁది కత్తికోఁత మొనగోరివాఁత
బాఁతిలేని దారవోఁత పాపముచూడనిచేఁత
నాఁతిమీఁది తలపోఁత నాఁగేటిగీఁత

చ. 2: వలపు చల్లినలాగు వాజినెక్కినబాగు
వలసి నొల్లములైన వలవనిజాగు
తెలిసితిమిదెనేఁడు తిరువేంకటేశ్వర
తలఁపు ప్రాణులమీఁద- దగులుటేలాగు

రేకు: 0077-6 శ్రీరాగం సం: 05-276

పల్లవి: నేనెందు వోయె తా నెందు వోయీా
రానీలే రానీలే రానీలే

ච. 1: మీనైన నాఁటి తన మిడుకెల్ల దిగవలెకానీలే కానీలే కానీలే
చ. 2: తలచూపేనాఁటి తలఁపెల్ల దిగవలె తలఁచనీ తలఁచనీ తలఁచనీవే
చ. 3: కిరయైన నాఁటి కిటుకెల్ల దిగవలెతిరుగనీ తిరుగనీ తిరుగనీవే
చ. 4: హరియైన నాఁటి అదటెల్ల దిగవలె జరగనీ జరగనీ జరగనీవే
చ. 5: వడుగైన నాఁటి వస విడువఁగ వలె తడవకు తడవకు తడవకువే
చ. 6: కలుషించే నాఁటి కడమెల్ల దిగవలె అలుగనీ అలుగనీ అలుగనీవే
చ. 7: సతిఁ బాసేనాఁటి చల్లమెల్ల దిగవలె తతిగానీ తతిగానీ తతిగానీవే
చ. 8: ముసలైన నాఁటి ముసుపెల్ల దిగవలె విసుగనీ విసుగనీ విసుగనీవే
చ. 9: మానైన నాఁటి మదమెల్ల దిగవలె పోనీవే పోనీవే పోనీవే
చ. 10: కలికైన నాఁటి గజరెల్ల దిగవలె చెలఁగనీ చెలఁగనీ చెలఁగనీవే
చ. 11: వేడుకతో నాఁటి వేంకటపతి నన్నుఁ గూడనీ కూడనీ కూడనీవే

రేకు: 0078-1 భూపాళం సం: 05-277

పల్లవి: ఎందరు వలె నీకింకాను - యీ-
యిందరు చాలర యింకాను

చ. 1: మోహపు సతితో ముచ్చటఁ గలసిన-
దేహము మనసునిదియ కాదా
సాహసమున నది చాలక మదిలో
యీహలఁ దిరిగే వింకాను

చ. 2: కసరుల మురిపెపు గయ్యాళిసతులతో
ఆసురుసురులతో నలసితివి
కొసరుచు నాతోఁ గూటమిసేసే-
ఎసరెత్తకుమీ యింకాను

చ. 3: కాఁకల నటనల- గరగింపుచు నను
దేఁకువఁ గూడితి దిమ్మరివై
వేఁకపువలపుల వేంకటేశ నీ-
యేఁకట దీరదు యింకాను

రేకు: 0078-2 ఆహిరి సం: 05-278

పల్లవి: ఇట్టే నామదిఁ గోపమెచ్చరించేవు
వట్టి వలుపే నాపై వారించ వలెనా

చ. 1: మోహపు సంకుటుంగరముల వెలిగోర నా-
దేహముపై నునురేక దియ్యఁజూచేవు
సాహసివిరా వోరి వెచ్చపు నీవలపులోని-
దాహమెల్లా నాతోనే యింతటఁ జూపవలెనా

చ. 2: తళుకుబంగారంచుల దట్టి చీరకొంగుఁ
లలర నీమేను నాపైనప్పళించేవు
వలదు వోరి వెచ్చపువలపు నీదెల్లాను
పలుమారునిట్ల నాపైఁ బూయవల నా

చ. 3: సన్నపుమణుల కుప్పెనసవరము కొప్పు నా-
కన్నులు దాఁకఁగ నాపైఁ గడు వీఁగేవు
కన్నుల కలికి వేంకటరాయ నీకౌఁగిటి
వన్నెలెల్ల నాపై నిటువలెఁ జేయవలెనా

రేకు: 0078-3 శ్రీరాగం సం: 05-279

పల్లవి: ఉండవద్దా యిటువంటి వొడికాలను చను-
గొండలపై నుదయించెఁ గొండుక చందురుఁడు

చ. 1: మింటిమీఁది చందురుఁడు మేదినిపై కలువల
నంటు సేసెనట యేఁటి నాటకములే
కంటిచూపు కలువల కలకకోరిచెఁ బైఁడి-
వంటిమేని జవరాలి వదన చందురుఁడు

చ. 2: జలధిలో జనియించి చందురుఁడె పగలాయ
జలజములకు నేఁటి శాంతములే
మెలుఁతమోమై నేఁడు మెత్తనికరతలము-
జలజానఁ బవళించెఁ జక్కని చందురుఁడు

చ. 3: చింకచందురుఁడు కందుఁజీఁకటి మైచీఁకటే
యింకఁజేసి పారఁదోలీనేఁటిపొందులే
వేంకటేశుని కౌఁగిట వెలఁదిమోమై నేఁడు
వంక నెరిచీఁకటి వలఁచె జందురుఁడు

రేకు: 0078-4 దేవగాంధారి సం: 05-280

పల్లవి: ఎంతటివాఁడవు నిన్ను నేమందును యిట్టె
సంతమైతివింతితోడ చాలదా నీకు

చ. 1: మాణికపుటుంగరాల మగువ దా వాయించేటి-
వీణలోనే చల్లీఁ దనవిరహమెల్లను
ఏణనయన నింతేసి యెలయించినట్టి నీ-
జాణతనమె యింత చాలదా నీకు

చ. 2: గిలుకుఁగంకణముల కీరవాణి కిన్నెరలో
కులికీనిదె పై కోపమెల్లాను
సొలపుఁ జూపులనిట్టే సుదతినింతేసి నీ-
చలము సాదించితివి చాలదా నీకు

చ. 3: కుంకుమగుబ్బలతోడి కోమలిచెక్కు చెమట-
వంకనే వచ్చీ నీపై వలపెల్లను
వేంకటగిరిరమణ వేడుక నీలలితాంగి
సంకెదేరఁ గూడితివి చాలదా నీకు

రేకు: 0078-5 శ్రీరాగం సం: 05-281

పల్లవి: పువ్వుగట్టినట్టి మేన- బుక్కిలించీఁ జెమట నీ-
జవ్వనపు మదమెపో చలపట్టిని

చ. 1: మోలకనవ్వు చిగురుమోవి మోపనీక నీ-
పలుకుఁ గోవిలలె పో పగచాటీని
తిలకపుమోమునకుఁ దేంట్ల రానీక నీ-
యలకల చెదరె పో యదలించీని

చ. 2: చనవున నీముఖచందురుని వంక నీ-
చనుజక్కవలె పో చాడిచెప్పీని
మనసు చీఁకట్ల నీమదనతాపపుఁ జింత
కనుఁగవలె పో గాదెఁబోసీని

చ. 3: దటపుఁ దమకపు మైదావానలానకు
నిట్టూపురులె పో నీడవెట్టీని
గుట్టుతోనుండిన కూరిమిపంపులే పోనీ-
పట్టపు వేంకటపతిఁ బట్టి తెచ్చీని

రేకు: 0078-6 భూపాళం సం: 05-282

పల్లవి: ఇన్నిచేఁతలును జేసెనిందుకొరకే - వీఁడు
కన్నులనె పొద్దుపుచ్చీఁ గదవె నీకొరకే

చ. 1: మీనమాయఁ జెమటల మేను ముంచుకొరకే
తానే కమఠమునాయ దాఁగుకొరకే
ఆనుకొని కిటియాయ నదలించుకొరకే
మానఁడు కంబముచాటు మారుమోముకొరకే

చ. 2: కాలుచాఁచె నేలమీఁద గమనించుకొరకే
జాలిఁబెట్టె చేఁతలనే చంపుకొరకే
యేలికాయ విరహులనేఁ పెడికొరకే
శైలమెత్తె నీకుచములెత్తే కొరకే

చ. 3: కలవెల్ల నిరసించేఁ గదవె నీకొరకే
కలికియాయెను నీసంగతికొరకే
వలపుల వేంకటేశ్వరుఁడు లోకమున
చెలువముతో మెరసెను నీకొరకే

రేకు: 0079-1 కేదారగౌళ సం: 05-283

పల్లవి: రమ్మనవే వాని రమ్మనవే- యీా -
తమ్మికనుఁగొనల తళుకులవాని

చ. 1: మెలుపున నేను మేడమీఁద యీా-
చిలుకఁ బేరుకొని పిలువఁగను
అలపున వీధిఁ దానరుగుచును తనుఁ
బిలిచితినంటాఁ బలికినవాని

చ. 2: కేరడమైన కిన్నెరలో యీా-
నారణి ముట్టుచు నలుగడను
చేరువల తాఁజెలఁగుచును యిటు
పేరుకొనుచు ననుఁ బిలిచినవాని

చ. 3: పరవశమై నేఁ బానుపున యీా-
గిరికుచముల నొడ్డగిలఁగాను
తిరువేంకటఘనగిరిపతి ననుచును యీా-
సిరులుగ నననిటు చెనకినవాని

రేకు: 0079-2 ముఖారి-అటతాళం సం: 05-284

పల్లవి: చేయరాని చేఁతలెల్లఁ జేసితివి యింత
పాయరాని సతిమీఁద భయము నీకెట్టిదో

చ. 1: ముత్తేల పెండెమిది ముదితది ఆ-
గుత్తపుఁ బాదమునకుఁ గొలఁదైనది
బిత్తరపు ముంజేతనే పెట్టితిని యీా -
మత్తగజగమనపై మన్నన నీకెట్టిదో

చ. 2: కుందనంపు మట్టెలివి కోమలివి మోఁత-
లందెలతో జగడించనందమైనవి
యిందు నీకు నుంగరాలై యేచినవి యీా-
యిందుముఖి మీఁది మోహమెంత నీకునెట్టిదో

చ. 3: గట్టివలిపెపు చంద్రకాని యిది యింతి
కట్టి విడిచిన నేఁటికమ్మఁదానిది
కట్టి కాసించితివి వేంకటరాయా యీా -
బెట్టైన చెలిమీఁదిప్రేమము నీకెట్టిదో

రేకు: 0079-3 ముఖారి సం: 05-285

పల్లవి: సెల్లునంటా నేమైన చేయవచ్చేవు నే-
నొల్లనిన్ను సక్కసాయ నుండేవో వుండవో

చ. 1: మేసవారి పిన్నదాని మేకుసేసి యింటిలోనఁ
దోసుకొంటివెఱఁగవా దుండగీఁడ
ఆసలఁ బెట్టేవు నన్ను నట్టనే యింతేసి
వేసాలఁబోక కొంగు వీడేవో వీడవో

చ. 2: పాయపు వలపులనే పైడివంటి గొల్లెతల
సాయంపంపి తొలఁగవా సటకాఁడ
మాయల- బెట్టుచు నీవు మంచునీరు కుంచాలఁ
బోయుచు నన్నేఁపక పోయేవో పోవో

చ. 3: గాఁటమైన గుబ్బల చక్కనిదాని నమ్మనంటా
ఆఁటదాని బాగొనేవడవిలోనే
నాఁటకపు వేంకటేశ నన్నుఁ గూడితివి యిట్టె
మాఁటనెందూనాడక మానేవో మానవో

రేకు: 0079-4 ఆహిరి సం: 05-286

పల్లవి: ఇన్నియుఁ జేసితివిఁకనేలా నీ-
చిన్నినగపు మూసెర నీచేఁత

చ. 1: మఱవకురా నీమాటలు ని-
న్నెఱుఁగుదు నిన్నియు నిఁకనేలా
మొఱఁగకురా నీమోహము నా-
చెఱఁగు మాసెనిదె చెల్లె నీచేఁత

చ. 2: చిందకురా నీ చెలువములు ఇపు-
డిందరునున్నారిఁకనేలా
కందకురా నీ కాఁకలను యిటు
కిందుపడితినిదె గెలిచె నీచేఁత

చ. 3: నొంపకురా నే నొగులఁగా నీ-
యింపులు నెరపేనిఁకనేలా
జంపుల వేంకటశైలపతీ నా-
కెంపుమోవి దక్కెర నీచేఁత

రేకు: 0079-5 బౌళి-ఏకతాళి సం: 05-287

పల్లవి: ఎవ్వరు గలరమ్మ యిఁక నాకు
నెవ్వగలలోఁ జిత్తము నెలకొన్నదిపుడు

చ. 1: మనసుకోరిక దీని మానిపెదనంటినా
వొనగూడి మనసు నావొద్దలేదు
పెనఁగి తమకము వా పెదనంటినా మేన
అనయమువెరవు దానై యున్నదిపుడు

చ. 2: చింత తాలిముల ముంచెదనంటినా మేన
సంతాపములు సేయఁ జలపట్టెను
అంతరంగము నాదియంటివా నెలపున
సంతతమునాతఁడే జట్టిగొనె నిపుడు

చ. 3: సింగారపుమేను నాచేతికి లోనంటినా
అంగవించి పరవశమై యున్నది
యింగితమెరిఁగి వేంకటేశుఁడు నాకంటినా
కంగి నన్నుఁ గారించి కలసెనిపుడు

రేకు: 0079-6 వరాళి సం: 05-288

పల్లవి: వెలయు నీకల్యాణవేదిగా మతినుండి
కలికి జవ్వనపు యాగము సేసెనతఁడు

చ. 1: మలయు నీనాభిహోమపు గుండమునను
నెలకొన్న విరహగ్ని నిండాఁ బోసి
పొలయు నీ నిట్టూరుపుల విసరుచును
వొలుకుఁ జెమటల నాహుతి వోసె నతఁడు

చ. 2: కదిసి నీనెన్నడిమి గగనమునందు
పొదలిన యారనే పొగ నిండఁగా
మదిరాక్షి నీమంచి మానపుఁ బశువు
నదనెరిఁగి వేలిచె నతివ నీకతఁడు

చ. 3: కాటుకకన్నుల నిన్నుఁ గడునలయించి
బూటకముల చిటిపొటి సిగ్గుల
గాఁటపుఁ గరుణ వేంకటగిరివిభుఁడు
కోటిహోమము సేసెఁ గూడి నిన్నతఁడు

రేకు: 0080-1 శ్రీరాగం సం: 05-289

పల్లవి: అంజలిరంజలిరయం తే
కిం జనయసి మమ ఖేదం వచనైః

చ. 1: మాం కిం భజనే మయా కింతే
త్వం కోవా మే తవ కాహం
కిం కార్యమితో గేహే మమ తే
శంకాం వినా కిం సమాగతోసి

చ. 2: నను వినయోక్తేర్న యోగ్యాహం
పున: పునస్త్వం పూజ్యోసి
దినదిన కలహవిదినా తే కిం
మనసిజజనక రమారమణ

చ. 3: దైవం బలవత్తరం భువనే
నైవ రోచతే నర్మ మయి
ఏవమేవ భవదిష్టం కురు కురు
శ్రీవేంకటాద్రి శ్రీనివాస

రేకు: 0080-2 సామంతం సం: 05-290

పల్లవి: విరహన నినుఁబాసి వేఁగేను
తరుణి నేను నిన్నుఁ దప్పఁ దోయఁగలవా

చ. 1: మున్ను నీవు రేపల్లెను ముచ్చిలించుకొన్న పాలు-
వెన్నలునారగించి విఱ్ఱవీఁగేవు
సన్నపు నడిమితోడి జవ్వనాన నలయుచు-
నున్నదాన నీతోడ నోపుదునా పెనఁగ

చ. 2: నేరుపునఁ బాలజలనిధిలో నమృతమెల్ల-
నారగించి లావున నన్నుప్పళించేవు
బీరమునఁ జిగురాకుఁ బెదవితోఁ గనుచూపు-
గూరిమి నేనుఁ డి నిన్నుఁ గుచ్చి పట్టఁగలనా

చ. 3: గుద్దలించి దనుజుని గోరఁ జెనకిన నిన్ను
అద్దలించి చెనక నీయంతదాననా
గద్దరివి తిరువేంకటగిరివిభుఁడ నీ-
నిద్దపుఁ గస్తూరిమేను నేనాఁగగలనా

రేకు: 0080-3 ముఖారి సం: 05-291

పల్లవి: ఎక్కడిదిఁకఁ బరిణామము యీమదనానలమునఁ బ్రియ-
మెక్కుడు దోఁపఁగ దైర్యంబింతయుఁ దీరెడిని

చ. 1: మనసునఁదలఁచినతలఁపులు మాటల వెడలఁగ నాడిన
గొనకొని కన్నుల నీళ్ళు గుత్తుకవట్టెడిని
కనుఁగవ చూచినచూపులు కౌఁగిటఁ జేర్పఁగఁ బోయిన
పనివడి హృదయంబంతయుఁ బరవశమయ్యెడిని

చ. 2: తనువున నాటినమాటలు తప్పక మతిఁ జింతించిన
అనువుగనది పరితాపంబై పెరరేఁ పెడిని
వెనకదినంబుల కూటమి వేడుకలని తలపోసిన
పెనగొన పూఁటకుఁ బూటకు ప్రేమము పెరిగెడిని

చ. 3: తిరువేంకటగిరినాథుని దేవోత్తముఁ గూడిన మది
యెరగొని దేహవికారములెరవై తోఁపెడిని
పరమాత్మునికరుణారస పానము సేసిన జిహ్వకు
అరుదుగ నితరపదార్థములన్నియు రోసెడిని

రేకు: 0080-4 శ్రీరాగం సం: 05-292

పల్లవి: తానట ప్రాణేశుండట తమకము తమకముఁ గూడఁగ
వేనలి జారినఁ దలఁకని వేడుకలెట్టివొకో

చ. 1: మీఁటినఁ బగిలెడిగుబ్బలమీఁద నలందిన గందపు-
వేటులతళుకులు పయ్యెద వెలుఁపలఁబొలయఁగను
నాఁటిన మదనుని శరముల నలఁకువనొయ్యన తోఁపఁగ
మాటకు మాఁటాడదు చెలిమర్మంబెట్టిదొకో

చ. 2: మించిన తొడల మెఱుంగుల మెలుఁతుక గట్టిన పుట్టము
చించుక వెడలిన నిగ్గులు సిగ్గులు దొలఁకగను
వంచినరెప్పల కన్నుల వడియు జలంబులు చెక్కుల
నించినఁ బలుకనిభావపు నెవ్వగలెట్టివొకో

చ. 3: కమ్మనితావుల చెమటల గాలికి నొయ్యన మెచ్చుచు
సొమ్మలఁదేలెడి మరపుల సొక్కులఁ దేలుచును
దిమ్మరికోనేటప్పని తిరువేంకటపతిఁ గూడిన
కొమ్మకు మీఁదటియాసల కోరికలెటివొకో

రేకు: 0080-5 నాదనామక్రియ సం: 05-293

పల్లవి: మలసిన తుమ్మిద మగవాఁడు
నిలిచి నాకు వెరవ నీకేలయ్యా

చ. 1: మగువలు సురతపు మఱపునఁ గుచములఁ
దగిలిన రేకలతరిఁ జెలఁగి
పగటున సిగ్గులు పడుదురుగాకిటు
నిగిడిన సిగ్గులు నీకేలయ్యా

చ. 2: వనితలు రతిపరవశమున మురిపెపు-
కనుఁగవచూపులఁ గరఁగుచును
జునుగుల చూపులు చూతురుగాకిటు
యెనసినెనయములు యిఁకనేలయ్యా

చ. 3: లోలో మముబోంట్లు వనితలు వగఁ
దూలుచు జడమౌదురు గాక
తేలించితి రతి తిరువేంకటపతి
నాలికాఁడ నీనగవేలయ్యా

రేకు: 0080-6 దేశాక్షి సం: 05-294

పల్లవి: ఏడనున్నదో యీతరుణి
చూడక చూచిన చూపులలోన

చ. 1: మేఁతలు మరిగిన మీల పిల్లలకు
నీఁతలు నేరిపి యీతరుణి
కాఁతాళించిన కన్నుల నీళ్ళ
చేఁతల నిండిన చెరువులలోన

చ. 2: ముత్తెపునవ్వుల మురిపెపుఁ బువ్వుల
యెత్తులెకట్టి యీతరుణి
లత్తిక మోవికి లంచముగా పై
మెత్తిన దంతపు మెరుఁగులలోన

చ. 3: పసని చీఁకట్ల పలుమరుఁ దవ్వి
యిసుక పాఁతరలె యీతరుణి
కసిగాట్ల వేంకటపతి కౌఁగిట
రసములొలుక నేరములెన్నుచును

రేకు: 0081-1 లలిత సం: 05-295

పల్లవి: తెప్పగా మఱ్ఱాకుమీఁదఁ దేలాడువాఁడు
ఎప్పుడు లోకములెల్ల నేలేటివాఁడు

చ. 1: మోఁతనీటి మడుగులో యీఁతగరచినవాఁడు
పాఁతగిలే నతికిందఁబాయనివాఁడు
మూఁతి దోసిపట్టి మంటిముద్ద పెల్లగించువాఁడు
రోఁతయైన పేగుల పేరుల గలవాఁడు

చ. 2: కోడికూఁతనోరివాని కుఱ్ఱతమ్ముఁడైనవాఁడు
బూడిది పూసినవాని బుద్దులవాఁడు
మాడవన్నె లేటివెంట మాయలఁ దగిలినవాఁడు
దూడల నావులఁ గాచి దొరయైనవాఁడు

చ. 3: ఆకసానఁ బారేవూరి అతివల మానములు
కాకు సేయువాఁడు తురగముపైవాఁడు
ఏకమై వేంకటగిరి నిందిరారమణిఁ గూడి
యేకాలముఁ బాయని యెనలేనివాఁడు

రేకు: 0081-2 సామంతం సం: 05-296

పల్లవి: పెద్దపిన్నవరుసఁ బెరుగవలసి తా-
నిద్దరైన యాతఁడీతఁడు

చ. 1: మెరుఁగురెక్కల పెద్దమేని పులుగునెక్కి
యిరులుకొనెడి యాతఁడీతఁడు
ఎరమంటలెగయంగ నేచిన పురముల-
నెరియించిన యాతఁడీతఁడు

చ. 2: చల్లని చూపుల సతికి వలచి పోయి
యిల్లిటమున్నవాఁడీతఁడు
తెల్లనీటిపై దిక్కులు వెలుగఁగ-
నిల్లుగట్టిన యాతఁడీతఁడు

చ. 3: చూచిన చూపుల సుఖదుఃఖములఁజేయ-
నేచిన పెనుదైవమీతఁడు
ఆచందముల వేంకటాద్రిపై నెలకొని
యీచోటనున్న వాఁడీతఁడు

రేకు: 0081-3 ముఖారి సం: 05-297

పల్లవి: కంటిమి నీలాగులెల్లఁ గన్నుల యాఁకలి దీర
బంది బంటు తనమేల మాతోఁ బంతమింత చాలదా

చ. 1: మింటిమీఁది కంటిచూపు వంటలేని కూడు నీకు
గుంటిమీఁది తోడఁబుట్టు గొల్లవారికలిమి
ఒంటిగాక లోకమెల్లనొక్కటైన మేను మంచి-
జంటితోడిఁ బుటినాలు సుకమింత చాలదా

చ. 2: నాలుగు మోములబిడ్డ నవ్వుల సంసారము
వేలుమోపరానియిల్లు వింతవింతచెలువు
కాలిగోరఁ బుట్టినట్టి గద్దరికూఁతురు మంచి
పాలమీఁదిపడుక నీ బ్రదుకింత చాలదా

చ. 3: ఎల్లనాఁడు నురముమీఁద నెండగాయ కావిరాయి
గుల్లకూఁతతోడినోరు కొనగోరుబలిమి
చెల్లురా నీకింతవట్టు శ్రీవేంకటేశ్వరుఁడ
మల్లువారితోడి పోరుమానవింత చాలదా

రేకు: 0081-4 ముఖారి సం: 05-298

పల్లవి: కడగంటనే కెంపు గదురఁగాను
పడఁతి మురిపెపునటనఁ బాయ దేమియును

చ. 1: మగువ ముత్తియపు గమ్మల వెన్నెలలుఁ జిన్నిఁ
నగవువెన్నెలలు నున్నతిఁ బొలయఁగాను
జగడించి విభుని విరసంబులనె సొలయఁగా
మొగముననుఁ గోపంబు మొలవదేమియును

చ. 2: రమణికుచకుంభభారమును మొలనూళ్ళ భా-
రమును నెన్నడిమి సన్నము దెలుపఁగా
ప్రమదంపు విభునిఁ బెడఁ బాసి చెనకుచు లోని-
తమకంపు సంభ్రమము తరగదేమియును

చ. 3: ముదిత మై సింగారములుఁ జక్కదనములును
పదివేలు విధములై పరఁగఁగాను
కదిసి వేంకటవిభుని కమ్మఁగౌఁగిటి రతులఁ
జెదరు నలకల సిరులు చెదరవేమియును

రేకు: 0081-5 బౌళి సం: 05-299

పల్లవి: బహుకర్మభోగంపు పనులెల్ల నిట్లనే
యిహసుఖంబిందరికి నెట్లనో కాని

చ. 1: మెలుఁత విభుఁ బాసియును మితిలేని వేదనల-
నలరి యాతనిఁగూడు నభిరతుల నలసె
అలిగినను గూడినను కలిగె వలపులు దనకు-
నెలమిఁ దనసుఖములిఁక నెప్పుడో కాని

చ. 2: ఉడుగని వియోగాగ్ని నూర్పు గడు వేఁడాయ
కడు రతులతో నూర్పు గాఁగి వేఁడాయ
కడఁగిననుతాపంబె కప్పె మై తాపంబె
యెడలేని తమి యింత నెప్పుడో కాని

చ. 3: తిరువేంకటాచలాధిపునిఁ బాసినయపుడు
తరుణి యాతనినిపుడు తగఁ గూడినపుడు
పరవశము దఱచాయ పైపైనె ఘమమాయ
యిరవైన యెరుకలిఁక నెప్పుడో కాని

రేకు: 0081-6 శ్రీరాగం సం: 05-300

పల్లవి: కుంకుమచెమటలంటా గొఱగేవు మరు-
దొంకెన తామరల నెత్తురుచారలమ్మా

చ. 1: కోవిదునిమీఁద నేల కోపగించేవతని కె-
మ్మోవి కప్పు మరునియమ్ములతాఁకులే
తావుల వింతలకుఁ గాఁతాళించేవతనిపై
భావజువింటి పూవు బారిఁ బడెనమ్మా

చ. 2: నొసలి కస్తూరంటా నొగిలేవాతనిపై
కసటుఁగాఁకల కందుగందము చూచి
యెసగ గందవొడంటా యెట్టఁబారేవాతనిపై
పసని మదనుదాడి బలుదుమ్ములమ్మా

చ. 3: ఆఁటదాని గోరితాఁకుల నేవాతనిపై
నాఁటినచందురుని సన్నపు రేకలే
గాఁటపుఁ గాఁగిటను వేంకటపతి నీకు దక్కె
యేఁటికి నాతనివింకా నెగ్గులెన్నేవమ్మా

రేకు: 0082-1 శ్రీరాగం సం: 05-301

పల్లవి: ప్రతిలేని పూజ దలఁపఁగఁ గోటిమణుఁగులై
అతివ పరవశము బ్రహ్మానందమాయ

చ. 1: మానినీమణి మనసు మంచియాసనమాయ-
నానందబాష్పజలమర్ఘ్యాదులాయ-
మీనాక్షికనుదోయి మించుదీపములాయ-
నాననసుధారంబభిషేకమాయ

చ. 2: మగువ చిరునవ్వులే మంచిక్రొవ్విరులాయ
తగుమేనితావి చందనమలఁదుటాయ
నిగనిగని తనుకాంతి నీరాజనంబాయ
జగడంపుటలుకలుపచారంబులాయ

చ. 3: ననుపైన పొందులే నైవేద్యతతులాయ
తనివోని వేడుకలు తాంబలమాయ
వనిత తిరువేంకటేశ్వరుని కౌఁగిటఁ జేయుఁ
వినయవివరంబులరవిరిమొక్కులాయ

రేకు: 0082-2 ఆహిరి సం: 05-302

పల్లవి: మోహంపురతిముదము ముద్దుఁజూపుల మదము
దేహంపు సొబగెల్లఁ దెలిపె సదమదము

చ. 1: మించుమట్టెల గిలుకు మెరుఁగుగుబ్బల కులుకు
వంచుఁ జూపుల చిలుకు వసివాడుఁ బలుకు
మంచుఁ జెమటల తళుకు మనసు లోపలి యళుకు
అంచుటధరపుబెళుకు అలమేఁటి జళుకు

చ. 2: కరమూలములఁ గరఁగు కదలుఁ బయ్యెద చెరఁగు
సిరులచెలువపుమొరఁగు చెక్కుపై మరఁగు
గరగరికె తతులెరుఁగు ఘాతలంటిన తెరఁగు
గరిమెతో చెలియునికి కప్పురపుటరఁగు

చ. 3: కలికితనముల పోగు కమ్మఁదావులవేఁగు
వలపుతమకముల పరవశము పెనుజాగు
కలకంటిబాగు వేంకటపతికిఁ జెలరేఁగు
చెలియ సమరతుల మించిన వింత బాగు

రేకు: 0082-3 పాడి సం: 05-303

పల్లవి: ముద్దులు మోమున ముంచఁగను
నిద్దపుఁ గూరిమి నించీని

చ. 1: మొల చిరుఘంటలు మువ్వలు గజ్జలు
ఘలఘలమనఁగాఁ గదలఁగను
ఎలనవ్వులతో నీతఁడు వచ్చి
జలజపుచేతులు చాఁచీని

చ. 2: అచ్చపుఁ గుచ్చుముత్యాల హారములు
పచ్చల చంద్రాభరణములు
తచ్చిన చేతుల తానె దైవమని
అచ్చుట నిచ్చుట నాడీని

చ. 3: బాలుఁడు కృష్ణుఁడు పరమపురుషుఁడు
నేలకు నింగికి నెరిఁబొడవై
చాలించి వేంకటాచలపతి దానై
మేలిమిసేఁతల మించీని

రేకు: 0082-4 రామక్రియ సం: 05-304

పల్లవి: చూడరమ్మ యిటువంటి సుదతులు లేరెందు
యేడనైన నిటువంటి యింతులు వుట్టుదురా

చ. 1: ముదితనడపులలోని మురిపెమే వెయిసేసు
కొదమగుబ్బలతీరు కోటివేలు సేసు
సుదతిబిత్తరిచూపు సొన్నాటంకాలే సేసు
అదరబింబముతీరు ఆరువేలు సేసు

చ. 2: సన్నపు నడుము లోని సైకమే లక్షసేసు
పన్నుగాఁ బిరుఁదువన్నె పదివేలు సేసు
యెన్నిక మెఱుఁగుఁదొడలెంతధనమైనఁ జేసు
నున్నఁగా దువ్వినకొప్పునూరువేలు సేసునే

చ. 3: అంగనభాగ్యమెట్టిదో అతిమోహమై తిరు-
వెంగళరాయనికృప వేవేలు సేసునే
బంగారుచవికెలోఁ బడఁతిఁ గూడిన సొంపు
రంగుగాఁ జెలియరూపు రాజ్యమెల్లఁ జేసునే

రేకు: 0082-5 ఆహిరి సం: 05-305

పల్లవి: జవ్వనంపుమదమున జడిసేటి తరుణి
పువ్వుల పానుపమీఁదఁ బొరలీఁ జూడరే

చ. 1: ముత్తేలకంకణాల మురిసేటి కరము
చిత్తగించు చెలి నేఁడు చెక్కుమీఁదను
కొత్తనెత్తావి విరుల కొమరైన తురుము
వత్తుల నెరులతోడ వదలీఁ జూడరే

చ. 2: పయ్యెదవెలి మించు పగటైన గుబ్బలు
ముయ్యరాని పెనుతాపమునఁ గాఁగీని
వొయ్యారపు రచనలతో వొరపైన చూపులు
వొయ్యనె కన్నులనీట వులికీఁ జూడరే

చ. 3: కప్పురపుతావితోడ కరఁగేటి తనువు
వొప్పైన కస్తూరిచేత నొరపైనది
యిప్పుడిట్టె తిరువేంకటేశుఁగూడి యింతి
చెప్పరాని వేడుకలఁ జెలఁగీఁ జూడరే

రేకు: 0082-6 కన్నడగౌళ సం: 05-306

పల్లవి: ఏలా యీా యనుమానములింతి మనంబునఁ బాయని-
తాలిమి తప్పుదెరువున దాఁగెఁగదోయమ్మా

చ. 1: మాయపుమంటలు చల్లెడు మందమారుతము
పాయము దిరుగఁబారెడు పండుఁజందురుఁడు
కాయము తల్లడపరపెడు గండుగోయిలలు
యేయెడనోర్వదు చెలిలాగేలాగోయమ్మా

చ. 2: ఇంటఁ బుట్టిన యాతఁడే యింటఁ బుట్టిన యమ్ముల
యింటఁ బలుమారునేయఁగ నేమందునోయమ్మా
వింటఁ బాసిన శరముల వెంటఁ దగిలెడు నారిని
యంటిన మదనానలమిఁక నారుపరాదమ్మా

చ. 3: కొండలరాయఁడు చెలిచనుఁ గొండల నించిన గురుతులు
కొండుకచందురులైనవి కొత్తగదోయమ్మ
నిండిన విరహంబింతయు నేఁడిదె యమృతంబాయను
పండిన తమకము మేలై పలియించెనోయమ్మా

రేకు: 0083-1 రామక్రియ సం: 05-307

పల్లవి: కమలాన సౌభాగ్యము కలికితనంబులు సొబగులు
ప్రమదంబులు నింతంతని పలుకంగా రాదు

చ. 1: మించిన చొక్కులు మీరినయాసలు
పంచేంద్రియముల భాగ్యములు
యెంచిన తలఁపులు యెడపని వలపులు
పంచబాణుని పరిణతలూ

చ. 2: కనుఁగవ జలములు కమ్మనిచెమటలు
ఆనయముఁ జెలులకు నాడికలు
తనువున మఱపులు తప్పని వెఱపులు
వినుకలి కనుకలి వేడుకలు

చ. 3: మోవి మెరుంగులు ముద్దుల నగవులు
శ్రీ వేంకటపతిచిత్తములు
తావుల పూఁతలు దర్పకు వ్రాఁతలు
ఆ విభుఁగూడిన యలసములు

రేకు: 0083-2 పాడి సం: 05-308

పల్లవి: విభుని వినయములు వినవమ్మా నినుఁ
నభయంబడిగీ నయ్యా తాను

చ. 1: రహస్యమున శ్రీరమణుఁడు పంపిన
విహరణలేకలు వినవమ్మా
ఆహిపతిశయనంబతితాపంబై
బహువేదనకు అగపడె నటతాను

చ. 2: అదిమపతి నీ యడుగులు కెరగిన-
వేదాంతరచన వినవమ్మా
నీదయగానక నిమిషమె యుగమై
ఖేదంబున నలఁగీనట తాను

చ. 3: కింకరుఁడట నీ కినుకసేఁతలకు
వేంకటపతిగతి వినవమ్మా
సంకెలేక నీచనవున జగములు
కొంకకిపుడె చేకొనెనట తాను

రేకు: 0083-3 ముఖారి సం: 05-309

పల్లవి: ఎఱఁగవితని చంద మిట్టివాఁడనుచు నింతి
తెఱవల నీమీఁదఁ దేనోపుఁ జుమ్మీ

చ. 1: రంగుమీరిన మంచిరత్నాలు దాచిన నీ-
వుంగరాలచేతఁ బాదమొత్తకువమ్మ
అంగన పుట్టెనుఁ బాదమంటి శిలను దొల్లి
కంగి నీకుఁ బ్రతిమొన గడియించీఁ జుమ్మీ

చ. 2: కొమ్మ నీదు వాలారుగోళ్ళ నితనికిని
యిమ్ములఁ దొడలు సోఁకనియ్యకు వమ్మా
దొమ్ముల సిరుల గోరఁ దొడనింతిఁ బుట్టించె
కమ్మర నీకు నిట్టెకలిగించీఁ జుమ్మీ

చ. 3: నొక్కుచుఁ జెమటల పానుపున వేంకటపతి-
నుక్కున నీచనుఁగొండలొత్తకువమ్మా
పక్కనను గొండవేసి పానుపుజలది దచ్చె
చక్కని తరుణి నిట్టె సడిఁబెట్టీఁ జుమ్మీ

రేకు: 0083-4 భైరవి సం: 05-310

పల్లవి: కూరిమెరిఁగి కైకోవు-నీ-
బీరములే నెరుపేవు

చ. 1: రంతులె సేసిటు రావు -
యెంతైనాఁ జననీవు
చెంతలె కడుఁ దలఁచేవు -
ఇంతలోనె రవయ్యేవు

చ. 2: పొలయుచు నూరకె పోవు-
గిలిగింపుచుఁ దిరిగేవు
చెలఁగుచు వడి మురిసేవు-
నిలరా యించుక నీవు

చ. 3: బొంకుచు నూరకె పోవు-
తెంకికి నెవ్వతెఁ దేవు
వేంకటపతి నవ్వేవు-
పొంకమైతివిఁకఁ బోవు

రేకు: 0083-5 పాడి సం: 05-311

పల్లవి: సత్యభామ సరసపు నగవు
నిత్యము హరిమదినే నెలవాయ

చ. 1: రుకుమిణిదేవికి రూపయవ్వనికి
సకల విభవముల సౌఖ్యతలు
చికురాంబరమునఁ జెదరిన యలకలు
వికచాబ్జముఖము వెయివేలాయ

చ. 2: తొడవుల శ్రీసతి తొలుమెఱుఁగులమై
నడపుల మురిపెపు నగుమోము
తడయక వారిధి దచ్చిన హరికిని
బడలిక వాపను పరమంబాయ

చ. 3: అనుదినమును నీ యలమేలుమంగ
కనుఁగవ జంకెన గర్వములు
దినదినంబులును తిరువేంకటపతి-
చనవుల సొబగుల సంపదలాయ

రేకు: 0083-6 శ్రీరాగం సం: 05-312

పల్లవి: ఎట్టు సైఁతువె వలపు యింతి పరులు
రట్టునేయఁగ మిగుల రావపునె కొంత

చ. 1: రాక విభుఁడేపటి రాజసంబొకకొంత
చీకాకు పడఁజేయు చింత వొకకొంత
పైకొన్న చిత్తంబు పట్టరానిది గొంత
మేకులకుఁ జెలులాడు మేలమొకకొంత

చ. 2: పలుమారు వలయించు పరవశంబొకకొంత
పొలయలుకలను బొడము బూకలొకకొంత
కలికి కన్నులఁ బొలయు కాఁతాళమొకకొంత
కొలఁదిమీరిన మంచికోపమొకకొంత

చ. 3: గరగరిక వేడుకల కలపుకోలొకకొంత
వరుసఁ గోమలమైన వయసులొకకొంత
తిరువేంకటాద్రీశు దివ్యమహిమలు గొంత
సరిలేని పొందికల చనవులొకకొంత

రేకు: 0083-7 పాడి సం: 05-313

పల్లవి: రావే కోడల రట్టడి కోడల
పోవే పోవే అత్తయ్యా, పొందులునీతోఁజాలును

చ. 1: రంకెలు వేయుచు రాజులెదుట నీవు
కొంకు గొసరు లేని కోడల
పంకజముఖి నీవు పలుదొడ్డవారిండ్ల
అంకెలఁ దిరిగేవు అత్తయ్యా

చ. 2: ఈడాడ నలుగురు నేగురు మొగలతో
కూడి సిగ్గులేని కోడల
వాడకుఁ బదుగురి వలపించుకొని నీవు
ఆడాడఁ దిరిగేవు అత్తయ్యా

చ. 3: బొడ్డునఁ బుట్టిన పూఁపనికే నిన్ను
గొడ్డేరు తెస్తినే కోడల
గుడ్డముపయినున్న కోనేటిరాయని-
నడ్డగించుకొంటివత్తయ్యా

రేకు: 0084-1 సామంతం సం: 05-314

పల్లవి: ఎచ్చరించెదననిన యీజగంబనఁగాను
సచ్చరిత్రుఁడ నీకు సరకా వోరి

చ. 1: రుచుల నారాయణ పరో జ్యోతి యని
పచరించి నిను శ్రుతులు పలుకఁగాను
వచియింపరాని యిటువంటి నీ యెదుట నా-
కుచకుంభములకాంతి కొలుపునా వోరి

చ. 2: రమణ నారాయణ పరబహ్మమని
ప్రమదమున నిను శ్రుతులు పలుకఁగాను
తమకమున నను నీవు తగిలితివి యీసుఖము
నిమిషమాసుఖము గానేర్చువా వోరి

చ. 3: అరయ నారాయణ పరాత్పరంబని నిన్ను
సరసవిద్యలు శ్రుతులు చాటఁగాను
సిరుల ననుఁగూడితివి శ్రీ వేంకటేశ నీఁ
కరుణకిటు నేనోర్వఁగలనా వోరి

రేకు: 0084-2 భైరవి సం: 05-315

పల్లవి: వేంకటాద్రివిభునిఁబాసి విరహియైన రమణిఁ జూచి
రంకెలు వేయనేఁటికమ్మ రాజసమునను

చ. 1: విసప కోర సోఁకినపుడె వేఁడిలేని చందమామ
మిసిమిగలుగు వేఁడిచూపు మింట మలయునే
నొలికంటికాఁకనణఁగి నొగిలినపుడె తొడుగలేక
కుసుమశరము మదనుఁడతివకొరకు దాఁచెనే

చ. 2: చిగురుమేఁతకాండ్లెల్ల చెలఁగి మావికొమ్మలెక్కిఁ
మగువమీఁదఁగూఁతరేఁచి మరునిఁగూడిరే
తగవరైన దశరథేంద్రుతనయు శాపమొసఁగినపుడె
తెగువమీఁదఁగూఁతరేఁచ తెరఁగులెరఁగరా

చ. 3: నెయ్యమలర మంచివిరులశయ్య వేంకటాద్రివిభుఁడు
లియ్యమైనచెలికిఁ జనవులియ్యఁదొణఁ గెనే
కుయ్యవెరచెఁ గోవిలలును కుంకెఁ జందమామకళలు
తియ్యవింటివాఁడు వెనకతియ్యఁదొడఁగెనే

రేకు: 0084-3 శంకరాభరణం సం: 05-316

పల్లవి: జవ్వాది మెత్తినది తన-
జవ్వనమే జన్నెవట్టినది

చ. 1: ముద్దుల మాఁటలది చెక్కు-
టద్దముల కాంతినలరినది
గద్దరిచూపులది తన-
వొద్ది చెలియమీఁద నొరగున్నది

చ. 2: పుత్తడిఁ బోలినది తన-
చిత్తము నీసొమ్ముచేసినది
గుత్తపు గుబ్బలది అల-
చిత్తజుని లెక్కసేయనిది

చ. 3: ఎమ్మెలు యెఱఁగనిది తన-
కెమ్మోవిఁ జిరునవ్వు గెరలున్నది
కమ్ముకొనఁగ వెంకటారాయా నీ-
కమ్మనికౌఁగిటఁ గలశున్నది

రేకు: 0084-4 ఆహిరి సం: 05-317

పల్లవి: తిట్టినఁ దిట్టినదే తప్పా
బెట్టమ్మా గుంపెన నీచేత

చ. 1: వెనక మరలి నవ్వినదే తప్పా
వినమమ్మా నీ విభుఁడౌట
చెనకఁగ జంకించినదే తప్పా
అనవమ్మా నీ వాతనిఁ గినిసి

చ. 2: ఎదుట నిలిచి తురుమిడుటే తప్పా
వదలిన పయ్యెద వాలఁగను
అదన నలసి వుసురనుటే తప్పా
వుదుటుఁదమకముననుండఁ గలేక

చ. 3: కేలనె యిటు మొక్కినదే తప్పా
కాలు దాఁకి వేంకటపతికి
వోలి నే నతనిపై నొరగుటె తప్పా
మేలములాడుచు మెరయఁగనతఁడు

రేకు: 0084-5 రామక్రియ సం: 05-318

పల్లవి: దంతచ్ఛదముద్రా మదనాస్త్రల-
తాంతశాంతికృతిరహో భవతి

చ. 1: వనితాకుచయోర్వరనఖ రేఖా-
ర్జన శశిచిహ్నం సఫలమిదం
ఘనకరుణాం మయి ఘటయ చంద్ర ఇ-
త్యనునయకారణమహో భవతి

చ. 2: సతీమణీ విలసత్కరమూలే
చతురలాంఛనం సఫలమిదం
వ్రతతిభయహృతే వరదాస్య కలన-
మతిఘతాకృతిరహో భవతి

చ. 3: తరుణీ తనుగంధ విలేపన వి-
స్తరసౌభాగ్యం సఫలమిదం
పరిరంభసుఖే తిరువేంకటగిరి-
హరే: పూజనమహో భవతి

రేకు: 0084-6 శ్రీరాగం సం: 05-319

పల్లవి: ఇంతి కన్నీరొలుకనిట్లఁ జదివె
కొంతంపు కనుఁగొనల కోపమును జదివె

చ. 1: వెలఁది వినుకలినే వినికి విని తోడనే
తలపోఁతనదివొ చింతనసేసెను
తలకొన్న నేలవ్రాఁతలనె పాలుపుగ వ్రాసె
తొలుతఁ బాదపువేలి ధూళక్షరములు

చ. 2: పడఁతి కనుకలినే పులకవ్రాలును వ్రాసె
తడవి నీ చెలువ చిత్తపుఁ బలకనే
కడుఁదెలివికిని బాసి కలవెల్ల మఱచి తన-
పెడఁగు జెక్కు చేతితో వెదకినిదివో

చ. 3: వరుస గంటపువ్రాలు వ్రాసెఁ గొనగోరనే
కురుఁ బసల నీవు చెక్కులు గిల్లఁగా
తిరువేంకటాచలాధిపుఁడ నీతోఁగూడి
సరిలేని శబ్దశాస్త్రములెల్లఁ జదివె

రేకు: 0085-1 సామంతం సం: 05-320

పల్లవి: పడఁతి నినుఁదలచి పో పలుకఁడతఁడు, నీ-
వెడసినను బ్రాణంబులెరవులాతనికి

చ. 1: వెదచల్లు నీ మోమువెన్నెలలఁ దలఁచిపో
పొదలు వెన్నెలబయటఁ బొలయఁడతఁడు
ముదిత నీ నెరులు దురుమును దలఁచిపో యతఁడు
కొదమతేంట్ల గనిన గుండె జల్లనును

చ. 2: లలితాంగి నీ దేహలత దలఁచి పో యిపుడు
చెలఁగి వనమునకు విచ్చేయఁడతఁడు
వెలఁది నీమోవికావిరి దలఁచి పో యతఁడు
తలిరాకు గని గుండె తల్లడంబౌను

చ. 3: కోమలిరో నీ యిట్ల కూటములు దలఁచిపో
ప్రేమమితరములపైఁ బెట్టఁడతఁడు
దీమసపు వేంకటాధిపుఁడుగన యాతనికి
సామాన్యసరసతలు సరుకుగావరయ

రేకు: 0085-2 ముఖారి సం: 05-321

పల్లవి: ఏలే పడుసా యేదేని గుడుసా
చాలునేఁపకువే జవ్వనంపు గడుసా

చ. 1: వద్దేలే కసరు వలనని కిసరు
పొద్దువొద్దులకుఁ జూపుల యసరు
పెద్దైన వలపుల పిసరు లోన-
న్నద్దేవు నేనైతినసురుసురు

చ. 2: వచ్చేనేననవే నా వలపు చేకొనవే
మచ్చుచల్లక నామాట వినవే
ఇచ్చేననవే నీహృదయమింతటనైన
రిచ్చపడిన నాకూరిమి గనుఁగొనవే

చ. 3: రావే సంగడికి రతుల యంగడికి
శ్రీ వేంకటేశుఁడ నా చెంగటికిని
నీవే కౌఁగిటికి నిధులలోఁగిటికి
మోవీవే వెరవక మోహపుటాఁకటికి

రేకు: 0085-3 తెలుఁగుఁగాంబోది సం: 05-322

పల్లవి: చక్కఁదనములనే వేసాలఁబొయ్యేవు నీ-
యెక్కువలె యింతసేసె నెక్కడ చొచ్చేవే

చ. 1: వెన్నెలలకునె యింత వెరచేవు నీమోము
వెన్నెలలచే నెట్టు వేఁగించేవే
సన్నపుఁ దేంట్లకిట్టె జడిసేవు నెలఁత నీ-
యిన్ని నెరిఁదుమ్మెదలకెట్ల లోఁగేవే

చ. 2: చిలుకలకునే యింత చిమిడేవు నీ చిలుక-
పలుకుల నెక్కడికిఁ బారఁదోలేవే
చలిగాలికినె యింత జడిసేవు నెలఁత య-
గ్గలపుటూర్పుగాలికెక్కడ నొదిగేవే

చ. 3: మదనుఁడనినను వేమారు గలఁగేవు నీ-
మదనగురునికెట్టు మనసిచ్చేవే
ఇదె వేంకటేశుఁడు నిన్నెనసి కౌఁగిటఁగూడె
పొదలుఁదావులకెట్టు పొంగుచుఁ జొక్కేవె

రేకు: 0085-4 వరాళి సం: 05-323

పల్లవి: చూపులనే సొలసేవు చూడరాదా మమ్ముఁ
గాపురము సేయనీక కారించేవా

చ. 1: వదినెంటాఁ బిలిచేవు వద్దు సుమ్మీ యెవ్వరోయి
వదినెలు నీకు వాడవారి మరఁది
యెదురైతే మొక్కేవు యేఁటికోయి యింతేసి
వుదుటులు మాని చక్కనుండనేరవా

చ. 2: అత్తనంటాఁ బిలిచేవు అక్కడ నిక్కడ నీకు
అత్తలెవ్వరోయి వూరఁ బొత్తులల్లుఁడా
వత్తునంటాఁ జెప్పంపేవు వడదాఁకి కూకులును
వత్తులునై పోదుఁగాని వచ్చి చూడరాదా

చ. 3: చీర వెలిగా నవ్వేవు చెల్లఁబో యెక్కడనైన
మారుజాతి వారికైన మానములేదా
తీరు నీకు నింతేసి తిరువేంకటేశుఁడ
కూరిమి యెరిఁగి నన్నుఁ గూడితివౌరా

రేకు: 0085-5 కొండమలహరి సం: 05-324

పల్లవి: కొండలోఁ గోవిల గుయ్యి గుండె వగిలె నీ-
యండకు రాఁగాఁ బ్రాణమంతలో బ్రదికెరా

చ. 1: వలచి నిన్ను వెదకి వడి నే రాఁగాను
పులివలె మగఁడుండెఁ బోనియ్యక
తలఁచి నాకంతలోనే తల నొవ్వఁగాను
చిలుకుఁ బులకలెత్తి సిగ్గువలె వలపు

చ. 2: ఏమరించి యింటివారినెడసి నే రాఁగాను
గామైన బిడ్డయేడ్చెఁ గదలనీక
తామసించి యుండలేక తల్లడించఁగాను
చీమలు మైవాఁకినట్టు చిమ్మిరేఁగె వలపు

చ. 3: వుండలేక యిప్పుడు నీ వొద్దికి నే రాఁగాను
కొండవలె మరఁదుండెఁ గోపగించుక
బొండుమల్లెపరపుపైఁ బొరలేటి యిట్టి నన్ను
కొండలరాయఁడ నిన్నుఁ గూడించె నావలపు

రేకు: 0085-6 భూపాళం సం: 05-325

పల్లవి: రాయడికాఁడు గదమ్మ రంతు నేసీని
పాయపుసతులనే గోపాల గోవిందుఁడు

చ. 1: వట్టిమాయలఁ బెట్టవలదన్న మానఁడు
బెట్టుగ రేపల్లె గోపికలనెల్ల
యెట్టు వేగింతురమ్మ యెల్లవారలును
రట్టడియైనట్టి రాచగోవిందుఁడు

చ. 2: లేని పగలు చాటి లేమలనిందరిని
కాని కానిమ్మనుచుఁ గరఁగించీని
మాని మాని కమ్మర మగుడ మమ్మేఁచీని
రానిలే చూచుఁగాని రాచగోవిందుఁడు

చ. 3: పొద్దు వొద్దునకెంతే బూమెలు సేయుచును
వొద్దికై నాతోడ నొనగూడీని
అద్దో యింకా మానఁడాసలఁ బెట్టెడిని
గద్దరి శ్రీ తిరువేంకటపు గోవిందుఁడు

రేకు: 0086-1 ఆహిరి సం: 05-326
పల్లవి: జట్టిగొనెర నిన్ను జవరాలు
చిట్టంటు చేఁతల జెలఁగితివపుడు
చ. 1: వాలుకచూపులు వాడఁగ నాటక-
సాలలోన నిను జవరాలు
చాలుగ మురియుచు సరుగనఁ జివుకన
కాలఁ జిమ్మినను కలఁగితివపుడు
చ. 2: సొలపుగొనుచు మించుల మొలనూళ్ళ
సళుపుల మురిపెపు జవరాలు
గలగల గజ్జెలు గదలఁగ నునుఁదొడ
బలిమిఁ గదలిచిన బ్రమసితివపుడు
చ. 3: సొంపగు తల చంచుల మునివేళ్ళ-
సంపద నడపుల జవరాలు
యింపులు నెరవుచు నిటె నినుఁ గదిసిన
కంపించితి వేంకటగిరిరమణ

రేకు: 0086-2 సామంతం సం: 05-327

పల్లవి: అద్దిరా చిమ్ముల మాటలప్పటి నీకు
పెద్దరికాలనె మురిపెములే చిమ్మేవు

చ. 1: వద్దన్న మానవు నేనెవ్వతెరా నీకు నీ-
నిద్దురచూపులు నాపై నివాళించేవు
బద్దులెల్లనేడ నగపడెరా నీకు యీ-
ముద్దులమాటలాడుచు మోమే వంచేవు

చ. 2: డెందములో నేనిఁకనేఁటికిరా నీకు నీ-
యందిపాటుచేఁతల నన్నలయించేవు
కిందిచూపులేడ దొరకెరా నీకు నీ-
చెందమ్మిచేతుల నాచెఱఁగువట్టేవు

చ. 3: బింకములెవ్వతె నేరిపెరా నీకు నీ-
కుంకుమపూతలే చెరఁగునఁ గుప్పేవు
యింక నిన్నియునేల యిదె నీకు తిరు-
వేంకటేశ నాకౌఁగిట వేడుకఁ గూడితివి

రేకు: 0086-3 రామక్రియ సం: 05-328

పల్లవి: పంతమాడి పిలిచినఁ బలుకదెవ్వరితోడ
యింతవలచిన వలపెంచునైనఁ గలదా

చ. 1: వెక్కనపు గుబ్బలపైవేసిన కప్పురమెల్ల
నొక్కమాటే నీరాయనోయమ్మా
మిక్కుటమైన దీని మేనిమీఁది వెక్కచూచి
వక్కలాయ గుండె యిట్టి వలపెందుఁ గలదా

చ. 2: గుప్పెడి నిట్టూరుపుల కోమలిహారములెల్ల
వుప్పరాలెగయఁ జొచ్చెనోయమ్మా
వుప్పతిల్లుఁ జెమటల నోలలాడఁగానె మేను
నిప్పువలెనున్నదిట్టి నెయ్యమెందుఁ గలదా

చ. 3: కొయ్యతనమునిట్టె కోనేటిరాయనిఁ గూడి
వుయ్యాలమంచముమీఁదనోయమ్మా
పయ్యెదచెరఁగు జారఁ బచ్చిసేఁతలిన్నియును
ముయ్యఁజూచీ నిటువంటిమోహమెందుఁ గలదా

రేకు: 0086-4 బౌళి సం: 05-329

పల్లవి: ఎపుడు నాయెడ నికు నిదివలెనా
కపటాలు నిజములు కలిగినాతఁడవు

చ. 1: వెల్లిగా నీవూర్పు వేదమట వేఁడి
చల్లీని శ్రుతికి నుష్ణము గలదా
పెల్లుగ నిరువంకఁ బిరువీకులై వేఁడి
చల్ల నీదైనా వెచ్చనిది గావలదా

చ. 2: నగు నీమాటలే పురాణంబులట బొంకు
దగిలీని చదువులింతయు బొంకులా
తెగి యిరువంకలఁ దీదీపులై నీ
పొగరుల మాటలెప్పుడును నిక్కము లా

చ. 3: చలివేఁడిచూపుల జాణవట యిట్టె
బలసి నాపైఁ బరపఁగవలెనా
కలికివై తిరువేంకటవిభుఁడ నన్నుఁ
గలయక యలయించి కలిసితివిపుడు

రేకు: 0086-5 శ్రీరాగం-రచ్చెతాళం సం: 05-330

పల్లవి: కనలకువే మతి కలఁగిని యీా-
వనజోదరుఁడిదె వచ్చీనిపుడు

చ. 1: వడిఁ గుచభరమున వ్రాలెడి వేగము
నడవకువే సన్నపు నడుము
చిడుముడి నన్నుఁ జేసిన గోవిందుఁడు
తడయఁడు నిన్నుఁ దగిలీనిపుడు

చ. 2: కొప్పువేఁగుననె కుదిసిన మెడ గడు-
తిప్పకువే కందెడి సరులు
దప్పివొదలఁ బరితాపము నీమై
కప్పిన శ్రీహరి గదిసీఁ గాని

చ. 3: పొరలుచు నిట్టూర్పులను సురనియెదు
వెరవకుమెన్నఁడు వేదనల
కరఁగి నీవు వేంకటపతికౌఁగిట
మెరసితివిటు కడు మించిన రతుల

రేకు: 0086-6 ఆహిరి సం: 05-331

పల్లవి: అలికి సంపెంగ తావికణఁగి నట్టు
తొలఁగీ నుదుట జారి తుమ్మిదల పిల్లలు

చ. 1: వెలఁదియారను పాము వెంటఁబెట్టుకొని రాఁగా
తలఁకి చంద్రుఁడు వోయి దాఁగినట్టు
పలువెన్నె మెఱుఁగుల పయ్యదలోనె దాఁగె
చలివేఁడి మెఱుఁగుల చందమామపిల్లలు

చ. 2: కోవిలపలుకుదాడి కోపగించి వెంటరాఁగా
తావుల చిగురువోయి దాఁగినట్టు
మోవి సూదివాటులై మొనసి కానవచ్చిని
మావుల చిగురులోని మాణికాలపిల్లలు

చ. 3: భారమైన విరహతాపపు సూరియుండు రాఁగా
తారితారి చకోరాలు దాఁగినట్టు
కూరిమి వేంకటపతిఁ గూడిన తమకమున
గోరగించీనిదివో చకోరములు పిల్లలు

రేకు: 0087-1 ముఖారి సం: 05-332

పల్లవి: చాలుఁ జాలు నీ జాజర నన్ను
జాలిఁ బరచె నీ జాజర

చ. 1: వలపు వేదనల వాడేను యీా-
తలనొప్పులచేఁ దలఁకేను
పులకలమేనితోఁ బొరలేను కడుఁ-
జలిగొని చల్లకు జాజర

చ. 2: ఒల్లని నినుఁగని వుడికేను నీ-
చిల్లరచేఁతలఁ జిమిడేను
కల్లగందవొడిఁ గాఁగేను పైఁ
జల్లకు చల్లకు జాజర

చ. 3: తివిరి వేంకటాదిప నేను నీ-
కవుఁగిటికబ్బితిఁ గడు నేను
రవరవ చెమటఁ గరఁగి నేఁడు యిదె
చవులాయను నీ జాజర

రేకు: 0087-2 శ్రీరాగం సం: 05-333

పల్లవి: విరహంపుఁ గోమలికి వెలయంగఁ గలవెల్ల
అరుదుగాఁ బండి పొల్లయిన ఫలమాయె

చ. 1: వేమారుఁ జెలికి నరవిందశయ్యలె పరవ
బాముచెడి యిందునే బడలెఁ గాని
తామెరై డెందమీ తలిరుదేహములోన
లేమకిది గలిగియును లేని ఫలమాయె

చ. 2: వెలఁదిమై సురటులనె విసరఁగా లలితాంగి-
నలమి అదియే తాపమయ్యెఁగాని
పెలుచైన నిట్టూర్పు పెనుగాలి లోలోనె
కలిగియును తమవారుగాని ఫలమాయె

చ. 3: కాంత కనుదోయి నునుఁగలువలై కలువలనె
అంతకంతకు వగల నలపెఁ గాని
యింతలోఁ దిరువేంకటేశుఁ గూడియుఁ జెలికి
చెంతనే కనుదోయి చెంగలువలాయె

రేకు: 0087-3 ఆహిరి సం: 05-334

పల్లవి: మోవిపై వీడెపు కెంపు ముచ్చటాడఁగ
చేవవచ్చి చిగురుపైఁ జిమ్మిరేఁగీనే

చ. 1: వానగుబ్బలమీఁద వల్లెవాటుగా జార-
వేసిన వయ్యెదకొంగు వెంటఁ దూలఁగ
తీసిన ఘాతల ముద్దుఁదీగె చందురులమీఁదఁ
గానేటి వెన్నెలవలెఁ గానవచ్చీనే

చ. 2: వేఁకపు నెరులకొప్పు వెక్కసపు విరులతో
తేఁకువమీరఁగఁ గడు దీపించఁగా
చీఁకటిలోపల మించు చిన్నిచిన్ని వెన్నెలలు
తోఁకచుక్కలై చూడఁ దొంగలించీనే

చ. 3: పాదముల దాటించు పసిఁడి మట్టెల మోఁత
మోదపు కంకణరవముల మీరఁగా
గాదిలి నీ కౌఁగిటి వేంకటపతిమీఁదిపాట
వేదముల మీరినట్లు వెదచల్లీనే

రేకు: 0087-4 మాళవిఁగౌళ సం: 05-335

పల్లవి: చాఁచిన చలముల సటకాఁడ యిట్టె
వేఁచితివిపుడు నీవే కావోరి

చ. 1: విరులు గోయఁగ నన్ను వేడుకతోఁ జూచి
విరులెంత ప్రియమొ యీ వెలఁదికని
మరుని తియ్యని వింటి మాయపుఁ గ్రొవ్వాఁడి
విరులేయించితివి నీవేకావోరి

చ. 2: జలము గేళాకూళిఁ జల్లులాడఁగఁ జూచి
జలమెంత ప్రియమొ యీ సతికినని
చెలఁగి కాఁక చెమట చెలమ నాపై సేఁదు
వెలయఁ జేసితివి నీవే కావోరి

చ. 3: తొడవులిడుచు నేను తొంగలించఁగఁ జూచి
తొడవులే ప్రియము యీ తొయ్యలికని
కడుఁదొడవులే వేంకటరాయ కొనగోర
విడువకిచ్చితివి నీవే కావోరి

రేకు: 0087-5 దేశాక్షి సం: 05-336

పల్లవి: ఎప్పుడు వచ్చునో యంటా నెదురు చూచీఁ బతికి
దప్పిదేరు మోముతోడ దాఁచలేదు ప్రియము

చ. 1: వేఁటవోయిన మగఁడు వీధి రాఁగాఁ గిన్నెర
మీఁటుచుఁదా నిక్కిచూచి మేడపైనుండి
గాఁటపు గుబ్బలకొంగు గప్పదు జారిన నింత-
అఁటది వలచెనేని ఆఁపరాదు ప్రియము

చ. 2: ఇంతి చూడఁగానె విభుఁడేతుల గుజ్జము దోలి
చెంతనున్న సతులెల్ల చేతఁజూపఁగా
అంతలోనె యాకె తనువంతయుఁ బులకించె
పంతపుసతులకైనఁ బట్టరాదు ప్రియము

చ. 3: తేఁకువ మెరసి రాఁగా తిరువేంకటేశుఁ జూచి
వేఁకపుఁదురుముతోడ విజ్జవీఁగీని
కాఁకతోడఁ జిత్తమెల్లఁ గరఁగి నీరై మించె
యేఁకట నెవ్వరికైన నెంతగాదు ప్రియము

రేకు: 0087-6 సామంతం సం: 05-337

పల్లవి: ఎవ్వరికిఁ జెల్లునమ్మ యింతేసి పనులు
నొవ్వని నొప్పులతోడ నొగిలీఁ జెలియ

చ. 1: వీఁగెడి తురుముతోడ వేఁకపు సొమ్ములతోడ
కాఁగిన దేహముమీఁది కస్తూరితోడ
ఆఁగిన యాసలతోడ నతిరాజసముతోడ
వేఁగెడిఁ బ్రాణేశుఁబాసి విరహనఁ జెలియ

చ. 2: విప్పని రెప్పలతోడ వేఁడిచెమటల తోడ
పుప్పొడి దాఁకినమేని పొక్కులతోడ
కప్పక కప్పిన మంచి కలికిపయ్యెదతోడ
కప్పురపుటూర్పులఁ గరఁగీఁ జెలియ

చ. 3: భావపువింతలతోడ పచ్చిసింగారముతోడ
ఆవులు వారెడిమేని అలపులతోడ
శ్రీ వేంకటేశ్వరుఁగూడి సిగ్గులగర్వముతోడ
ఆవలిమోమై మాఁటలాడీఁ జెలియ

రేకు: 0088-1 కాంబోది సం: 05-338

పల్లవి: భారపుటూర్పులతోఁ బవళించీవి వీఁడె
కూరిమిసతులు మేలుకొలుపరమ్మా

చ. 1: వేగినంతకునితఁడు వెలఁదులతోడి రతి
భోగించి వచ్చి నిద్రవోయీని
సోగకనురెప్పలు మూసుక యిప్పుడెంతేసిఁ
జాగరపుఁ బతితోడ చరచరమ్మా

చ. 2: వొప్పైన సతులతో వుదరములోపల
యిప్పుడు నితఁడు సుఖియించీని
దప్పిదేరు తనమోముఁదమ్మితోడనిదె వీఁడె
వుప్పవడముగఁ బాదాలొత్తరమ్మా

చ. 3: సరుగున మేలుకొని సరసపుఁ గౌఁగిట
గరగరికెల నన్నుఁ గలసీని
అరవిరి సురమున అలయుచును వీఁడె
తిరువేంకటపతిఁ దెలుపరమ్మా

రేకు: 0088-2 కన్నడగౌళ సం: 05-339

పల్లవి: తరుణికనుఁగవ మోద్పు తగఁ జూడరే
వరునిఁ దనమతి సొలసి వడిఁ జూచినట్లు

చ. 1: వెలఁది ముక్కున వెడలు వేఁడి నిట్టూరుపుల -
చెలువమెటువలెనుండెఁ జెప్ప-గదరే
చలముకొను నలులకును సంపంగి పెనుగాలి
కలకంటిమేనికిని కాపిడినయట్లు

చ. 2: పడతిపైనునుఁ జెమట పన్నీటితావితో
బడిబడినె యెట్లుండె భావింపరే
అడరు విరహానలంబప్పటప్పటికార్చ
కడువేగముదకముడుగక చల్లి నట్లు

చ. 3: ఇంతినెన్నుదుటిపై నిపుడు చెదరిన కురులు
వింతలై యెట్లుండె వివరించరే
సంతమై వేంకటేశ్వరుఁడు చెలినేఁపు శశి-
సంతముడుపఁగఁ దమము పరె విడిచినట్లు

రేకు: 0088-3 రామక్రియ సం: 05-340

పల్లవి: తమకమును దలపోఁతయును గలదెందాఁక
అమరుఁ జెలువము దనకు నందాఁకఁ దరుణి

చ. 1: విరసంపు మరునిపై వెరపు మతికెందాఁక
ఆరయఁ దనయాపదయు నందాఁక
సిరిదొలఁకు జవ్వనపు సిగ్గు నీకెందాఁక
అరవిరి విలాసంబునందాఁకఁ దరుణి

చ. 2: ఎనయు ముదములును దనయేతులును నెందాఁక
అనుఁగుఁ గోరికలు దనకందాఁక
కనుఁగొనల నవ్వులును కాఁకలును నెందాఁక
అనవరతసుఖము దనకందాఁకఁ దరుణి

చ. 3: తలఁపు వేంకటవిభుని తగులు గలదెందాఁక
అలరుఁదెలుపులు మతులునందాఁక
కలయునాతని చనవు కరుణగలదెందాఁక
అలవోక పరిణతలునందాఁకఁ దరుణి

రేకు: 0088-4 సామంతం సం: 05-341

పల్లవి: బొంకకురే చతురుఁడప్పుడె వచ్చీనా
సంకు దేరీఁ జూపు మంచి సుద్దో మద్దో

చ. 1: వన్నెలాఁడి చెలి నీవు వచ్చుదాఁకా యిటె
వున్నదానఁ బ్రాణములునుచుకొని
వున్నతుఁడా తఁడు మమ్మునొలిసీనా యేలె
కన్నుల నవ్వేవు చెలి కాయో పండో

చ. 2: చక్కనమ్మ నీమాఁట చల్లుదాఁకా యీ-
చెక్కుమీఁది చేతితోను చింతించేను
నిక్కమునాతనికింక నేనేలే నీవు
నొక్కకువే నాచెక్కు నుయ్యో కొండో

చ. 3: కప్పురగంది యింత దగ్గరకువే నీ-
వప్పుడే కౌఁగిట నన్ను నలమేవు
అప్పఁడు వేంకటవిభుఁడలరించె నిదె
యిప్పుడె యీతనికృప యీఁతో మోఁతో

రేకు: 0088-5 వరాళి సం: 05-342

పల్లవి: నిలు నిలు దగ్గరకు నీ యాన నీకు
వలచితినని మావారెల్ల నగరా

చ. 1: వద్దు వద్దు కొండలలోవారికి మాకింతేసి
పెద్దపెద్ద ముత్యాలుపేరులిన్నేసి
అద్దము చూచిదె నాకు నంతకంటె సిగ్గయ్యీని
గద్దరి మాచెంచువారు గని నిన్ను నగరా

చ. 2: చాలుఁజాలు బంగారు సరుపణు లుంగరాలు
నీలపుఁగంట సరులు నీకే వుండనీ
మూలనుండేవారు గాక ముత్యాలచెరఁగుల-
చేలగట్టుకొన్న నన్ను చెంచెతలు నగరా

చ. 3: రాకురాకు యీడకు నీ రమణుల పాదమాన
నాకు నీకు నింతేసి ననుపేఁటికి
దీకొని కూడితి నన్ను తిరువేంకటేశ యీ-
కాకరిచేఁతలకు లోకమువారు నగరా

రేకు: 0088-6 మలహరి సం: 05-343

పల్లవి: నిద్దిరించి పాల జలనిధివలెనే
వొద్దిక శ్రీరమణునికి వొత్తరే పాదములు

చ. 1: వేగుదాఁకాఁ జిత్తగించి విద్యలెల్ల నాదరించి
బాగుగాఁ గృపారసము పంచి పంచి
యేగతిఁ బవ్వళించెనో యెట్ల భోగించెనో
యోగీంద్రవరదుని వూఁచరే వుయ్యాలను

చ. 2: వాలుఁగన్నుల రెప్పల వడదాఁకి తనుతావి
చాలుకొన్న వూర్పులు చల్లి చల్లి
నీలవర్ణపుగుణము నెరవుచు నొకయింత-
కాలము గన్నులఁ దిప్పికప్పరే దోమతెర

చ. 3: సరుగన యోగనిద్ర చాలించి లోకమెల్లఁ
గరుణించఁ దలఁచి వేంకటగిరిపై
అరుదుగ సకలలోకారాధ్యుఁడయి మించి
విరివి నాలవట్టాలు విసరరే సతులు

రేకు: 0089-1 శ్రీరాగం సం: 05-344

పల్లవి: అటు గొంతకాలంబులనుభవించఁగఁ గలిగె
యిటు గొంతకాలంబు యివి చూడవలనె

చ. 1: వెన్నెలలుఁ జీఁకట్లు వెలఁది సుఖదుఃఖములు
కన్నుదెరచి మూయుటలు గతులు నవగతులు
మన్ననలు వొల్లములు మగువ పగలును రేయి
తన్నుఁదానె సమకూడుఁ దనుఁదానె తొలఁగు

చ. 2: కిందు మీఁదైవచ్చుఁ గినుకలును దాలిములు
ముందు వెనకగుఁ జెలియ మోదఖేదములు
పొందికలు పాయుటలు పొలఁతి సౌభాగ్యములు
ఇందరికి సరిగాఁగ నెదురెదురనుండు

చ. 3: మరచినను తలఁచినను మనసు తనపైనుండు-
టెరుఁగునది తిరువేంకటేశ్వరుండు
తెరవనిదె కరుణించె దేవుఁడే నాయకుఁడు
తరితీపుసేయుఁ గాని తలఁపులోనుండు

రేకు: 0089-2 ఆహిరి సం: 05-345

పల్లవి: అప్పుమైన నీయరే యమ్మలాలా నేఁ-
డప్పుడా రగించీనదె యమ్మలాలా

చ. 1: వాడుదేరి వదనము వడదాఁక నిందాఁక-
నాడివచ్చెఁ జూడరే యమ్మలాల
నీడకేఁగనెరఁగఁడు నిక్కపు బాలునివలె
ఆడనీడ దిరిగాడీనమ్మలాల

చ. 2: వెడ్డు వెట్టీనాటలకు విచ్చేసేనని నన్ను-
నడ్డములాడకురే యమ్మలాల
దొడ్డివారియిండ్లెల్లాఁ దూరి తూరి పారాడీ-
నడ్డములు నిడుపులు నమ్మలాల

చ. 3: వేఁకువజాముననుండి వెయిమారులారగించు
నాఁకటికోరువలేఁడమ్మలాల
తేఁకువ వేంకటగిరిదేవుఁడైన బాలుఁడిదె
ఆఁకతాడువట్టి తీసీనమ్మలాలా

రేకు: 0089-3 నారణి సం: 05-346

పల్లవి: పంతపు బిగువులఁ బదరేవు నీ-
వంతలు మానుప వసమా వోరి

చ. 1: వేఁకపుఁ దురుముల వెలఁదుల యలకల-
చీఁకటి దవ్వుచుఁ జెలఁగేవు
ఆఁకటి చూపులనలసి మలయు నీ-
కాఁకలు మానుపఁగలనా వోరి

చ. 2: సన్నపు నగవుల సతుల కపోలపు-
వెన్నెలలే యిటు వెదకేవు
వన్నెలతనువున వాడుచు నొయ్యన
తన్నేవు నేనితరమా వోరి

చ. 3: పడఁతుల కుచముల పరిమళపుఁ జెమట-
తడిపయ్యెదలను దాఁగేవు
కడుఁ గౌఁగిట వేంకటగిరివర నను
పుడికెదవంతకోపుదునా వోరి

రేకు: 0089-4 ఆహిరి సం: 05-347

పల్లవి: పచ్చిదేరే వలపు బయలువెరపు
నచ్చుగోరి నాటు కిన్నరి తంత్రి మీటు

చ. 1: వెలయఁ జల్లనిగాలి విరులెదిర్చిన జాలి
తలఁప పూధూళి చిత్తజు వయ్యాళి
కలయ వెన్నెల వెలుఁగు కాలకూటపు నలుఁగు
పలుకుఁ దేనెలచిందు బడబాగ్నివిందు

చ. 2: అగడు గోవిలకూఁత అంగన నొసలివ్రాఁత
నిగనిగని పన్నీరు నిప్పులయేరు
సొగసుచాలనిచోటు చురుకుటలుగుల పోటు
నగవుఁ జిలుకల నుడుగు నమ్మించు పిడుగు

చ. 3: తనివోని రతికాఁక తప్పుసేయని యాఁక
వనితకీపతిమాట వలపుమూట
వినయంపు రతికింపు వేంకటేశ్వరు సొంపు
తనువుమెత్తనిపరపు తనువెల్లమరపు

రేకు: 0089-5 ఆహిరి సం: 05-348

పల్లవి: ఉవిదతనులత యేఁటికులికి పడెనే
కవ మదనబాణాగ్నిఁ గాఁగదుగదా

చ. 1: వనితలావణ్యంపు వదనశశికలములు
చనుగిరులపై నేల జారివడెనే
వెనకఁ దురమను రాహు వేవేలు రూపులై
తనర ముఖచందురుఁడు తలకఁడుగదా

చ. 2: మొలకలై గుమురులై ముదితమై మరునంప-
ములుకులంతటనేల ముణుఁగఁబడెనే
పొలయు మరునస్త్రమటు పుంఖానుపుంఖములు
పొలఁతిమీఁదనె రాశివోయఁడు గదా

చ. 3: కొమరైన పెనుదండు కుసుమాయుధుఁడు గదలి
తెమలి రాకిపుడెట్లఁ దిరుగఁబడెనే
విమలాంగికౌఁగిటను వేంకటేశ్వరునిఁ గని
భ్రమసి ప్రతిదండనుచు పదరఁడుగదా

రేకు: 0089-6 ముఖారి సం: 05-349

పల్లవి: చెప్పిన హృదయము దలఁకెడు చెలి దానిపుడెట్లున్నదొ
అప్పుడు పరితాపంబున నలసిన చందములు

చ. 1: వేడుకతో సంగీతము విని కన్నుల మెచ్చుచు-
నాడుచుఁ బ్రాణేశ్వరుఁగొనియాడెడి చందములు
కాడిన మర్మపుమాటల కంపంబునఁ దలయూఁపుచు
చూడక చూచిన చూపుల చొక్కెడిచందములు

చ. 2: చనుఁగవ సన్నపు చెమటలు జారెడి పయ్యెదనార్చుచు-
నొసరిన నిట్టూర్పులచే నూటాడెడి చందములు
తనువునఁ బలుమరుఁ బొడమెడి దట్టపు పులకాంకురములు
అనువున మెత్తక కరమున నంటిన చందములు

చ. 3: తిరువేంకటగిరివల్లభు దేవశిఖామణికౌఁగిట
తరుణి మనోభవుబారినిఁ దప్పిన చందములు
యిరవుగ నాతని చేఁతలు నింపగుఁ బరవశములచే
దొరలిన మరపుల నెరుకలఁ దూలెడి చందములు

రేకు: 0090-1 ముఖారి సం: 05-350

పల్లవి: కొండల గుబ్బల నాతో గోరాదిగొనేవు
కొండల నావులఁగాచిన కోడెకాఁడఁ గాన

చ. 1: వంకలకురులదాన వద్దు నే నీకు మూఁడు-
వంకలవెంటఁ దిరిగేవాఁడఁ గాన
సంకుమెడదాన నీతో సరివచ్చేనా
సంకుచేతి నన్ను నీవు జట్టిగొంటి చాలదా

చ. 2: యేనుఁగు నడుపుదాన నేల నే నీకు తొల్లి
యేనుఁగుఁ గాచినవాఁడ యేనుఁగాన
మీనుకవగంటిదాన మెచ్చేవా నన్ను మేటిఁ
మీననై జలదిలో మెరసినవాఁడను

చ. 3: చీఁకటితురుముదాన చేరకు నన్ను
చీఁకటి నల్లనిమేని చెలువుఁడను
వేఁకపుఁ బిరుఁదుమీఁద వేయకు చెయి
వేఁకమైన భూమిమోఁచే వేంకటవిభుఁడను

రేకు: 0090-2 ఆహిరి సం: 05-351

పల్లవి: ఎడయాట మాటల నేచినవలపు
పొడమిన యాసల పొద్దొకవలపు

చ. 1: వేఁకమైన కోరికె వినుకలి వలపు
కాఁకలఁ బొరలుటెల్లఁ గనుచూపువలపు
మూఁకలైన తలఁపులు ముదినవలపు
ఆఁకలిదీరని పొందులడియాసవలపు

చ. 2: నడురేయి గమనము నాఁటినవలపు
విడువనితాపము వేఁడివేఁడివలపు
తడఁబాటు తానౌట తలఁపనివలపు
నిడివేఁడి యూర్పులు నెట్టుకొన్నవలపు

చ. 3: తిరువేంకటేశుపై తిరమైనవలపు
సరసరీతులచేత సరిలేనివలపు
గురుతైన రచనలు కూడినవలపస
తరుణికి నతనికిఁ దగులైన వలపు

రేకు: 0090-3 నాదరామక్రియ సం: 05-352

పల్లవి: నెలఁతకుఁ గొండలతిమ్మని నేనిదె తోడ్కొనివచ్చెద
ఎలనాగలు మీరిందరు నేమరకుఁడి చెలిని

చ. 1: వలపుల రెనికి చెంగలువల కొండము చొర మొక్కుఁడి
అలులకు పూఁదేనియ సోయగములు మెయికొనుఁడి
ఫలరసములు మీఁదెత్తుఁడి పదరి చిలుకలకును గోవిలలకు
పొలఁతికి కెందమ్మిరేకులు పోయుఁడు బడిమిగను
చ. 2 కట్టుఁడి సన్నపువలిపెము కర్పూరముఁ బన్నీరును
దట్టముగాఁ బైనలఁదుఁడి తరుణీమణికి
ఒట్టుఁడి జాజులు పరపున నొరపెరిఁగిన చెలికత్తెలఁ
బెట్టుఁచి మరుబలములచే బెగ్గిలి పడకుండ

చ. 3: చిగురునఁ గెంపులు మొలచెను చిత్రము చూడఁగదమ్మా
మొగుడులపైనల చంద్రుని మూఁకలు మరిగినవి
మొగమున బిత్తరిచేఁతలు మును లేనివి చెలికబ్బెను
మగువయు తిరువేంకటపతి మమతల పరిణతలు

రేకు: 0090-4 కేదారగౌళ సం: 05-353

పల్లవి: సువ్వి సువ్వి సువ్వని
సుదతులు దంచెదరోలాల

చ. 1: వనితల మనసులు కుందెన చేసిటు
వలపులు తగ నించో లాల
కనుసన్నలనెడు రోఁకండ్లను
కన్నెలు దంచెదరోలాల

చ. 2: బంగారు చెరఁగుల పట్టుపుట్టముల-
కొంగులు దూలఁగనోలాల
అంగనలందరు నతివేడుకతో
సంగడి దంచెదరోలాల

చ. 3: కురులు దూలఁగ మంచి గుబ్బచన్నులపై
సరులు దూలాడఁగ నోలాల
అరవిరి బాగుల నతివలు ముద్దులు
గురియుచు దంచెదరోలాల

చ. 4: ఘల్లు ఘల్లుమని కంకణరవములు
పల్లవ పాణులకోలాల
అల్లన నడుములు అసియాడుచు సతు-
లొల్లనె దంచెదరోలాల

చ. 5: కప్పుర గందులు కమ్మని పువ్వుల-
చప్పరములలో నోలాల
తెప్పలుగా రతిఁ దేలుచుఁ గోనే-
టప్పనిఁ బాడెదరోలాల

రేకు: 0090-5 శ్రీరాగం సం: 05-354

పల్లవి: కూరిమిచేఁతలు కొండలుఁ గోట్లయి
గారవించి యింతిఁగాచినది

చ. 1: వన్నెల మాటల వాకిటితంగెటి-
జున్నుకు వడగాలి సోఁకినది
విన్నని చూపుల వెన్నెల బయిటను
సన్నపు ముత్యాలు చల్లినవి

చ. 2: ముద్దుల నవ్వులు ముంగిటిబంగారు
అద్దములోఁ జిగురంటినది
తిద్దిన మెఱుంగు దీఁగెకుఁ బన్నీట-
నద్దుట గడు వేడుకైనది

చ. 3: చక్కని కొండల చరులీ వెన్నెల-
వక్కలు పైపైనె వాలినవి
యెక్కువై శ్రీ వేంకటేశుని కౌఁగిటి-
నొక్కుల కిట్టే నోఁచినది

రేకు: 0090-6 శ్రీరాగం సం: 05-355

పల్లవి: ఎట్టు ధరియించెనో యీ యింతి హృదయంబు
పట్టనెట్లోపునో ప్రాణవాయువులు

చ. 1: వడియుఁ జెమటలనుఁ దుడువఁ గరాని పన్నీట
తడియుఁ బయ్యెదయుఁ దత్తరమందు మనసు
సుడియుఁ దమకములచే సొలయు నలపుల మేన
విడియుఁ బులకలు చూడ వెరగైన మోము

చ. 2: మురియుఁదలఁపులును జలమునఁబొదలు మదనాగ్నిఁ
నురియుదేహంబు గడు నుదుటుఁగోరికలు
విరియు మానంబు నరవిరి సొలపుమాఁటలునుఁ
గురియు మోహజలంబు కొదలుఁజూపులును

చ. 3: వెదచల్లునూర్పులును వెలితైన నవ్వులును
సదమదంబైన పలుచనిమేనిపూఁత
అదన శ్రీ తిరువేంకటాద్రీశు కౌఁగిటను
గదిసి యింపులఁ బొదలఁ గలిగె నీ చెలికి

రేకు: 0091-1 ఆహిరి సం: 05-356

పల్లవి: ఇంతి చేసిన భాగ్యమిట్లుండె దైవకృత-
మింతయును గడపంగ నెవ్వరికి రాదు

చ. 1: విరహవేదనచేత వేఁగెడి విలాసినుల
సొరిది నింతకు మున్ను చూడమో వినమో
అరుదైన దుస్తరంబై ధరించఁగరాని-
దురవస్థలెవ్వరికి దొరకవనికాక

చ. 2: తల దోఁకలేని చిత్తమున వలపులఁ బొరలు-
పొలఁతులింతకుమున్ను పుట్టరో చనరో
అలవోక తెలుపులును అబ్బురపు మరపులును
కొలఁదిమీరుట మిగుల గోరమనికాక

చ. 3: దేవతాకృపగలిగి దివ్యవైభవములను
భూవలయమున సతులు పుట్టరో మనరో
శ్రీ వేంకటేశుఁడీచెలియకిచ్చిన చనవు-
లేవెలఁదులకు నాతఁడియ్యఁడనికాక

రేకు: 0091-2 భైరవి సం: 05-357

పల్లవి: ఎవ్వతెరా నినుఁజూచె నేమని పుత్తెంచె
పువ్వుబంతి నిను వేసి పొందుచూపి మొక్కినది

చ. 1: వీడియు వీడని కొప్పు వేఁగున వీఁగుచు మాట -
లాడియు నాడక చెలినల్లన దూరినది
వాడియు వాడని తమ్మివంటిమోము గలది తాఁ
జూడక చూచిన వాలుఁజూపుల బిత్తరిది

చ. 2: జారియు జారని గుబ్బచన్నుల పయ్యెదది లో-
నారియు నారని కోపమైన మోహముది
పేరియుఁ బేరనికాఁక- బెచ్చువెరిగినది తాఁ
జేరియుఁ జేరక నీ చేరువ దాఁగినది

చ. 3: మాట లాడుచును మోవి మఱఁగు నేసినదొక-
పూఁటలోనె నీ కౌఁగిటి పొందులనుబ్బినది
యేఁటికిరా తిరువేంకటేశుఁడ బొంకఁగ నీ-
నాటకపు బ్రియముతో నన్నుఁ గలసితివి

రేకు: 0091-3 దన్నాసి సం: 05-358

పల్లవి: ఏమి బాఁతి నేఁడిదె నీకు మముఁ
గామించు సిరులింతె కదవయ్యా

చ. 1: వెనక ముందర వెలయఁగ ముందర-
వెనకలింతే విభవాలు
వనితల పిఱుఁదులు వాఁడికుచములు కొప్పు
కనుఁగొన భ్రమలింతె కదవయ్యా

చ. 2: వెలుఁగు చీఁకటి విరసాలు విభవాలు
కలిమిలేములే కదవయ్యా
పలువన్నె మాటలు పనితేటలు నివి
కలవెంత కలలింతె కదవయ్యా

చ. 3: పగటుగుబ్బలు పాయపునడపులు
తగులుమాఁటలు తమకయ్యా
తగు వేంకటగిరిదైవమ నీ పొందు
తగులు దొరకుటమృతము సోఁకుటయ్యా

రేకు: 0091-4 ముఖారి సం: 05-359

పల్లవి: మాటలు నేరుతువుగా మాయమ్మా
యేఁటికి నాతని నీవే యేలవమ్మా

చ. 1: చేయరాని విన్నపాలు నేసిసేసి విభునింత
మాయలఁబెట్టితివి గా మాయమ్మా
రాయడించి యిఁకను నారాజ్యమెల్ల నీవే
నేయవమ్మా నేనేమి సేసేనమ్మా

చ. 2: ఎందును నీకతఁడు నోరెత్తకుండ మంత్రాలు
మందులు నేరుతువుగా మాయమ్మా
చెందరాని సుఖమెల్లఁ జెలఁగి యాతఁడు నీవే
చెందవమ్మా నాకేల చిన్నదానికమ్మా

చ. 3: వన్నెల వేంకటపతి వలఁబెట్టి యతనిచే
మన్ననఁ బొందితిగా మాయమ్మా
నన్నుఁజూడుమిఁకను నీ ననిచిన యతని నే
సన్నలఁ జిక్కించుకొంటిఁ జాలదా నాకమ్మా

రేకు: 0091-5 అమరసింధు సం: 05-360

పల్లవి: తలఁచిన దేహము నిలువదు తాననుఁ దలఁచునో తలఁచఁడొ
వలనుగఁ జెలిమాటలు విని వచ్చీనో రాఁడో

చ. 1: శిరసున నంటిన పునుఁగిటు చెక్కుల జారెడిననుచును
ఉరవడిఁ దివియుచుఁ గొనగోరూఁదిన చందములు
మురిపెపు మొలనూళ్ళపై మొగపుల సొబగులు చూచుచు-
నరుదుగ గరమున నక్కడ నంటెడి యాసలును

చ. 2: చెనకుల వీడెపురసమిదె సెలవులఁ జెదరెడిననుచును
నునుపగు గోళ్ళ వాతెర నొక్కినచందములు
పెనగొను ముత్యపుసరముల పెక్కువ దీర్చెదననుచును
చనవునఁ జనుఁగవపై జే చాఁచిన చందములు

చ. 3: వుద్దపు నడపులలోపల నొయ్యన పాదము జారిన-
నొద్దికతో నునుఁగౌఁగిట నొరసిన చందములు
నిద్దపుఁ దిరువేంకటగిరినిలయుఁడు ననుఁ దనకౌఁగిట-
నద్దిన కస్తూరిచెమటల నలమిన చందములు

రేకు: 0091-6 భూపాళం సం: 05-361

పల్లవి: సువ్వి సువ్వి సువ్వలమ్మ
నవ్వుచు దేవకి నందనుఁ గనియె

చ. 1: శశి వొడచె అలసంబులు గడచె
దిశల దేవతల దిగుళ్ళు విడిచె

చ. 2: కావిరా విరిసె కంసుఁడు గినిసె
వావిరిఁ బువ్వులవానలు గురిసె

చ. 3: గతిసేసె ఆటు గాడిద గూనె
కుతిలకుడిచి జనకుఁడు నోరుమూసె

చ. 4: గగురు పొడిచె లోకము విధి విడిచె
మొగులు గురియఁగ యమున పై నడచె

చ. 5: కలి జారె వేంకటపతి మీరె
అలమేల్మంగనాచారలుకలు దీరె

రేకు: 0092-1 శ్రీరాగం సం: 05-362

పల్లవి: వాఁడు నాకు నిక్కముగా వలచినను
నేఁడు వచ్చి బంటువలె నిలుచుండుమనవే

చ. 1: సిగ్గు గొంత పరులపై చింతగొంత తనకు
యెగ్గు గొంత నామీఁదనేఁటివలుపే
అగ్గలమై తానేలే అన్నిలోకములును
తగ్గనీక నాకునిట్టే దక్కఁగ నిమ్మనవే

చ. 2: బొంకు గొంత సత్యములు పొందు గొంత తనకు
యింకా మానఁడు నాపైనేఁటివలుపే
సంకెలేక వెంటవెంట సటలెల్ల విడిచి
కొంకక నాయందలము గొలిచి రమ్మనవే

చ. 3: రచ్చగొంత రాఁపుగొంత రాజసము దనకు
యెచ్చుగొంత కుందుగొంత నేఁటి వలుపే
వెచ్చనై కౌఁగిటఁ గూడె వేంకటేశ్వరుఁడు
మచ్చిక నిట్టెయాకు మడిచి యిమ్మనవే

రేకు: 0092-2 సావేరి-జంపె సం: 05-363

పల్లవి: మెచ్చెనొకరాగంబు మీఁద మీఁద కడు-
నిచ్చెనొకరాగంబు యింతులకునెల్ల

చ. 1: చేసెనొకరాగంబు చెలియెదుటఁ గన్నులనె
మూసెనొకరాగంబు ముదిత మతినె
పూసెనొకరాగంబు పొలఁతిపులకలమేన
వ్రాసెనొకరాగంబు వనిత నినుఁబాసి

చ. 2: పట్టెనొకరాగంబు ప్రాణములపై నలిగి
తిట్టెనొకరాగంబు తిరిగి తిరిగి
పుట్టెనొకరాగంబు పొలఁతిడెందమునకును
మెట్టెనొకరాగంబు మెరయుచునె కదలి

చ. 3: కురిసెనొకరాగంబు కొప్పు పువ్వులనె సతి
మురిసెనొకరాగంబు ముంచి మేన
తిరువేంకటేశ్వరుఁడ తెలుసుకో నినుఁబొంది
పొరసెనొకరాగంబు పొలఁతికుచములనే

రేకు: 0092-3 రామక్రియ సం: 05-364

పల్లవి: చాలుఁ జాలు నీతోడి సరసాలు యిట్టె
పాలిండ్లకొంగుజారి బయటఁ బడితిమి

చ. 1: సిగ్గువడితిమిర నీ చేసిన చేఁతలకు-
నగ్గమైతిమిర మరునమ్ములకును
దగ్గరి నీకాఁకలఁ దగులఁబట్టి నేఁడు
బగ్గన నిందరిలోనఁ బలచనైతిమి

చ. 2: నొగిలితిమిర నేము నోఁచిన నోములకు
పొగిలితిమిర నీపొందులకును
తెగి నీవు నన్ను రతిఁదేలించి తేలించి నాకు
పగటు బిగువులెల్లఁ బచ్చిగాఁ జేసితివి

చ. 3: దప్పిఁ బడితిమిర నీతాలిములనే కడు
నొప్పిఁ బడితిమీర నీ నొక్కుఁజేఁతల
ఇప్పుడిట్టె తిరువేంకటేశుఁడ నీవు నా-
కొప్పు సవరము దీసి కొల్లగొంటి మానము

రేకు: 0092-4 కాంబోది సం: 05-365

పల్లవి: వలుపేడఁ గలిగెనే వామలోచనకు దీని
వలపించినటువంటివాఁ డింకనెవ్వఁడో

చ. 1: సిరులు గల మోమెల్ల చిరునవ్వుగనుదోయి
విరివైన పురమెల్ల వేఁకమైన గుబ్బలు
తరుణికి వెనకెల్లఁ దురుము పిఱుఁదులును మంచి-
నిరతంపు నడపెల్ల నిండుమురిపెములు

చ. 2: జలజాక్షినిలువెల్ల చక్కఁదనముల పోగు
కలికితనమెల్లఁ గన్నులపండువు
కలకంటివయసెల్ల గడుఁ గోమలము దీని-
పలకుఁదేనియలెల్ల పంచదారకుప్పలు

చ. 3: చెలువైన మోవెల్ల చిలుకవోట్లు దీనిఁ
కలదేహమింతయునుఁ గస్తూరివాసనలు
అలరించెఁ దిరువేంకటాధీశ్వరుఁడు దీని-
తలఁపెల్ల విభునిలో దాఁగున్న కరువు

రేకు: 0092-5 కాంబోది సం: 05-366

పల్లవి: ఎవ్వతిర ప్రియము నీకింత నేసినది చూచి
దవ్వుల నిన్నొకమాఁట తగులనాడినది

చ. 1: సిబ్బెంపు గుబ్బలమీఁది జిలుగుఁ బయ్యదది
గబ్బిచూపు నిన్నుఁ జూచి కన్నుల నవ్వినది
బబ్బిలికాయలతోడి పసిఁడిమెట్టెలది
జొబ్బిలిన చెమటలచేఁ జొక్కి నిలిచినది

చ. 2: తొంగలిరెప్పలతోడి తోరపుఁ గన్నులది
చెంగటిచెలియచేతఁ జెయివేసి నవ్వినది
చెంగలువబంతిచేతఁ జెక్కునొక్కినది
వుంగరాలవేళ్ళ నీ కొయ్యనె మొక్కినది

చ. 3: వీడక వీడని కొప్పువిరులు జారినది
వాడక వాడని మోవివన్నెలు దోఁచినది
యీడులేని తిరువేంకటేశ నినుఁబొంది యీ-
కోడెవయసున నింతి కోరికెలందినది

రేకు: 0093-6 ఆహిరి సం: 05-367

పల్లవి: జిగురువంటివాఁడె శినకాటి చింత-
శిగురమ్మఁబోనీఁడె శిన కాటి

చ. 1: సేఁతి కుత్తికవాఁడు సెడ కుండ దాఁచిన-
పాఁతపెద్దవిల్లు బలువున
నాఁతికొరకు వచ్చి నడిమికి విఱిశిన-
శేఁతలాఁడుగదె శినకాటి

చ. 2: రట్టడిశేఁతల రాకాశినాయని
పట్టపుశెలి యలిఁ బడవేశి
కొట్టఁ గొనముక్కు గోశివేశినట్టి-
శిట్టగీఁడుగదె శినకాటి

చ. 3: నలుపున వెంకటనగమునఁ గోనేటి-
నెలవున సొంపుతో నెలకొని
కలిమి పదుసుతోడి కాఁపురమున్నట్టి
శిలుగులాఁడుగదె శినకాటి

రేకు: 0093-1 పాడి సం: 05-368

పల్లవి: జాజు జాజేకాక దిరశపుఁ బువ్వౌనా
నీజాడెంతయిన నీవు మానేవా

చ. 1: సంపెంగపూవులలోన సారెకుఁ జూచిన తన-
కంపే కాక తనకాఁక మానీనా
యింపులు గొందరికి యీరసాలు గొందరికి
జంపుల నీ గుణముల జాడ మానేవా

చ. 2: పొగడ పూవులలోన పొందుగఁ జూచిన తావి
తగుఁగాక తా మదము మానీనా
నిగిడిన నీచేఁత నీ బోంట్ల కే కాక
మగిడి నీగుణములు మంచివయ్యీనా

చ. 3: కామించి కలువలు కన్నులనద్దుకొనిన
కామునమ్ములునేఁడు గాక మానీనా
దీమసపు వేంకటేశ తెమలని కూటముల
ఆమని మాకోరికల ఆస మానీనా

రేకు: 0093-2 ముఖారి సం: 05-369

పల్లవి: వంచిన పన్నీటఁబో వాడె నీమోము
మంచునఁ దామెరసొంపు మాయుఁగదవే

చ. 1: సంపెంగ నూనియనే మజ్జనము సేయఁగఁ బో
చెంపజారి తురుమెల్లఁ జెదరీ నేఁడు
గుంపులైన తుమ్మిదలు కొమ్మ నీయలకలివి
రంపపుఁగంపునకు వెరచుఁగదవే

చ. 2: జవ్వాది యెప్పుడు నీ నొసల మెత్తఁగానె పో
యెవ్వరు నిలిచిన నోరెత్తవు నేఁడు
కొవ్విన చిలుకపలుకులు దీనిగాలికి
దవ్వుదవ్వులనె కడు దాఁగుఁగదవే

చ. 3: ఒక్కటై వేంకటవిభుఁడొత్తినరేఖలఁ బో
చక్కని నీచనుఁ గొంగు జారీ నేఁడు
జక్కవపులుగులివి చందురుఁడుదయమైన
వుక్కమీరి బెదరుచునుండుఁ గదవే

రేకు: 0093-3 శంకరాభరణం సం: 05-370

పల్లవి: సల్లుసూవుల సలమారి యిఁక
వెల్లఁబో నన్ను సెనకఁడుగా

చ. 1: సంకు సక్రముల సక్కనయ్యకుఁ దన-
వుంకువవో నావొళ్ళెల్లా
సంకనున్న తన సదురాలి మొరఁగైన
సింకసూపు నాపై సిమ్మఁడుగా

చ. 2: మాపురేపుసూపు మాయలయ్యకుఁ దన-
దాఁపురమువో నాతలఁపెల్లా
వీఁపురమణికంత వెఱవకయినఁ దన
పూఁపనవ్వు నాపైఁ బుయ్యఁడుగా

చ. 3: వుసురుఁ బడుకమీఁదనొరగిన్న సక్కని-
రసికుఁడు వేంకటరాయఁడు
పసపుశీర నాకుఁ బరపుగాఁ బరిపించి
యెసగ నిట్టె సనవియ్యఁడుగా

రేకు: 0093-4 కేదారగౌళ సం: 05-371

పల్లవి: తనివిదీరమికిఁ గుంటెనలె యాస
అనుమతులకుఁ దాఁకనాడుటే యాస

చ. 1: సరినెలయింపులకు సళువుఁ జూపులె యాస
గిరుపుఁగన్నులకు జంకెనలె యాస
సరసంబునకు నలసపుఁ గసరులే యాస
మరు పెరరేఁపులకు మంతనమె యాస

చ. 2: కడుఁ గోరికలకుఁ లోఁగాఁతాళములె యాస
చిడిముడికాఁకలకుఁ జింతలే యాస
బడలికకౌఁగిటికి బట్టబయలే యాస
పడరానియెడఁ గడపటిచేఁతె యాస

చ. 3: రతిసమయమునకు రాకొట్టులే యాస
అతివమోహమునకుఁ గయ్యములె యాస
యితమైన తిరువేంకటేశు కౌఁగిటఁ గూడి
మతిలోనికెపుడుఁ దమకములె యాస

రేకు: 0093-5 శుద్ధదేశి సం: 05-372

పల్లవి: మొలనూలి గొల్లెత మురియుచును
వలవంతఁ దిరిగీని వాడవాడలను

చ. 1: సంపెఁగలతురుముతో చల్లలమ్మీనిదివో
పంపుమోము గొల్లెత వాడలను
యింపులకోరికె తో నిందిరాపతి యెదుట
జంపుల నటనలతో సాళగింపుచును

చ. 2: నొసలికస్తూరితోఁ గన్నుల నవ్వీనిదివో
పసివాడు గొల్లెత వాడలను
కసరుచు హరిమీఁదికాఁకల కోపముతో
యెసరుఁ జెమట గోర యెమ్మెలఁ జిమ్ముచును

చ. 3: చెలువంపుటుంగరాల చెయి వీచీనిదివో
వలపుల గొల్లెత వాడలను
కలికియై తిరువేంకటవిభుకౌఁగిట
అలసిన నటనల నల్లంతనేఁగుచును

రేకు: 0093-6 శంకరాభరణం సం: 05-373
పల్లవి: మెట్ట్లో నేననఁగానే మొక్కేవుగాని
వెట్టినేను వెట్టినేను వెట్టినేను సుమ్మీ
చ. 1: సడ్డలాడఁగానే కడు జారినపయ్యద చూచి
యెడ్డ నన్ను జాణఁజేసేవేఁటికో కాని
వడ్డివారే వలపుల వన్నెవెట్టనేర నే
గొడ్డేరే గొడ్డేరే గొడ్డేరే సుమ్మీ
చ. 2: ఒల్లననఁగానే నన్నునుద్దండపుఁ దుటారాల
చల్లలమ్మఁగానే పగ చాటేవు గాని
కల్లలాడనేర నీతో కపటాలు నేర నే
గొల్లదాన గొల్లదాన గొల్లదానఁ జుమ్మీ
చ. 3: వేంకటేశుఁడ నేనంటా వేసాలఁ బొయ్యేనంటా
అంకులచేతులుచూచి యంటితి గాని
కంకిగా గుబ్బలమీఁద గాజునఁ దీసేవు నే
వుంకువొల్ల నుంకునొల్ల నుంకునొల్లఁ జుమ్మీ
రేకు: 0094-1 కేదారగౌళ సం: 05-374

పల్లవి: దశవిధాచణం తన్నభవతి దశవిధావస్థార్థం తే తత్ర

చ. 1: స్థాపయిష్యామి వేదానితి వ్యాజేన దీపితోయం మత్స్యదేహ: పురా
వ్యాపారోయ మేవం నచ తరుణ్యా రూపజలధౌ కేళిరుచయే తత్ర

చ. 2: ధారయిష్యామి మందరమితి వ్యాజేన చారుకచ్ఛప విధాచ. పురా
నీరసేయం తవ మనీషా ప్రియవధూ భారకుచమందరౌ భర్తుం తత్ర

చ. 3: భువముద్ధరిష్యామి పునరితి వ్యాజేన ధవళ కిటి వైభవం ధత్సే పురా
వ్యవహృతిరియం నచ మహామహీకుచతటే తవ దంతక్షతం దాతుం తత్ర

చ. 4: దనుజం హరిష్యామి తమితి వ్యాజేన ఘన నారసింహవిక్రమణం పురా
దనుజర తవ మహత్త్వం తన్నచ నఖార్జనమిందిరాయా ప్రసర్తుం తత్ర

చ. 5: అపరిహరిష్యామి బలిమహమితి వ్యాజేనకపటవామనరూపకలనం పురా
నిపుణ ఏవం నఖలు నియతిస్సతీషు తే కపటాచణం ఘటయితుం తత్ర

 చ. 6: సంహరిష్యామి నృపజనమితి వ్యాజేన బహ్వారుణతోయేప్రాప్తి: పురా
సింహవిక్రమణతే స్థితిరియం నచ సతీ విహ్వలత్వం తదా వేత్తుం తత్ర

 చ. 7: రావణం జేష్యామి రణ ఇతి వ్యాజేన భూవరత్వే తే భోగ: పురా
ఏవం నభవతి మహీసుతా విరహంసావధానేన ప్రహర్తుం తత్ర

చ. 8: కంసం హనిష్యా మి ఖలమితి వ్యాజేన సంసారోయమాచరిత: పురా
హింసాదూర నచ హితమిదం వ్రజవధూసంసరణలీలాం ప్రసక్తుం తత్ర

 చ. 9: పాతయిష్యే ప్రలంబమితి వ్యాజేనజాతరోషస్య తే జననం పురా
భూతరక్షక తే ప్రభుత్వం తన్నఖలు భూతలే రేవతీం భోక్తుం తత్ర

 చ. 10: బుద్ధో భవిష్యామి పురహృతివ్యాజేన బద్ధరోష ఇతి తేప్రాప్తి: పురా
తద్ధితం నహిఖలు తదా వధూహస్త సిద్ధ ప్రసారేణ సేవితుం తత్ర

 చ. 11: మారయిష్యామి కలిమతమితి వ్యాజేన క్రూర కల్క్యవతారకోప: పురా
ధీర వేంకటనగాధీశ ఏవం నఖలుభీరుముర్వీంసంప్రీణయితుమత్ర

రేకు: 0094-2 ముఖారి సం: 05-375

పల్లవి: ఎంత సేయఁగనేరదింతి గోపించినను
కంతుని గెలిపించెను ఘనుఁడైన విభుని

చ. 1: సతవింత తాపాన చందురుఁడేపఁగఁ బో
ప్రతిచందురుండాయ పడఁతిమోము
అతివఁ గోవిలకూఁతలలయించఁగాఁ బో
తతిఁ గోవిలలకూఁత తానాయఁ బలుకు

చ. 2: మలయానిలుఁడు దన్ను మలసి యేఁచఁగఁ బో
చెలివూర్పు చిరుగాలిఁ జిత్రెంచెను
తలపోఁతచింత చిత్తము సేయఁగాఁ బో
కలికిచిత్తము పతికడకంటెనిపుడు

చ. 3: తిరుగఁ జంద్రుఁడు తన్ను తిలకించగాఁ బో
ధరియించెఁ గుచముల తానతని
తిరువేంకటగిరిదేవునికౌఁగిటి-
సిరులఁబో యిన్నిటాఁ జెలువాయె నిపుడు

రేకు: 0094-3 ఆహిరి సం: 05-376

పల్లవి: నిన్నుఁ గూడిన విభుని నిలువెల్ల సొంపాయ
నిన్నియును నొనగూడె నింతలోపలనె

చ. 1: సొలపు నీ కడగంటిచూపు హృదయము గాఁడి
లలినితఁడు శ్రీవత్సలాంఛనుండాయ
వెలఁది నినుఁ బెడఁ బాసి విరహంపుమెయికాఁక -
వలన నీతఁడు నీలవర్ణుఁడైనాఁడు

చ. 2: అదన నీ చనుగుబ్బలను చక్రముల చేతఁ
బదిలపరపుచు చక్రపాణియైనాఁడు
సుదతి నీ దేహమున సొబగు కుంకుమపూఁత-
లెదిగి పీతాంబరంబితనికి నాయ

చ. 3: ఆలింగనాపేక్షనయంబు నినుఁగూడ
లోలుఁడటుగాన నాలుగుచేతులాయ
శ్రీలలితమూ ర్తియగు శ్రీ వేంకటేశ్వరుఁడు
పాలించె నిను నీకుఁ బరితోషమాయ

రేకు: 0094-4 ముఖారి సం: 05-377

పల్లవి: కందువ నేఁడెందరైనాఁ గలరు నీకు
యిందరిలో నాప్రియమీడేరీనా

చ. 1: సన్నలు సేసేటి వారు సరసమాడేటివారు
కన్నుల మొక్కేటివారు గలరు నీకు
విన్ననై యిందరికిని వెరవనే కాక నాఁ
విన్నపమెంతైన నీకు వినఁదీరీనా

చ. 2: తేఁకువఁ జేరేటివారు తేనెల మాఁటలవారు
కాఁకలు సేసేటివారు గలరు నీకు
యేఁకటనిందరికడ నెడతాఁకనేకాక
సోఁకనాడే నావంక చూడఁగూడీనా

చ. 3: ముద్దులు గునియువారు ముచ్చటలాడెడివారు
గద్దించి తిట్టెడివారు గలరు నీకు
తిద్దిన నీవిద్యలివి తిరువేంకటేశ నా-
వొద్దఁ గూడి యిట్ల నీకు వుండఁగూడీనా

రేకు: 0095-1 మాళవి గౌళ సం: 05-378

పల్లవి: సీతక పడుసు దోసిటి పాల మగఁడు - బాతి పడిన నగపడునటె వీఁడు

చ. 1: మూడు గాళ్ళపెద్ద ముసలి సవులుగొన్న పాఁడిమేకల పాల పాశము
వేఁడి జుట్టినతల్లి వేఁకటియై కన్న- వాఁడు వీఁడు శిన్న వాఁడటె వీఁడు

చ. 2: కొండలంత సను గుబ్బలరాకాశి - మిండెత గవిశి పై మింగ రాఁగా
గుండె వగులనొక్క కోలనె సరగన -సెండివేసినట్టి సిసు వటె వీఁడు

చ. 3: వుడుకు నుదుటివాఁడు వుదుటున దాఁసిన- బెడిదపు మోతల పెనువిల్లు
తొడికి విరిశివేశి దోమటి నునుఁబాల- కడుపుల తొలి పెండ్లికొడుకటె వీఁడు

చ. 4: మారుదల్లి సేతిమాటలఁ బడలేక -వూరు విడిశి యడవులకేఁగి
సేరవచ్చిన యింతి సెవులు ముక్కుఁగోశి - పేరువారిన పెద్దబిరుదటె వీఁడు

చ. 5: పొగదాగు తపసుల పుల్లవెలుగు మంట - లగడు శేయఁగ ముగురసురల
సగము సాయ సంపి సడిఁబెట్టి విడిశిన-బగిడికాఁడు సిన్నపడుసటె వీఁడు

చ. 6: మిసమిస మెరసేటి మెగముమేనిపై - పసలఁ దగిలి వెంటఁ బారి పారి
గసిక వింటికోల గరిగాఁడనేసిన -మసిమాయల సలమరి గదె వీఁడు

చ. 7: రవ్వల సేఁతల రాకాశినాయని - కొవ్విన మదము తె క్కోలుగొని
యివ్వలఁ దిరువేంకటేశుఁడై యున్నాఁడు -గువ్వెక నిను జట్టిగొనెఁగదె వీఁడు

రేకు: 0095-2 శ్రీరాగం సం: 05-379

పల్లవి: ఇప్పుడెట్లున్నదో యిందువదన
అప్పటికిఁ గొంత గుణమాయ నావేళ

చ. 1: తెలువ శశికాంతవేదికమీఁద మలఁగుపై -
నొలిగి పరితాపాగ్నినుడుకఁ గాను
నెఱి దొలఁకు మోమువెన్నెలకు శశికాంతంపు -
టఱఁగు గరఁగిన శైత్యమాయెనావేళ

చ. 2: చెలియ పొన్నల విడ చిగురుఁబానుపుమీఁద
పలుమారు నినుదూరి పొడఁగాను
చెలఁగి పొన్నల విరియు చిలుకుఁదేనెల సోనఁ
దెలివొంది కొంత వడదీరెనావేళ

చ. 3: తొయ్యలి విలాసమున తఁగు మంచముమీఁద
పయ్యెదరజార నినుఁ బాడఁగాను
తియ్యమునఁ గూడితివి తిరువేంకటేశ్వరుఁడ
నెయ్యంపు వేడుకలు నినిచెనావేళ

రేకు: 0095-3 ఆహిరి సం: 05-380

పల్లవి: ఎంత మన్నించితో యీ యింతినిదె నీవు
అంతకంతకుఁ బ్రేమనలరీనిపుడు

చ. 1: పడఁతి నాట్యశ్రాంతిఁ బవళించి తొల్లి నీ -
తొడలపై నీవు తల దువ్వఁగాను
కడలేని యటువంటి కళలు దలఁచే కదా
విడువని వియోగమున వేఁగీనిపుడు

చ. 2: ఒనరఁ గుచభారమున నొరఁగి యీ మలఁగుపై-
నెనసి నీవాకు మడిచియ్యఁగాను
వనిత నేఁడటువంటి వలపుదలఁచే కదా
ఘనమైన తాపమునఁ గాఁగీనిపుడు

చ. 3: సిరులు నీ మోముపైఁ జెక్కు లొయ్యన చేర్చి
యరమోడ్చి కనురెప్పలలమి యలమి
తిరువేంకటాచలాధిపుఁడ నినుఁ గూడియే
పరవశానంద సంపదఁ దేలెనిపుడు